

# పదేండ్ల తరువాత వాళ్ళు ఎలా ఉంటారో ఊహించండి.




ఆరోగ్యం రూపం దాల్చినట్టు ఉంటారు వాళ్ళని చూసి మీరు గర్వపడతారు ఎందుకంటే ఒక తల్లిగా వాళ్ళకి ఉజ్వలమైన భవిష్యత్తు ఉండేటట్టు చూడటానికి మీరు ఇప్పటి నుంచె చేయవలసినదంతా చేస్తున్నారు

వారి పట్ల మీ అపారమైన ప్రేమలో ఒక ముఖ్యమైన భాగం వారికి సరైన పోషణ శక్తి లభించేటట్టు చూడటం

హార్లిక్స్ యొక్క పోషణ ఎదిగే కాలంలో వాళ్ళకి అవసరమైన పోషణ



"ఆరోగ్యం, పెరుగుదల కోసం హార్లిక్స్‌లో కీలకమైన పోషకాలు ఉన్నాయి–ప్రొటీన్స్, పిటమిన్స్, మినరల్స్, కార్బొహైడ్రేట్స్.

ఇంకా, పండ్లు గట్టిగా ఉండటానికి, ఎముకలు ఆరోగ్యంగా ఉండటానికి అదనపు కేల్షియం.

పిల్లలు పెరిగే కాలంలో వారి సర్వతోముఖ ఆరోగ్యానికి, సత్తువకి."




**మంచి పుష్టికరమైనది**

HTA 6223 TEL

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

విడిప్రతి వెల నాలుగు రూపాయలు!

సంపుటం 82 స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు సంచిక 28

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248

# ఎయిర్ బస్ విషాదాంతం!

"ఎయిర్ బస్" అంటే ఏరంత విమానం. ఒక్క చిన్న కొండకు రెక్కలొచ్చి, అది అమాంతం ఎగురుతూ ఒక చోట నుంచి మరొక చోటికి, రెక్కలు ఆడ్చుకుంటూ దిగుతున్నట్లుగా అనిపిస్తుంది ఎయిర్ బస్ ప్రయాణం!

దూరాభారాన్ని, దూరాల మధ్య తేడాని తగ్గించే విమాన ప్రయాణాలలో సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతున్న కొద్దీ ప్రమాదాలు తగ్గడానికి బదులు ఒక్కొక్కసారి- అదే సాంకేతిక ప్రజ్ఞ, పాటవాలు ఎదురు తిరిగి ఘోర ప్రమాదాలు సంభవించడం యిటీవల ఎక్కువైంది. అటువంటి సంఘటనల్లో మొన్న పధ్నాల్గవ తేదీన, బెంగుళూరు వద్ద జరిగిన ఎ-320 ఎయిర్ బస్ విషాదాంతం ఒకటి! మనిషి బుద్ధితో ప్రమేయం లేకుండా కంప్యూటర్ల సాయంతో సురక్షితంగా ఆకాశయానం పూర్తి చేయ గలుగుతుంది అనుకున్న ఎ-320, ఫ్రెంచి విమానం-ఏరంతా యీది ఒడ్డున మునిగినట్టు-చావుకీ, రేవుకీ మధ్య దూరం ఒక్క క్షణం కూడా వుండదు సుమా! అన్నట్లు బెంగుళూరు విమానాశ్రయంలో కాక, అక్కడికి సమీపంలో నిర్మించబడుతున్న ఒక సువిశాల గోల్ఫ్ మైదానం మీదికి ముక్కుకి సూటిగా దూకి, ఆత్మాహుతి చేసుకుంది! దగ్ధపటలమైన విమాన శిథిలాల నుంచి కాలి, మాడిపోయిన తొంభై శవాలనైతే బయటికి తీయగలిగారు గానీ-వాటి నామరూపాలు నిర్ణయించడానికి బంధువులకు కూడా సాధ్యం కాలేదు.



ముఖచిత్రం:
"నా గాజుల చేతుల అందాలు చూడండి" అంటున్న తార గౌతమి
[ఫొటో:- కె. ఆర్. వి. భట్]
పైవారం:
పౌష్టికాహారం అంటే?

## పదండి లోపలికి!

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ముద్రాపకుడు: ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ 2-3-1990 శక. సం. 1911 ఫాల్గుణ మాసం 11వ తేదీ

విమాన వెనక భాగంలో కూర్చున్న కొంచెం మంది అదృష్టవంతులు షాక్ నుంచి తేరుకుని, ఈ విషాదాంతానికి సంబంధించి ఏమైనా చెప్పగలుగుతారా అంటే-అది కష్టమే అవుతుంది. కాక్‌పిట్‌కి దగ్గరగా వున్న ప్రయాణీకులకు-తోక దగ్గర కూర్చున్న ప్రయాణీకులెవరో తెలుసుకునే లోగానే, యిటువంటి ప్రయాణాల్లో బొంబాయి బెంగుళూరు అయిపోతుంది.

దర్యాప్తు తర్వాత బ్లాక్ బాక్సు, డిజిటల్ ఫ్లైట్ డేటా రికార్డరు, కాక్‌పిట్ వాయిస్ రికార్డర్‌లు చెప్పే విశేషాలను విశ్లేషించితే తప్ప-ప్రమాదం యంత్ర వైఫల్యం కారణంగానా? పైలట్ బుద్ధిలోపం కారణంగానా? అన్నది తేలదు. కానీ, యీలోగా మరొక ఘోరప్రమాదం మరొక చోట జరగనే జరుగుతుంది-(అలా జరగకూడదన్నదే మనందరి దృఢమైన ఆకాంక్ష) ఈ ప్రమాదం గురించి అంతా మర్చిపోవచ్చు.

అయితే ఈసారి ఫ్రెంచి ఎయిర్ బస్ ఎ-320, దారుణ ప్రమాదం ఎన్నెన్నో ప్రశ్నలను- రాజకీయ, సాంకేతిక, నైతిక సందేహాలను లేవనెత్తింది. ఇండియన్ ఎయిర్‌లైన్స్ అధికారి -శ్రీ ఆర్. ప్రసాద్ తక్షణం తమ పదవికి రాజీనామా చేశారు. కేంద్ర ప్రభుత్వం ఈ ప్రమాదం గురించి హైకోర్టు జస్టిస్ ఆధ్వర్యంలో విచారణ జరపాలని నిర్ణయించింది. తీగలాగితే డొంకంతా కదిలినట్లు-ఫ్రాన్స్ నుంచి కొనుగోలు చేసిన యీ కంప్యూటర్ చోదిత ఆకాశ శకటాలు-భారత గగన తలానికే పనికి రావని-అవి మనదేశంలో వేడిమికి తట్టుకోవని కొందరు అంటున్నారు. వీటి కొనుగోలు వెనకాతల కుంభకోణం వుందన్న రాజకీయ ప్రచారం అప్పుడే 'ఊపు' అందుకుంది. ఇదిలా వుండగా, ఈ ప్రమాదం మీద దర్యాప్తు చేయడానికి వచ్చిన ఫ్రెంచి కంపెనీ నిపుణుల బృందానికి అందకుండా భారత ప్రభుత్వం బ్లాక్ బాక్స్ వగైరాలను కెనడా పంపించాలని నిర్ణయించింది. మంచిదే! కానీ, యిదే సమయంలో కేంద్ర మంత్రి-తాత్కాలికంగా నైనా, యీ విమానాలను రెక్కలు కట్టి మూలపెట్టడానికి అంగీకరించడం లేదు. ఈ విమానాలు అతి ప్రమాదకరమైనవని, నిపుణులు క్షుణ్ణంగా పరిశీలించి చెబితే తప్ప వీటి వినియోగం కొనసాగిస్తామని పౌర విమానయాన శాఖా మంత్రి శ్రీ ఆరిఫ్ మహమ్మద్‌ఖాన్ అనడం దుస్సాహసమే! వివిధ రంగాల్లో అత్యంత అవసరమైన అతి ముఖ్యమైన వ్యక్తులు-తరుచుగా విమానాల్లో ప్రయాణం చేస్తూ వుంటారు. వారి ప్రాణాలకు కోరి ప్రమాదాలను కొని తెచ్చుకొనే నిర్ణయాలు తీసుకొనే ముందు-తటపటాయింపూ, సంకోచం చాలా అవసరం. అనుకున్నట్టుగానే-17వ తేదీ ఉదయం-ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కి చెందిన మరో ఎ-320 ఎయిర్‌బస్, మద్రాసు నుంచి బెంగుళూరుకు బయలుదేరిన వెంటనే-బహుశా పధ్నాల్గవ తేదీ నాటి ఘోర విషాదాంతం-చూసిందా? అన్నట్లు గగనతలం మీదికి లేచిన వెంటనే ముందుకు పోనని పేచీ పెట్టింది. అందులో వున్న 120 మంది ప్రయాణీకులు బ్రతుకు జీవుడా! అనుకున్నారు.

మద్రాసులో కన్స్యూమర్ ప్రొటెక్షన్ కౌన్సిల్ అధ్యక్షుడు శ్రీ ఆర్. దేశికన్ అనే ఆయన- గవర్నమెంటు మీద, ఎయిర్‌లైన్స్ మీద-ఈ ఎ-320 విమానాల మీద నఖశిఖ పర్యంత పరీక్షలు పూర్తయేదాకా, వాటిని నడపకుండా, కోర్టువారు ఆజ్ఞలు విధించాలని కోరుతూ కోర్టులో రిట్ కూడా వేశాడు.

ఇటువంటి భయం ఇది-మొన్న జరిగిన ఎ-320-దగ్ధకాండ ప్రాథమిక సమాచారాన్ని బట్టి చూస్తేనే కలుగుతోంది. కంప్యూటర్ సహాయంతో ఎయిర్‌పోర్ట్-'రన్-వే' అనుకొని గోల్ఫ్ మైదానంలోకి-మరింత విశాలంగా వున్నాయని కాబోలు-దిగిపోగా దాన్ని-పైలెట్ ఆకాశంలోకి తిరిగి లేవే ప్రయత్నం చేస్తూ వుండగా మైదానం ప్రహరీ గోడని గుద్దుకొని 'ఢామ్మని పేలి', మరుక్షణంలో అగ్నిజ్వాలల మధ్య చిక్కుకు పోయిందనీ ఒక ప్రత్యక్ష సాక్షి కథనం. లేదా, పైలట్ తన బుద్ధిని ప్రయోగించడం చేత కంప్యూటర్ తప్పుదారి తొక్కిందో మనకి నాలుగు మాసాల తర్వాత-దర్యాప్తు నివేదిక బహిరంగ పరిస్తే- గిరిస్తే-తప్ప తెలియదు! అందాకా మనది వేడి దేశం గనుక-పైలట్స్ యూనియన్‌ల మధ్య యిప్పటికే వున్న విరుద్ధ భావాలు మరింత ప్రేరేగక ముందే-తాత్కాలికంగానైనా- భయంకర ఎయిర్ బస్ విమానాలను మూలపెట్టడం మంచిది. ఇప్పటికే వీటికి వెయ్యి కోట్ల రూపాయల మూల్యం చెల్లించాము కనుక వీటిని వాడకుండా వుండడం వల్ల నష్టం వస్తుందనుకోడం తప్పు! ఎన్ని కోట్ల రూపాయలైన ఒక ప్రయాణీకుని ప్రాణాన్ని తిరిగి తీసుకురాలేవు [ఈ సంచిక అచ్చు పూర్తి అవుతుండగా-ఎ-320 విమానాల సర్వీసుని తాత్కాలికంగా నిలుపు చేస్తున్నారన్న సముచిత నిర్ణయం వెలువడింది-బహు సంతోషం!]

[17-2-'90]

తెలుగువారి నిరంతర సేవలో మాకిది 82వ సంవత్సరం

# తాజాకాలమ్

 వీరాజీ 

# పాకిస్తాన్ కొత్త పన్నాగాలు !

"నువ్వు అవునంటే నేకాదంటా, నువ్వు కాదంటే నేనవునంటా" అనే మాదిరి విదేశాంగ నీతి వున్న అమెరికా, రష్యా దేశాలే యివాళ యీ పెడధోరణికే తిలోదకాలిచ్చేస్తున్నాయి కానీ ప్రేగుతెంచుకొని భారతదేశం నుంచి విడిపోయి రూపుగట్టిన పాకిస్తాన్ దేశం మాత్రం తన విదేశాంగ నీతిని నాటి నుండి నేటిదాకా యింత పిసరు మార్చుకోవటంలేదు 1949 జనవరి 1 నాడు యుద్ధ విరమణ చేసిన తరువాత భారత-పాకిస్తాన్‌లమధ్య మొదట ఏర్పాటు చేసుకొన్న సరిహద్దు రేఖలకు అదనంగా



అసహజమైన, ఉద్రిక్త భూయిష్టమైన తాత్కాలిక యుద్ధ విరమణ రేఖ ఒకటి ఏర్పడిపోయింది. అప్పటి నుంచి 1965 దాకా పాకిస్తాన్, భారతదేశంమీద గెడ్డలు వేస్తూనే వుంది. చివరికి, 65లో యుద్ధానికి దిగి, చిత్తుగా దెబ్బతిన్నప్పటికీ భారత దేశాన్ని నిదించడం, దూషించడం, ద్వేషించడం యిదే ఒక విదేశాంగ నీతిగా ఆ దేశం పాటిస్తూ వచ్చింది. 'జియా-ఉల్-హక్' గవర్నమెంట్ ఉన్నంతకాలం కాశ్మీర్ ప్రాంతాన్ని ఏదో విధంగా కబళించాలనే ప్రయత్నిస్తూ వుండేవాడు. కాశ్మీర్‌లో ముస్లింల మెజారిటీ వున్నందువల్ల వారంతా పాకిస్తాన్‌లో విలీనమైపోవాలని కోరుకుంటున్నారని జియా ఉల్‌హక్ దుష్ప్రచారం చేయడమే కాకుండా కాశ్మీర్ లోయంతా బీభత్సప్రాంతమైపోయేవిధంగాఎన్నోతంత్రాలు, కుతంత్రాలు పన్నడంలో ఆయన అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించుకున్నాడు కానీ నిరంకుశపాలన క్రింద కుమిలిపోతున్న పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్య భానోదయం అయిన తరువాత- జియా విధాన వారసులలో మనోవికాసమేర్పడి భారతదేశం పట్ల విద్వేషం తగ్గుతుందని, 1972 నాటి చరిత్రాత్మక 'సిమ్లా ఒప్పందానికి' ఊపిరి వస్తుందని అందరూ అనుకొన్నాం

శ్రీమతి 'బేనజీర్‌భుట్టో' పాకిస్తాన్ పాలన చేపట్టగానే ఆమెను పాకిస్తాన్ మత ఛాందసవాదులు, జియావాదులు మున్నగు వారెందరో రకరకాలుగా అధిశంసించారు గానీ భారతదేశంలో మాత్రం అన్ని మతాల వారు, అన్ని జాతుల వారు ముక్త కంఠంతో హర్షించారు. 1972లో జుల్ఫికర్ ఆలీ భుట్టోతో ఆమె వచ్చినప్పటి సన్నివేశాలను మధుర'స్మృతు'లను పత్రికలు 'వేటిక'లు కట్టి పీఠికలు వ్రాసి ప్రచారం చేశాయి.

భారత-పాకిస్తాన్‌ల మధ్య ఒక నూతన శకం ఆవిర్భవించిందని భారతీయులంతా

పౌర విమానయాన శాఖామంత్రి అరిఫ్ మహమ్మద్ ఖాన్



విశ్వసించారు కానీ కొంచెం రోజుల్లోనే 'శ్రీమతి బేనజీర్‌భుట్టో' భారత్ పాక్ 'భాయి భాయి' అన్న సుహృద్భావ వాతావరణానికి స్థానికంగా వున్న రాజకీయశక్తుల ఒత్తిడికి లొంగిపోయి స్వస్తి పలకడంతో గత ఆరుమాసాలుగా యేర్పడిన వివత్కర స్థితి యీ రెండు దేశాల మధ్య ఎక్కువైపోయింది భుట్టో తనయగా 'సిమ్లా' ఒప్పందాన్ని గౌరవించవలసిన నైతిక బాధ్య తను కూడా శ్రీమతి బేనజీర్ విస్మరించడం దురదృష్టం

## అసలు కారణం

'ఆక్రమిత కాశ్మీర్'గా మనం, 'అజాద్ కాశ్మీర్'గా వారు వ్యవహరించే ప్రాంతంలో త్వరలోనే ఎన్నికలు జరగనున్నాయని అనుకుంటున్నారు అక్కడ శ్రీమతి బేనజీర్ పార్టీ అయిన 'పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ'కి ప్రస్తుతం యే మాత్రం బలం లేదు 'ముజఫరాబాద్'లో అధికారాన్ని చేజిక్కించుకొన్న 'ఇస్లామీ జమూరీ ఇత్తెహాద్' పార్టీతో ఎన్నికల యుద్ధం చేయడం కోసం పాకిస్తాన్ ప్రధానమంత్రి టెర్రరి



స్టులతో చేతులు కలిపినట్లు స్పష్టం అవుతోంది. పాకిస్తాన్ కాశ్మీర్‌లోకి సాయుధులైన, సుశిక్షితులైన ప్రాణాలకు తెగించిన టెర్రరిస్టు మూకలని పంపించింది చాలక ఆ మూకల మీద భారతదేశం తీసుకుంటున్న కఠిన చర్యలని యిప్పుడు ఖండిస్తున్నది.

అయితే యిటువంటి టెర్రరిస్టు ముఠాల సాయుధ సైనిక పటాలాలు నిరంతరం సరిహద్దుల్లో గస్తీ కాస్తుండగా మన ప్రాంతాల్లోనికి ఎలా చొచ్చుకొని వచ్చాయి? అన్న ప్రశ్నకి కాశ్మీర్‌లోయింతకాలం వున్న 'షేక్ అబ్దుల్లా' వంశస్థులే సమాధానం చెప్పాలి. పంజాబ్‌లోకి టెర్రరిస్టులు రాకుండా ఆపలేకపోయాం, కాశ్మీర్ భూభాగం అంతా చెల్లాచెదురైపోయి ప్రజలు భయభీతాహులై

పారిపోతున్న స్థితిని అరికట్ట లేకపోయినందుకు యిప్పుడు ఎవరిని నిందించాలన్నది కాదు మన తక్షణ ప్రశ్న "గొవుల మందలు ముందు ఆ వెనుక సైనిక పటాలాలు పంపించాడట వెనుకటికో మహారాజు" ఆ విధంగా పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతం నుంచి మన భూమి మీదకి వందలాది అమాయక ప్రజలని రెచ్చగొట్టి పంపిస్తున్నది నిరాయుధులైన యీ ప్రజలను ఆయుధాలతో త్రిప్పికొట్టినట్టయితే అంతర్జాతీయ వేదికమీద "బాబోయ్ భారతదేశం అమాయకులైన మా ప్రజల్ని కాల్చి పారేస్తోందని గగ్గోలు పెట్టి గోల చేయడానికి" మరొక సాకు దొరుకుతుందని పాకిస్తాన్ యీ పని చేస్తూ వుండవచ్చు

## ప్రచారం

అయితే అదే అంతర్జాతీయ వేదిక మీద భారతదేశం కూడా 'శ్రీనగర్' దూరదర్శన్ డైరెక్టర్‌ని కాల్చి చంపిందెవరు? కాశ్మీర్ అంతటా కుప్పలు కుప్పలుగా దొరికిపోతున్న పాకిస్తాన్ ముద్రలు, చైనా ముద్రలు వున్న తుపాకులు, బాంబులు ఎవరు తయారు చేసినవి అని అడగవచ్చు కదా? ఐక్యరాజ్య సమితిలో మళ్ళీ 'సెక్యూరిటీ కౌన్సిల్'కి పోతామని పాకిస్తాన్ ఏ నోరు పెట్టుకొని అడగ్గలదు? సమితిమీద సమితి నిర్ణయాల మీద గౌరవం వున్న దేశమయితే 1949లోనే పాకిస్తాన్, కాశ్మీర్ ఆక్రమించిన ప్రాంతం నుంచి వెనక్కి వెళ్ళిపోయి వుండేది 1965లో చావు దెబ్బతిన్న తరువాత ప్రపంచ దేశాలలో భారత-పాకిస్తాన్‌లు కలిసి వుంటే పేరుప్రఖ్యాతులని ఎక్కువగా సంపాదించవచ్చునని గ్రహించి వుండేది. ఉపఖండంలో దేశాలన్నీ ఐకమత్యంగా వుంటే ఆశియా దేశాల చరిత్రే మరో రకంగా వుండేది కానీ ఏం చేస్తాం?

కాశ్మీర్‌లో జరుగుతున్న టెర్రరిస్టు ఆగడాలకు అక్కడి స్థానికుల మద్దతు వున్నది అని అనుమానించే అమాయక వర్గాలు భారతదేశంలో ఎక్కువవుతున్నాయి కోట్ల కొలది డబ్బు ఖర్చు చేస్తూ వున్నా, ప్రభుత్వ సమాచార ప్రచార యంత్రాంగం యిటువంటి అమాయకులకు అనుమాన నివృత్తి చేసే పద్ధతిలో అక్కడి వాస్తవాలను చూపెట్టలేకపోతున్నాయి విదేశాంగ సమాచార శాఖలు రెండూ కూడా తక్షణం కళ్ళు తెరవాలి 'రుబియా సయ్యద్' అపహరణ ఒక ప్రహసనమని నమ్మేవారి సంఖ్య దేశంలో ఎక్కువగానే వుంది కాశ్మీర్‌లో శాంతి, సుస్థిరతలు నెలకొనాలీ అంటే పాకిస్తాన్ పన్నాగాలని సామ దాన భేద దండోపాయాలతో అదే వరుసలో మట్టు పెడుతూ పోవాలి

ఉదాహరణకి ఐక్యరాజ్యసమితికి పాకిస్తాన్ వెళ్ళాలనుకొంటోంది కానీ 1949లో ఆక్రమిత కాశ్మీర్‌ను ఖాళీచేసి వెనుకకు పోయి జనవాక్య సేకరణకి అవకాశం కల్పించమని సమితి చెప్పిన హితవును పెడచెవిని పెట్టి అక్కడే తిష్ట వేసుకుకూర్చొని ఉభయ ప్రాంతాల ప్రజల దైనందిన జీవితాలను దుర్భరం చేస్తున్న పాకిస్తాన్‌కు నైతిక హక్కు లేదు అని మనం కూడా బాకా పట్టాలి ఔనా? కాదా!

16-2-'90



ఫిబ్రవరి 14న బెంగుళూరు వద్ద జరిగిన ఘోరమైన ఎయిర్ బస్ ప్రమాద దృశ్యం. ఈ దుర్ఘటనలో 90 మంది మరణించారు 50 మందికి పైగా గాయపడ్డారు

# తిరుపతి వేంకటకవులు
# శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు

ప్రాచీనకాలంలో మధురమైన కవిత్వాన్ని చెప్ప డంలో నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ, శ్రీనాధుడు, పోతన, అల్లసానిపెద్దన, తెనాలి రామలింగడు మొదలగు మహాకవులు ప్రసిద్ధి గాంచారు.

ఈ ఇరవై శతాబ్దంలో "తిరుపతి వేంక టకవుల"ను పేరుతో శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రి, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ఆంధ్ర రాష్ట్రంలో ఎంతో కీర్తిని గడించారు. దుర దృష్టవశాన శ్రీ తిరుపతిశాస్త్రి వయస్సులో వున్నప్పుడే గతించారు. శ్రీ వేంకటశాస్త్రి 1950వ సం. ఫిబ్రవరినెలలో "శివరాత్రి" పర్వదినాన దైవసన్నిధిని చేరారు.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి 1870వ సంవత్సరాన అప్పటికి ఫ్రెంచిప్రభుత్వం అధీ నంలోవున్న తూర్పుగోదావరిజిల్లాలో 'యానాం' గ్రామంలో జన్మించారు. చంద్రమ, కామయ్య శాస్త్రిగార్లు వీరి జననీజనకులు.

శ్రీ వేంకటశాస్త్రి ప్రాధమిక విద్యా భ్యాసం 'కడియం'లో జరిగింది. ప్రాధమిక విద్య పూర్తయిన తరువాత శ్రీ చర్ల బ్రహ్మ య్యశాస్త్రిగారి వద్ద సంస్కృతాన్నభ్యసిస్తుం డగా తోటి విద్యార్ధిగా వున్న శ్రీ తిరుపతిశా స్త్రితో స్నేహం కలిగింది. శ్రీ వేంకటశాస్త్రి బాల్యం నుంచే కవిత్వమల్లడం ప్రారంభిం చారు. శ్రీ తిరుపతిశాస్త్రితో కలిసి కవిత అల్లడం ఆరంభించారు. ఈ జంటకవులు మాతృభాషాభివృద్ధికి ఎంతో కృషిచేసారు.

వీరు తమ మేధాశక్తిని, సమయస్ఫూర్తిని వుపయోగించి అనేక సభలలో అష్టావధా నాలు, శతావధానాలు ప్రదర్శించారు.

తిరుపతి వేంకటకవుల శతావధానం మొదట 1891వ సం.న కాకినాడలోను, వేంకటగిరి రాజదర్శనం 1893వ సం.లో విజయవాడలోనూ జరిగినవి. 1896 సం.న వీరెవ్వరో వ్రాసిన ఉత్తరాన్ననుసరించి విజ యనగర ఆనందగజపతి దర్శనం చేసుకు న్నారు. 1896వ సం.లోనే గద్వాలు వెళ్ళారు. 1898వ సం.న ఆత్మకూరి సంస్థా నాధిపతి ఆనతిచే "శ్రీనివాస విలాసము"ను తెలుగులోకి అనువదించి అతనికి కృతి యివ్వగా సంబరపడి తిరుపతి వేంకటకవులకు గజారో హణోత్సవం జరిపించాడు.

పోలవరం సంస్థానాధిపతులైన కాకినా డలో నివసిస్తున్న కొచ్చర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు తిరుపతి వేంకటకవులను తమవద్దకు పిలిపించుకొని ఆంగ్లంలో ఆర్నాల్డు కవి రచించిన "లైట్ ఆఫ్ యేషియా" అను గ్రంధం నుండి "బుద్ధ చరిత్ర"ను తెలుగులో వ్రాసి కృతి యివ్వమని కోరారు. అప్పుడు తిరుపతి వేంకటకవులు ఆంగ్లం నుంచి అను వాదంచేస్తూ ఇంకా "అశ్వ ఘోషుడు"


శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

వ్రాసిన "బుద్ధ చరిత్ర"లోని కొన్ని శ్లోకాలను ఏరి వాటినీ అనువాదంచేసి 1901వ సం.లో పోలవరం సంస్థానాధిపతికి అంకితంయిస్తూ

"తిరిగితి యెల్ల దేశములదేవనిగా నికమీద దేశ 'సం
చరణమొనర్పగా విసువుచాలమనంబున గల్గెనయ్య యీ
తిరుపతివేంకటేశకవిధీరుల నొక్కెడనుండ జేసి భూ
వర సభలందు ఖ్యాతిని నవశ్యము పొందు మి
కృష్ణ భూపతీ!

అని వేడుకొన్నారు. కాకినాడకు మకాం మార్చుకొని శ్రీ తిరుపతిశాస్త్రి శ్రీ కృష్ణా రావు నడుపుతున్న "సరస్వతి" అను మాస పత్రిక భారం వహించారు.

శ్రీ వేంకటశాస్త్రి 1903లో బందరు లోని హిందూహైస్కూలులో ఆంధ్రోపాధ్యాయ పదవి నధిష్టించారు.

శ్రీ తిరుపతికవులు వ్రాసిన గంధాలు 1) శ్రీనివాస విలాసము 2) శ్రవణానం దము 3) పాణిగ్రహీత 4) దేవీభాగవతము 5) బుద్ధచరిత్ర 6) లక్షణా పరిణయం 7) భారత నాటకములు. వీటిలో "శ్రీనివాస విలాసము" గజారోహణం చేయించింది. 'శ్రవ ణానందము' 'పాణిగ్రహీత' ఈ రెండును శృంగారరస ప్రధానగ్రంధాలు. బుద్ధచరిత్ర గౌత మబుద్ధుని చరిత్ర. దేవీభాగవతం అష్టాదశ పురాణములలో ఒకటి. ఇది వారి గురువుగా రైన బ్రహ్మయ్యశాస్త్రికి అంకితం ఇచ్చారు. లక్షణాపరిణయం ఆశువుగా చెప్పబడిన ప్రబం ధము. తరువాత వీరి యశస్సును చిరస్థా యిగా నిలిపినది భారతనాటకములు. వీటిలో "పాండవోద్యోగ విజయము" అను నాటకము సుప్రసిద్ధమైనది. దీనిలోని పద్యాలు నేటికిని నోటికిరాని పామరులుకూడా లేరనుటలో అతి శయోక్తిలేదు. ఇందులోని ప్రతి పద్యము ఒక ఆణిముత్యం.

తెలుగుదేశాన ఏ మహారాజులు పొందని గౌరవాన్ని, పలుకుబడిని వీరు సంపాదిం చుకున్నారు. శ్రీ తిరుపతిశాస్త్రి 1920 డిసెంబర్, 7వ తారీఖున స్వర్గతి చెందారు. వీరి మరణాన్కి శ్రీ వేంకటశాస్త్రి చాలా కృంగిపోయారు.

అధ్యాపకవృత్తిని వదిలి వీరి స్వగ్రామమైన కడియం గ్రామంలో వీరి గురువులైన శ్రీ బ్రహ్మయ్యశాస్త్రివలె శిష్యులకు వీరి ఇంట్లోనే భోజన వసతి ఏర్పాటుచేసి విద్యను బోధిం చేవారు.

శ్రీ వేంకటశాస్త్రి కవితాశక్తికి మెచ్చి సభలలో అనేకసంస్థలు అనేక బిరుదు లను యిచ్చారు. అందులో "కిం కవీంద్ర ఘటా పంచానన", "బాలసరస్వతి", "అభి నవ రామలింగకవి", "కళాప్రపూర్ణ" మొద లగునవి ముఖ్యమైనవి.

శ్రీ వేంకటశాస్త్రి హృదయం దయతో కూడినది. వయసుమళ్ళినను వీరు కవితా వ్యాస ంగాలను వదులుట కిష్టపడలేదు.

"కడియం" నుండి వీరు విజయవా డకు నివాసాన్ని మార్చారు. అనారో గ్యంతో మంచంపైవున్నప్పుడుకూడా కవితా రచన మానలేదు.

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినత ర్వాత దేశభాషల్ని ప్రోత్సహించాలని జాతీయ ప్రభుత్వం దక్షిణదేశమందున్న తెలుగు, తమిళం, మళయాళం, కన్నడ భాషలందును, సంస్కృత మునందుగల ఉత్తమ కవులను ఆస్థాన కవులుగా గౌరవించారు.

తెలుగులో ఉత్తమకవిగా శ్రీ వేంకటశా స్త్రిని నిర్ణయించారు.

శ్రీ వేంకటశాస్త్రి 1950వ సం. "శివ రాత్రి" పర్వదినాన స్వర్గస్థులైనారు. శ్రీ శాస్త్రిగారు మనందరిమధ్య లేకపోయిననూ తెలుగువారు జీవించివున్నంతకాలం వారు చేసిన భాషాసేవను మరువలేము.

-రామరాజు వెంకటఅప్పారావు

# కలువ బాల



ఇంటింటి పత్రిక: "ఇంతుల" పత్రిక

ఆంధ్రపత్రిక వారి వనితా పక్ష పత్రికలో ఇంట్లోనే చక్కగా దుస్తులు కుట్టుకోవడానికి వుపయోగపడే విధంగా వారం, వారం వాణీ ప్రభాకరి కుట్టు శిక్షణ పాఠాలు.

నడుస్తున్న అద్భుతమైన సీరియల్స్!

కులాల కురుక్షేత్రం మీద రావి నూతల సువర్ణాకన్నన్ దూసిన కత్తి "బల్లకట్టు"!

క్రైమ్ కథల జోరులో హోరెత్తిపోతున్న పాఠకులకు ప్రగతిబాట మార్గదర్శకం చూపే సమాజ కథ!

ఆచంట ఉమాదేవి కలం నుండి వెలువడుతున్న "ప్రగతిపథం"!

అమెరికా వెళ్ళిన "భారతమాత" చెప్పిన నిజాలు

అందర్నీ అతిగా ఆకర్షిస్తున్న కె. రామలక్ష్మి కలం చిత్రాలు

సీరియల్ "నన్ను వెళ్లిపోనీరా!"

త్వరలో

అబ్‌నార్మల్ హ్యూమన్ సైకోలజీపై అవధానుల విజయలక్ష్మి అద్భుతంగా రచించిన "పొగ మేడలు" ఇటీవల కాలంలో వెలువడ్డ మొట్టమొదటి సైకోలాజికల్ నవల!

గిరగిరా తిరిగే సన్నివేశాలతో పరుగెత్తించే ప్రముఖ రచయిత్రి కె. తాయారమ్మ సీరియల్ "బతుకు బొంగరం"

అంతేగాక శీర్షికలు!

భలే చిట్కాలు, ఇల్లాలితనం ఒక ఉద్యోగం లాంటిదా?, చిన్నారి చిలిపి పనులు, పాకశాస్త్రం, స్త్రీలకు కాలేజీల్లో సీట్ల కోటా, నేనిలా అనుకుంటున్నాను, పెళ్లికి తాళిబొట్టు అవసరమా!, మహిళా వికాసం- యిలా ఎన్నో... అతివల చేతి అద్దం

ఇది అందరికీ అద్దం యిది!



**ఆంధ్రపత్రిక** ప్రచురణ

# సీరియల్ ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



ఇంతవరకూ సాగిన కథ-*29* : పాండవులు జూదంలో ఓడిపోయి పన్నెండేళ్లు అరణ్యావాసం, ఒకయేడు అజ్ఞాతవాసము పూర్తిచేసి, తమకు అర్ధ రాజ్యం ఇవ్వవలసిందిగా కృష్ణుడ్ని ధృతరాష్ట్రుడి వద్దకు రాయబారం పంపిస్తారు. కృష్ణుని సంధి యత్నం విఫలమై యుద్ధం అనివార్యమౌతుంది. యుద్ధరంగంలో కౌరవ, పాండవులు భీకర యుద్ధానికి తలపడతారు. శిఖండిని అడ్డు పెట్టుకొని అర్జునుడు భీష్ముడ్ని నేలకూలుస్తాడు. పద్మవ్యూహంలో అభిమన్యుణ్ని నిరాయుధుణ్ణి చేసి దుష్టచతుష్టయం అతనిపై శస్త్రాస్త్రాలు కురిపిస్తారు.

(గత సంచిక తరువాయి)

అస్తమించిన సూర్యుడిలా అణగారిపోయాడు అభిమన్యుడు. నెత్తురు మయంగా వున్న ఆ యుద్ధ భూమిలో ఎర్రని ఆకాశంలో వున్న చంద్రబింబంలా వెలిగిందతని ముఖం.

అభిమన్యుడు కిందపడిపోగానే కౌరవ పాండవ సైన్యాలు రెండూ కాళ్ళూ చేతులూ ఆడక కాసేపు యుద్ధం మానేశాయి.

ధర్మరాజు చప్పున పరుగెత్తుకుంటూ వెళ్ళి కొడుకు తలను ఒళ్ళోకి తీసుకున్నాడు. అభిమన్యుడి మొహం మినహా మిగిలిన శరీరమంతా రక్తంతో తడిసిపోయి వుంది. గదా ఘాతాలు ఛాతికి బలంగా తగలడంతో జర్జరితమై పోయిన శరీరంలో వుండలేక అతని ప్రాణాలు పైకెగిరిపోయాయి.

తల వాల్చేశాడు.

'అంతమంది ఒక్కడి మీద కలబడి చంపడం అన్యాయం కదూ' అంటూ ధర్మరాజు పెద్దగా ఆక్రోశించాడు. అభిమన్యుడి మొహంలోకి మొహం పెట్టి 'నేనే... నేనే తండ్రీ నిన్ను చేతులారా రణరంగానికి అప్పగించాను. పసివాడవన్న ఆలోచనైనా లేకుండా పులినోటికి మేకనందించినట్టు నిన్నా దుర్మార్గుల కందించాను' అని బావురుమని ఏడ్చాడు.

కౌరవ సేనలు ఆ రోజుకి యుద్ధం విరమించి గుంపులు గుంపులుగా వాళ్ళ శిబిరాలు వైపు వెళ్ళిపోయారు.

అప్పటికి బాగా చీకటి పడింది.

పాండవులు అభిమన్యుడి మృతదేహాన్ని తీసుకుని బరువెక్కిన హృదయాలతో తమ గుడారాల వైపు నడిచారు.

రాత్రి అయింది.

సంశప్తక సైన్యం మీదకు యుద్ధానికి వెళ్ళిన కృష్ణార్జునుల రథం వచ్చి ధర్మజుడి శిబిరం ముందు ఆగింది. అక్కడి దృశ్యం చూస్తూనే అర్జునుడు కొయ్యబారిపోయాడు.

భయమూ ఆందోళనా నిండిన కంఠంతో

'.....ఏమైంది ద్రౌపదీ!' అన్నాడు.

సమాధానానికి బదులు అతన్ని చుట్టేసుకుని పెద్దగా ఏడ్చింది ద్రౌపది.

ఆమెను వూరడించలేక అన్నదమ్ముల వైపు చూశాడు.

వాళ్ళందరూ తలలొంచుకుని నిలబడ్డారు. ఏదో అనుమానం వచ్చి లోపలికి తొంగి చూసేడు.

అభిమన్యుడి తలవైపు నిశ్చలంగా వెలుగుతున్న జ్యోతి కనిపించింది.

తరువాత కొడుకును తలుచుకుంటూ ఏడుస్తున్న సుభద్రను చూశాడు.

అంతే

అర్జునుడి చేతిలో గాండీవం జారికింద పడింది.

'ఎవరు? ఎవరు నా బిడ్డను పొట్టన పెట్టుకుంది?'

అంతరాత్రి వేళ ఆ అరుపు కౌరవ శిబిరాల్లో చొరబడి అలజడి రేపింది.

'నేనే.....' అని ముందుకొచ్చి నిలబడ్డాడు ధర్మరాజు.

'నువ్వా?' నమ్మలేనట్టు అడిగాడు అర్జునుడు. 'నువ్వుకాదు. ఎవరో నిజం చెప్పు. వాడింక బ్రతకడం దుర్లభం' అన్నాడు.

..... నువ్వూ, కృష్ణుడూ లేరు. ద్రోణుడు పద్మ వ్యూహం పన్నాడు. అందులోకి ప్రవేశించడం మా కెవరికీ చేతకాదు. అభిమన్యుడొక్కడే ఆ క్షణాన స్ఫురించాడు నాకు. వాడా వ్యూహంలోకి ముందు ప్రవేశిస్తే వెనకాలే మేమందరం వెడదామనుకున్నాం. అలా అనుకునే పంపాను వాణ్ణి. కాని వాడికి సహాయంగా వెళ్దామనుకున్న మమ్మల్ని వెళ్ళ నివ్వకుండా సైంధవుడు అడ్డుకున్నాడు. అప్పుడా సైంధవుడికి పరమేశ్వర వరబలం ఆవేశించడం వల్ల మేమెవ్వరం వాడి ముందు చాలలేకపోయాం' అని జరిగినదంతా వివరంగా చెప్పాడు ధర్మరాజు. - - - - - - - - - -

అర్జునుడు ఉగ్రుడయ్యాడు. 'ఆ సైంధవుణ్ణి రేపే చంపుతాను. దేవతలంతా కలిసి వచ్చి రక్షించినా సరే రేపు సూర్యాస్తమయం లోపల వాణ్ణి చంపి తీరతాను. అలా చంపలేకపోతే నేనే గాండీవంతో సహా అగ్ని ప్రవేశం చేస్తాను' అని భీకర ప్రతిజ్ఞ చేశాడు.

అది విని చాలాసేపు అందరూ భయంతో అచేతనంగా అలానే నిలబడిపోయారు.

చీకటి చిక్కబడుతోంది.

ద్రౌపది, సుభద్ర, ఉత్తర ముగ్గురూ వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. గాఢ నిశ్శబ్దంలో వాళ్ళ ఏడుపు కౌరవులను శపిస్తున్నట్టుగా వుంది. ఏడ్చి ఏడ్చి సుభద్ర కుప్పకూలిపోయింది. కృష్ణుడు చెల్లెల్ని చేతుల్లోకి తీసుకుని 'క్షత్రియ కాంత కొడుకును కనడం, వాడు మహా వీరుడై లోకంలో ప్రసిద్ధికెక్కాలనేగా! నువ్వు వీరపత్నివి. వీరమాతవు. నీ కొడుకు శత్రువుల్ని చంపి వీరస్వర్గం పొందితే ఏడుస్తారా చెప్పు!' అని ఓదార్చాడు.

కొడుకు మరణాన్ని అంత తేలికగా జీర్ణించుకోలేకపోయింది సుభద్ర.

ఏడుస్తూనే వుంది.

'పిచ్చి తల్లీ! ఎందుకమ్మా ఈ ఏడుపు? ఉత్తరకు ధైర్యం చెప్పాల్సింది పోయి నువ్వే ఏడిస్తే ఎలా? అర్జునుడు రేపీ పాటికల్లా సైంధవుడి తల తెగ్గొట్టి తెస్తాడు. అది నీ పాదపీఠంగా చేసుకుని పగతీర్చుకుందిగాని, లే! ఇంక ఏడవకు' అని కృష్ణుడు చెల్లెల్ని అనునయించాడు.

ఆ రాత్రికి ఎవరికీ కంటి మీద కునుకులేదు.

*　　*　　*　　*　　*

మరునాడు ద్రోణుడు శకట వ్యూహం తీర్చాడు. దానికి పశ్చిమార్థ భాగంలో గర్భవ్యూహంగా పద్మవ్యూహం పన్నాడు. దాని మధ్య నుంచి సేనా ముఖం వరకూ సూచీ వ్యూహం అల్లాడు. సూచీ వ్యూహ మూల స్థానంలో సైంధవుణ్ణి నిలబెట్టాడు. శకట వ్యూహం ముఖ భాగాన తనే నిలబడ్డాడు. కాసేపటికి అర్జునుడి రథం వచ్చింది. అతనికి కొంచెం దూరంలో పాండవ సేనలు మోహరించాయి. అర్జునుడు దేవదత్తాన్నీ కృష్ణుడు పాంచజన్యాన్నీ పూరించారు. అర్జునుడి జెండా మీద వున్న కపిరాజు భయంకరంగా అరిచాడు.

అది వినేసరికి కౌరవ వీరులకు ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

అర్జునుడున్న రథం కౌరవుల వేపుగా మరో నాలుగడుగులు ముందుకు వచ్చింది. కావాలనే కృష్ణుడలా చేశాడు. అది తెలీక ఒక్కడు గదా అని కౌరవ యోధులందరూ కలిసి అర్జునుడ్ని చుట్టుముట్టారు. అర్జునుడు



అందరికీ అన్ని రూపులై ప్రకాశించి దుర్యోధనుడి సైన్యాన్ని చిందరవందర చేశాడు. అతని బాణాల ధాటికి కురుసైన్యంలో చాలా మంది తలలు తాటిపళ్ళల్లా రాలికింద పడ్డాయి.

అది చూసి భయపడి పారిపోయాడు దుశ్శాసనుడు.

అర్జునుడు అతన్ని చూసి నవ్వుకున్నాడు. మరుక్షణం అతని ఆలోచన సైంధవుడి వైపు మళ్ళింది. కాని రథాన్ని ముందుకు పోనిద్దామంటే ఎదురుగా ద్రోణుడు నిలబడివున్నాడు. అర్జునుడికి తన చిన్నతనం గుర్తొచ్చింది.

ద్రోణాచర్యుల వారి దగ్గర నుంచి శస్త్రాస్త్ర రహస్యాలను తెలుసుకోడానికి తను పడిన కష్టం జ్ఞాపకం వచ్చింది. నిజంగా అప్పుడుగానీ ద్రోణాచార్యుడు తనకు బాణ విద్యలో మెళుకువలు నేర్పకపోతే ఇప్పుడు తన ఓటమి ఎంత ఘోరంగా తయారయ్యేదో! ఆ క్షణాన ఎందుకో అర్జునుడికి రథం దిగి వెళ్ళి ద్రోణుడి పాదాలు తాకాలనిపించింది. 'బావా! రథాన్ని ద్రోణుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నట్టు ఒకసారి తిప్పవూ' అని అడిగాడు. కృష్ణుడు అలాగే చేశాడు.

తరువాత రథాన్ని ముందుకు పోనిచ్చాడు.

'అర్జునా! ఎదురుపడిన శత్రువును జయించకుండానే తప్పించుకుపోతున్నావు. ధర్మమేమో ఆలోచించు' తనలో తనే అనుకుంటున్నట్టు ద్రోణుడు అంటున్న మాటల్ని అర్జునుడు విన్నాడు. రథాన్ని పోనిస్తూనే 'ఆచార్యా! నువ్వు నాకు గురుడవు కాని శత్రువ్వి కాదు. నేనెలాంటి వాణ్ణో నీకు బాగా తెలుసు. అయినా నువ్వు కళ్ళెర్ర చేస్తే ఎదిరించి నిలబడడానికి నేనెంత?' అన్నాడు.

ద్రోణుడు శిష్యుడి వినయానికి మురిసిపోతూ నిలబడ్డాడు. ఈ లోగా రథం మరింత

# ద్రౌపది



ముందుకు చొచ్చుకుపోయింది.

కౌరవసేనలోని కృతవర్మ, భోజపతి ఆ రథానికి అడ్డం వెళ్ళారు. ఇద్దర్నీ ఒకేసారి పడగొట్టాడు అర్జునుడు. రాముడు శివధనస్సును విరిచినట్టు వాళ్ళ ఇద్దరి విల్లమ్ములూ విరిచి పారేశాడు. ఇంతలో శ్రుతాయుధుడనే రాజు వచ్చాడు. అతను సామాన్యుడు కాదు. వరుణుడి కొడుకు. వరుణుడు కొడుక్కో గద ఇచ్చి 'దీన్ని చేత పట్టినవాడు శత్రువులకు దుర్జయుడవుతాడు. కాని యుద్ధం చెయ్యని వాళ్ళ మీద ప్రయోగిస్తే మాత్రం ఆ గద మళ్ళీ తిరిగొచ్చి ప్రయోగించిన వాణ్ణే చంపుతుంది' అని చెప్పాడు.

కాని శ్రుతాయుధుడు ఆ నియమం మరచిపోయి గదను కృష్ణుడి మీద ప్రయోగించాడు. అది పూలమాలగా మారి కృష్ణుడి మెళ్ళో వేళ్ళాడింది. మరుక్షణంలోనే పిడుగులా వచ్చి శ్రుతాయుధుడి మీదపడి అతన్ని చంపేసింది.

ఈ దృశ్యం చూసి కౌరవసైన్యం భీతితో పారిపోయింది. సైంధవుడి గుండె గుభిల్లుమంది.

* * * *

కౌరవసైన్యాన్ని చంపి చంపి అలిసిపోయి వున్నాడు అర్జునుడు. రథాశ్వాలు కూడా దాహంతో వేదనపడుతున్నాయి.

సైంధవుడున్న చోటు ఇంకా చాలా దూరంలో వుంది.

గుర్రాల శరీరాల్లో గుచ్చుకున్న బాణాలు తీసి వాటికి నీళ్ళూ, మేతా పెడితే తప్ప ముందుకు కదిలే స్థితిలో లేవవి.

కాని శత్రుమధ్యంలో నిలబడి ఇవ్వడవన్నీ చూసుకోవడం ఎలా? రథం దిగి కింద నేలమీద నిలబడ్డాడు అర్జునుడు. ఈ లోపున ఒక్కడూ చిక్కాడు కదా అని సముద్రంలా పొంగివచ్చింది కురుసైన్యం అతని మీదికి. బాణాలతో చెలియలికట్టలా వాళ్ళను అడుగు కూడా ముందుకు కదలనీయకుండా చేశాడు అర్జునుడు.

కౌరవ వీరులు నిస్సహాయంగా చూసారతన్ని. అందిన వాళ్ళను అందినట్టు హతమార్చాడు అర్జునుడు.

కృష్ణుడు వచ్చాడు. 'అర్జునా! గుర్రాల శరీరాల్లో దిగిన బాణాలన్నీ లాగి వాటికి స్వస్థత చేకూర్చాను. ఇప్పుడు వాటికి గొంతు తడుపుకోడానికైనా కాసిని నీళ్ళు కావాలి. వాటి క్షుద్బాధ తీర్చేందుకైనా మనం పచ్చగడ్డి వెయ్యాలి' అన్నాడు.

అర్జునుడు నవ్వి 'ఇదుగో బావా! నీళ్ళూ మేతా వస్తాయి చూడు' అంటూ ఒక దివ్యాస్త్రాన్ని భూమికి గురిపెట్టి వేశాడు. ఆ దెబ్బకు నేల నెర్రెలు విచ్చి సయ్యన నీళ్ళు పైకి వచ్చాయి. ఆ నీటిచుట్టూ బాణాలతోనే అర్జునుడు కంచెకట్టాడు. కాసేపైన తరువాత నీటితోపాటే మేత కూడా భూమిలోంచి పుట్టింది. ప్రాణాలర చేతపట్టుకుని పారిపోతున్న కురుయోధులు ఈ అద్భుతం చూసి చకితులయ్యారు.

కృష్ణుడికి అర్జునుణ్ణి చూస్తే ఆ క్షణాన గర్వం వేసింది.

గుర్రాలు గటగట మడుగు దగ్గరకొచ్చి



## ప్రయాగ రామకృష్ణ సీరియల్

1. ద్రౌపదికి ఐదుగురు భర్తలలో ఎవరి మీద మక్కువ ఎక్కువ?
   –పదిహేను వాక్యాలలో రాయండి.
2. ద్రౌపదికి కర్ణుడు మీద కోపం ఎక్కువా? దుర్యోధనుడు మీద కోపం ఎక్కువా?
   –పది వాక్యాలలో రాయండి.

ఈ రెండు ప్రశ్నలు లోగడ సంచికలలో ఇచ్చిన రెండు ప్రశ్నలు చదివి మొత్తం నాలుగు ప్రశ్నలలో ఏ రెండింటి కయినా జవాబు రాసి కూపన్ నెం. 1, కూపన్ నెం. 2 రెండూ జత చేసి – ద్రౌపది వ్యాస రచన పోటీ, ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ –3. కి ద్రౌపది సీరియల్ ముగిసిన తరువాత పది రోజుల్లో అందేలా పంపండి. అంత వరకు ఈ కూపన్లు రెండూ మీ దగ్గరేపెట్టుకోండి.

నిబంధనలు:

* మీరు పంపే వ్యాసం అరరావు నుంచి అర రావున్నరకి మించకూడదు. పంక్తులు దూరంగా అక్షరాలు విడివిడిగా వుండాలి-

* ఈ ప్రశ్నలు కూపన్‌సహా మీవద్ద వుంచుకోండి!

* వ్యాసాలలో ఉత్తమమయిన వాటికి

నీళ్ళు తాగాయి. తృప్తిగా మేత తిన్నాయి.

మళ్ళీ వాటిని రథానికి పూన్చి ఇద్దరూ బయలు దేరారు. కొంత దూరం వెళ్ళే సరికి వాళ్ళకు సైంధవుడు కనిపించాడు. అతని చుట్టూ కృప శల్య కర్ణాది వీరులంతా కావలా వున్నారు.

వాళ్ళకి అల్లంత దూరంలో దుర్యోధనుడు నిలబడివున్నాడు. అతన్ని చూడగానే అర్జునుడి మొహం కోపంతో ఎర్రబడింది. అతని మీద పగతీర్చుకోవాలనుకున్నాడు. వాడి బాణం ఒకటి తీసి అతని నుదుటికి తగిలేట్టు వేశాడు. రక్తం ప్రవహించి మడుగు కట్టింది.

దుర్యోధనుడు కొదమ సింహంలా గర్జించాడు. హోరాహోరీగా పోరు సాగింది.

'అర్జునా! ఇంక వీళ్ళతో ఇలా యుద్ధం చేస్తూ కూర్చుంటే లాభం లేదు. సూర్యుడు అస్తమించబోతున్నాడు. దీనికి నేనో ఉపాయం చేస్తాను. అప్పుడు కాని నువ్వు సైంధవుణ్ణి చంపలేవు. నేను సూర్యుణ్ణి కప్పేస్తాను. ఆ చీకటి చూసి అందరూ సూర్యాస్తమయమైందనుకుని యుద్ధం మానేస్తారు. అప్పుడు నీ ప్రతిజ్ఞ చెల్లించుకో' అన్నాడు.

'బావా! ఇంత పరాక్రమం వుండి కూడా దొంగ చాటుగానే ప్రతిజ్ఞ తీర్చుకోమంటావా?'

'దుర్మార్గుల్ని దుర్మార్గంతోనూ, మోసగాళ్ళను మోసంతోనూ చంపడం తప్పుకాదు. నువ్వేం బాధపడకు' అని మాయాతిమిరంతో మార్తాండ మండలాన్ని మరుగుపరిచాడు మాధవుడు.

అది చూసి సూర్యుడు అస్తమించాడనుకుని కౌరవ సైన్యాలన్నీ చెదిరిపోయాయి. సైంధవుడు సంతోషం పట్టలేక రథం మీద నిలబడి తలెత్తి పడమరవైపు చూశాడు.

'అర్జునా! అదుగో సైంధవుడు.

ఆలస్యం చెయ్యకుండా వాడి మీద పగ తీర్చుకో' అని కృష్ణుడు తొందర పెట్టాడు.

అర్జునుడు వెంటనే అమ్ముల పొదిలోంచి ఒక బాణం తీసి వేశాడు. డేగ పక్షిని కొరికినట్టు అది సైంధవుడి తలను తెంచింది.

సరిగ్గా అప్పుడే. ఆకాశంలో మబ్బు విచ్చింది.

ఆనందంతో అర్జునుడు కెవ్వున అరిచాడు. భరించలేనంత ఉద్వేగం. అసలిది కలా.... నిజమా?

నిజమే కావాలి.

కలకావడానికి వీల్లేదు. కాకూడదు.

'అరెరె....పార్థా! ఆ తలకింద పడనియ్యకు. అలాగే ఆకాశంలో ఆడించు. దాని సంగతి తరవాత చెబుతాను నీకు' అన్నాడు కృష్ణుడు కంగారు పడుతూ. వెనక్కీ, ముందుకీ, కిందికీ, పైకీ బాణాలు వేసి సైంధవుడి తలను ఆకాశంలో బంతిలా ఆడించాడు అర్జునుడు.

'బావా! ఎంత సేపిలా?'

'వృద్ధక్షత్రుడనే సింధురాజు కొడుకు వీడు. వీడు యుద్ధంలో ఏమరపాటుగా వున్నప్పుడు చంపబడతాడని అశరీరవాణి పలికింది. అది విని సైంధవుడి తల ఎవడు నేల పడేస్తాడో వాడి తల నూరు చెక్కలవుతుందని వృద్ధ క్షత్రుడు తపోబలంతో శపించాడు. ఆయనిప్పుడు శమంత పంచకంలో తపస్సు చేసుకుంటున్నాడు. వీడి తలను ఎలాగైనా సరే ఆయన ఒడిలో పడేయ్. తండ్రీ కొడుకులిద్దరూ ఒకేసారి కైలాసానికి చేరతారు' అన్నాడు కృష్ణుడు నవ్వుతూ. అర్జునుడు పాశుపతాన్ని ధ్యానించాడు. అది సైంధవుడి శిరస్సును తీసుకువెళ్ళి వృద్ధక్షత్రుడి ఒడిలో పడేసింది. అప్పుడాయన నిశ్చల జపంలో వున్నాడు.

ఉలిక్కిపడి దాన్ని కిందకు తోశాడు. వెంటనే అతని తల నూరు చెక్కలైంది. చిత్రమేమిటంటే సైంధవుడి తల నేలపడే వరకూ అతని మొండెం రథం మీద అలా

## ద్రౌపది క్విజ్-2

### ఏర్చుకోండి పేర్చుకోండి

| | |
|---|---|
| కృష్ణుని శంఖం | పినాకం |
| ఇంద్రుని సారథి | కర్ణుడు. |
| అర్జునుని ధనుస్సు | పాంచజన్యం. |
| దివ్యదృష్టి గ్రహీత | మాతలి. |
| శంకరుని శంఖం | గాండీవం. |
| పాండు - మాద్రి పిల్లలు | జమదగ్ని - రేణుక. |
| సూర్యుడువల్ల కుంతికి కలిగినవాడు | సంజయుడు. |
| అర్జునుడు - నాగకన్యలకు పుట్టినవాడు | అష్టావక్రుడు. |
| కహోలుడు - సుజాతలకు కలిగినవాడు | బభ్రువాహనుడు. |

## "ద్రౌపది"-వ్యాసరచనపోటీ(2)

1) బ్రీఫ్‌కేసు, 2) చిన్న కామిరా, 3) గోడగడియారం, 4) ట్రాన్సిస్టర్ రేడియో- యింకా మరి కొన్ని చిన్న బహుమతులు వుంటాయి!

* వీటి వివరాలు కూడా మీకు "సీరియల్" పేజీల్లోనే త్వరలో దొరుకుతాయి!

ఈలోగా మీరు కూపన్ (2) కత్తిరించి దాచుకొని ప్రశ్నలు కూడా తీసుకొని సీరియల్ చదువుతూ సంసిద్ధులు కండి!

బహుమతుల సమర్పణ : నాగేశ్వరీ పబ్లికేషన్స్, విజయవాడ –2.



### ద్రౌపది కూపన్ నెం. 2.

మీ పేరు . . . . . . . . . . . . . . . . . . . . . . .

చిరునామా . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

## ద్రౌపది

నిలబడే వుంది. ఎప్పుడైతే అతని తల నేలమీద పడిందో మొండెం కూడా కిందపడింది.

పొద్దువాటారింది.

సూర్యుడు ఈసారి నిజంగానే అస్తమించాడు. చీకటి చిక్కబడుతుంటే కృష్ణుడు రథం వెనక్కి తిప్పాడు.

చిత్తరువులైన కౌరవులు కదిలి వెళ్ళిపోయారు.

*　　*　　*　　*　　*

మరుసటి రోజు జరిగిన యుద్ధంలో ద్రోణుడు విరాట ద్రుపదులను బలి తీసుకున్నాడు.

ధృష్టద్యుమ్నుడికి తండ్రి మరణం చాలా బాధ కలిగించింది. 'ద్రోణుని తల నరకకపోతే కులాచారాలకు తప్పిన వాణ్ణని నన్ను వెలివెయ్యండి' అన్నాడు.

కృష్ణుడు ధృష్టద్యుమ్నుణ్ణి దగ్గరకు తీసుకుని ఓదార్చాడు.

'ద్రోణుణ్ణి యుద్ధంలో ఎవరూ గెలవలేరు. కొడుకు చావు కబురు వింటే మాత్రం ఆయనంతట ఆయనే అస్త్ర సన్యాసం చేస్తాడు. అప్పుడు చంపడానికి వీలవుతుంది' అని అర్జునుడికి సలహా యిచ్చాడు. కాని అతనందుకు ఒప్పుకోలేదు.

'అవును. బావ చాలా మంచి ఉపాయం చెప్పాడు. ఇంతకు మునుపే అశ్వత్థామ అనే పేరుగల ఏనుగు నా చేతుల్లో చచ్చింది. చచ్చింది ఏనుగో, ఆయన కొడుకో చెప్పకుండా అశ్వత్థామ చచ్చాడంటే సరి' అన్నాడు భీముడు.

ధర్మరాజు విషాదంగా తలవంచుకున్నాడు. భీముడి ఎవరి అనుజ్ఞకోసం నిరీక్షించకుండా ద్రోణుడి దగ్గరకు పరుగెత్తి ఆయనకు వినబడేట్టుగా 'అశ్వత్థామ హతుడయ్యాడు' అన్నాడు.

ద్రోణుడు అదిరిపడి చూశాడు.

కొడుకు చావు నిజమో కాదో

తెలుసుకుందామని ధర్మరాజు దగ్గరకు రథాన్ని పోనిచ్చాడు. అతనొక్కడే నిజం చెప్తాడని ఆయన నమ్మకం.

ధర్మరాజుకి ఏం చెప్పాలో అర్థం కాక అశ్వత్థామ చనిపోయాడని గట్టిగా చెప్పి లోగొంతుకతో 'ఏనుగు' అన్నాడు. 'ఏనుగు' అన్నది రథ చక్రాల ఘోషలో ద్రోణుడు వినలేదు. ఆయన గుండె ఝల్లు మంది. ధనువూ బాణమూ అక్కడే రథం మీద పడేసి యోగనిష్ఠతో తేజోమయాత్ముడై కూర్చున్నాడు. ఆ తరువాత కాసేపటికే ఆయన తనువు చాలించి జ్యోతి రూపంలో పైకి ఎగసిపోయాడు.

ఆయన శరీరం విడిచిపెట్టినట్టు కృష్ణార్జునులకు, ధర్మరాజుకి, కృపాచార్యుడికి మినహా మరెవరికీ తెలియలేదు.

ధృష్ట ద్యుమ్నుడు రథం ఎక్కి ద్రోణుడి జుట్టుపట్టుకుని వద్దురా అంటున్నా వినకుండా ఆయన తల నరికాడు. తనని తను సమర్థించుకుంటూ 'నా తండ్రిని చంపిన వాడికి ఇదే తగిన శిక్ష' అన్నాడు ధృష్టద్యుమ్నుడు. అతను కోపంతో వూగిపోతున్నాడు. చిమ్మి కొట్టిన నెత్తుటితో అతను పులివేషం వేసుకున్న మనిషిలా వున్నాడు.

అది చూసి కౌరవసైన్యం భయపడి పారిపోయింది.

అశ్వత్థామకీ సంగతేమీ తెలీదు.

దుర్యోధనుడు చెప్పబోయి అతని ముఖం చూసి కన్నీళ్ళతో కంఠం పూడుకుపోయి వూరుకున్నాడు.

'ఏమైంది? ఎందుకిలా మన సైన్యాలు పారిపోతున్నాయి?' అని అడిగాడు అశ్వత్థామ.

దుర్యోధనుడు మాట్లాడలేదు.

చివరికి కృపాచార్యుడు చెప్పాడు.

అది విని కెవ్వున కేక వేశాదు అశ్వత్థామ.

(ఇంకా వుంది)




## హనీమూన్ కి కాశ్మీర్ కి వెళ్తామంటావేమయ్యా!అల్లుడూ!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్టుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదేతుది నిర్ణయం.

## 6-3-'90 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేక పోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహపడక మళ్ళీ ప్రయత్నించండి.

– ఎడిటర్

## "పసుపుపచ్చరంగుధోవతులు ఒకటికొంటే రెండుఉచితం"

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"స్టీలు సామాన్లు యిస్తాడని గ్యారంటీ వుంటే ఒకటి కొంటా!"

-గాదె వీరభద్రరావు (తణుకు)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"ఒక హెల్మెట్ కొసరు కూడా యిస్తారా?"

-దగాని సురేఖ (గండిగుంట)

### మరికొన్ని వాగ్బాణాలు

"ఆ ఒకటీ కొనడానికి వడ్డీలేని వాయిదాల పద్ధతి ఏదైనా వుందాండీ?"

-కె.యస్.మాచన్న (తాళ్లపూడి)

-సిహెచ్.వి. హనుమంతరావు (చింతలూరు)

"రంగు మార్చుకోకపోతే నష్టం తప్పదు మరి!"

-బి.నారాయణరావు (బుచ్చిరెడ్డిపాలెం)

### లక్కీ పేర్లు

ఎం. సీతన్నాయుడు (మచిలీపట్నం), ఆర్. శోభాప్రసాద్ (నిడదవోలు), ఎస్.శ్రీనివాసమూర్తి (నెల్లూరు), ఎం. విమల (హైదరాబాద్), ఎల్ శ్రీనివాస్ (గంగావతి), ఎ.గణేష్ (రాజంపేట), సాహితి (మద్రాసు), మహ్మద్ ఖాసిం (చిన ఓగిరాల), సిహెచ్.గిరి (నల్లగొండ), పి. పద్మావతి (ధర్మవరం), బి. అప్పారావు (తుంబూరు), అరుణ్ కుమార్ (ఇచ్చాపురం), పి. రవిశంకర్ (ఏలూరు), పి.వి. నరసింగరావు (విశాఖపట్టణం), జి. లక్ష్మీనరసమ్మ (బరంపురం).



# 25 సంవత్సరాలు: ఇంద్రియపుష్టి కావాలి!



సరి "కొత్త" శీర్షిక

## హలో డాక్టర్! నేనేం చెయ్యాలి?

డా. కొత్త రవీంద్రబాబు

**సి.హెచ్. ప్రసాద్-పాలకొల్లు:**

తల వెనుక భాగంలో తరచు సుత్తితో బాదినట్లు తలనొప్పి వస్తుంది.

కంటి డాక్టరుకు చూపించుకోండి. పూర్తి వివరాలు తెలియకుండా సలహా ఇవ్వలేను.

**పేరు లేదు, వూరు లేదు అమ్మాయిని కాదు అబ్బాయిని:**

వయసు 18 సంవత్సరములు. ఎడమ మోకాలు వద్ద ఎముక పెరిగింది. ఇప్పుడు కుడి మోకాలు కింద ఎముక పెరిగింది.

డాక్టరుగారికి చూపించుకొని ఆపరేషన్ చేయించుకోవటం మంచిది.

**అనామకుడు:**

జుట్టు వూడుతున్నది, తెల్లబడుతున్నది. తరచు జలుబు. స్వయంతృప్తి అలవాటు.

రోజుకొక జింకో ఫర్ మాత్ర భోజనానంతరం వాడండి. జలుబు చేసినప్పుడు హిస్టలంగ్ బిళ్ళలు ఉదయం, సాయంత్రం వాడండి.

**కె. రవికుమార్-గుంటూరు:**

25 సంవత్సరాలు. వివాహం కాలేదు. ఇంద్రియ పుష్టికి మందు చెప్పండి.

వివాహానంతరం లిబిటోన్ బిళ్ళలు రోజూ ఉదయం, సాయంత్రం మూడు నెలలపాటు వాడండి. సరదా కోసం పెళ్ళికి ముందు బిళ్ళలు వాడవద్దు!

**ఆర్. శ్రీదేవి-ఖమ్మం:**

ప్లాస్టిక్ సర్జరీ ఎక్కడ చేస్తారు.

ఈ సంచికలో నే జవాబిచ్చాను.

**వి. ఎస్. ఎన్. శర్మ, నాగార్జునసాగర్:**

ఎవరితో నో సంభోగిస్తున్నట్టు వూహించుకుని స్వయం తృప్తి కలవాటు పడ్డాను. తర్వాత ఒకోసారి మంటగా వుంటుంది. పెళ్ళికి అనర్హుడనా?

పెళ్ళి మీ సమస్యకు పరిష్కారం అవుతుంది! స్పీమన్ రోజూ మూడు బిళ్ళలు అయిదారు నెలల పాటు వాడి చూడండి. సెక్సు సినిమాలు, పత్రికలకు దూరంగా వుండండి. ఒంటరిగా వుండకే చదువుమీద లేదా చేస్తున్న పనిమీద మనసును నిమగ్నం చేయండి.

**ఎస్. కె. అమీర్, విశాఖపట్నం:**

18 సంవత్సరముల యువతిని. గడ్డంమీద, పెదవిమీద వెంట్రుకలున్నాయి.

ఎలెక్ట్రాలిసిస్ వలన మీ సమస్యకు శాశ్వత పరిష్కారం కలుగుతుంది. బ్యూటీ క్లినిక్‌కు వెళ్ళి కనుక్కోండి.

**టి. ఎం. రావు, గుడివాడ:**

పెళ్ళి నిశ్చయ మయింది. వివాహం కాలేదు. కాని మే మిద్దరం కలుసుకుంటున్నాం-గర్భం రాకుండా నివారించాలంటే ఏం చేయాలి?

పురుషులు కాండోమ్ (నిరోధ్) వాడాలి. స్త్రీలు అయితే కలిసేముందు టుడే బిళ్ళను అంగం లోపల అమర్చుకోవాలి. లేదా ఋతుస్రావం తర్వాత మొదలెట్టి రోజుకో బిళ్ళ చొప్పున 22 లిండయాల్ బిళ్ళలు మింగాలి.

వివాహం అయ్యేవరకు నిగ్రహం చూపడం మంచిది.

**కె. భాస్కర్, అనకాపల్లి:**

26 సంవత్సరాలు. వివాహం కాలేదు. దడ, ఆయాసం, వొణుకు చెమట ఎక్కువ.

డెప్సొడియాజ్ లేదా లిబోట్రిప్ రోజుకో బిళ్ళ చొప్పున ప్రతి రాత్రీ రెండు మూడు నెలలు వాడి చూడండి.

**వై. పి. ఆంజనేయులు-రేపల్లె:**

అన్నం తినగానే తేపులు, మలబద్ధకం.

ఆహారంలో ఆకుకూరలు ఎక్కువగా తీసుకోండి. పళ్ళు ఏవి దొరికితే అవి తినండి. ఉదయాన లేవగానే రెండు, మూడు గ్లాసుల నీరు తాగండి. డల్కొలాక్స్ బిళ్ళ రాత్రి పూట రోజుకొకటి చొప్పున వాడండి. స్టెలబిడ్ బిళ్ళ భోజనానికి అరగంట ముందు వేసుకోండి



## ఉన్నదీ పోయె... ఉంచుకున్నదీ పోయె?



మన ఇండ్లల్లో దొంగలు పడ్డారనుకోండి... వాళ్ళు దురదృష్టవశాత్తు దొరికారా- బడిత పూజే... లేదా లబో దిబోమంటూ పోలీసు స్టేషన్‌కి వెళ్ళి మొరపెట్టుకోవటం సర్వసాధారణంగా జరిగే విషయమే! కాని ఆ దొంగలూ దొరక్క, పోలీసు స్టేషన్‌కి వెళ్ళి మొరపెట్టుకొనే ఆస్కారం లేకుండా ఆ స్టేషన్లోనే దొంగలు పడి దోచుకుపోతే వాళ్ళు ఎవరికి మొరపెట్టుకోవాలి?

ఇలాంటి సంఘటనే జరిగిందట యిటీవల ఒక పట్టణం నడిబొడ్డున వున్న పోలీసుస్టేషన్లో. మామూలుగా పోలీసు స్టేషనంటే ఇరవై నాలుగ్గంటలూ ఎవరో ఒకరు కాపలా కాస్తుంటారు కదా! మరి కాపలా కాస్తున్న ఈ పోలీసుస్టేషన్లో దొంగతనం జరిగిందంటే... ఆశ్చర్యమే కదూ! బహుశా కాపలా కాసే సెంట్రీలు నిద్ర కాచీ కాచీ కునుకుతీశారేమో! అదే అదనుగా దుండగులు వెంటిలేటర్ కుండా లోపలికి రావటం, అక్కడే వున్న ఒక సంచిలో నిలోడ్ చేసి వున్న రివాల్వర్‌ను పట్టుకు పోవటం జరిగిపోయింది. ఎప్పుడయినా అవసరానికి వుపయోగపడ్తాయనుకున్నారో... ఏమో... నాలుగు తూటాలు కూడా జేబులో వేసుకు పోయారట సినిమాల్లో మాదిరి. రివాల్వర్ వున్న సంచి పనికిరాలేదేమో దాన్ని అక్కడే పడేశారు. స్టేషన్లో డబ్బులు ఎవరు దాచి పెట్టుకున్నారో పాపం... దారి ఖర్చులకు కామోసు అవి కూడా తస్కరించి చక్కా పోయారట.

ఈ దొంగతనం గురించి తెలిసి అక్కడి అధికారులు కంగారుపడుతూ ఆ వ్యవహారంలో నిమగ్నమై వుండటాన్ని చూసిన స్టేషన్లోని నేరస్థుడొకడు వీళ్ల కళ్ళుగప్పి వుడాయించాడు. ఉన్నదీ పోయె... ఉంచుకొన్నదీ పోయె అన్న సామెతను యథార్థం చేస్తూ ఒక కేసులో ప్రశ్నించటానికి ఆ వ్యక్తిని తీసుకు వచ్చారట.

**స్వప్న జ్యోతి, గుంటూరు**

సన్నగా పొడవుగా వున్నాను

ట్రాంబా రోజుకో బిళ్ళ వాడండి భోజనా నంతరం విటాపెప్సిన్ మందు గరిట నీళ్ళు కలిపి తీసుకోండి పళ్ళు, పాలు, తీపి పదార్థాలు తీసుకోండి ఐస్‌క్రీం కోకోవా చాకొలెట్ వలన త్వరగా లావెక్కుతారు అయితే తగువాటి వ్యాయామం కూడా చేయండి

**పి లక్ష్మి-శ్రీకాకుళం**

జుట్టు వూడిపోతున్నది పొడుగు పెరగాలి

జావెట్ రోజుకో గొట్టం భోజనానంతరం వాడండి మినటాప్ మందు రోజూ రెండుసార్లు తలకు రాసుకోండి

**వై కాంతారావు-మచిలీపట్నం**

స్పీడుగా మాట్లాడతాను

ఏకాంత ప్రదేశంలో నెమ్మదిగా మాట్లాడటం ప్రాక్టీసు చేసుకోండి

**సి లక్ష్మీరంగయ్య-ప్రొద్దుటూరు**

అపెండిసైటిస్ అంటే ఏమిటి

అపెండిక్స్‌ను తెలుగులో క్రిముక అంటారు అపెండిక్స్ చీము పట్టి వాచినప్పుడు పొట్ట కుడి భాగంలో దిగువన నొప్పి ఒకోసారి గడ్డ ఏర్పడటం, వాంతి అవటం జరుగుతుంది ఎపెండిసైటిస్ వ్యాది అని అనుమానం ఏర్పడ్డప్పుడు వెంటనే డాక్టరును సంప్రదించాలి సొంత వైద్యం చెరుపు చేసే అవకాశం ఎక్కువ

**వి వి బాబు-రాజమండ్రి**

ముక్కు సరి చేయించుకోవాలి

ప్లాస్టిక్ సర్జరీ డిపార్టుమెంట్లు అన్ని మెడికల్ కాలేజీలలో వున్నాయి ప్రైవేటు ఆస్పత్రులు, విజయవాడలో డాక్టరు రాజారావు గారు, డాక్టరు లక్ష్మిగారు నడుపుతున్నారు

**కోడె శ్రీనివాసరావు-గుంటూరు:**

నేను మీ అభిమానిని మీరు యిలా జవాబులివ్వడం నాకెంతో సంతోషంగా వుంది జవాబులన్నీ వ్రాసి అట్టిపెడుతున్నాను మారుమూల గ్రామప్రజలు మీ జవాబుల ప్రకారం మందులు వాడవచ్చా? మా వూరివారికి మీ సలహాలందించాలని వుంది

తప్పకుండా వాడవచ్చు అలా వీలు కానప్పుడు ఆ విషయంలో డాక్టరుగారిని సంప్రదించమని రాస్తున్నాను అయితే ఒక విషయం- నా జవాబులో సూచించిన మందు పని చేయనప్పుడు వెంటనే అందుబాటులో వున్న డాక్టరుగారిని సంప్రదించండి

**సుహాసిని-హైదరాబాద్**

జుట్టు రాలిపోకుండా మందు చెప్పండి

మానసిక ప్రశాంతత తగినంత పోషక పదార్థాలున్న సమీకృతాహారం వారానికి రెండుసార్లు తలంటు వలన ప్రయోజనం వుండవచ్చు జెబెక్స్ రోజుకో బిళ్ళ మూడు నెలలు వాడండి అప్పటికీ ప్రయోజనం లేకుంటే మినటాప్ మందు రోజూ రెండుసార్లు రాసుకోండి అయిదారు నెలలపాటు

**శీలం నరసింగ రావు -అలమండసంత, విజయనగరం**

వంటి మీద రోమాలు ఎక్కువై అసహ్యంగా వుంది

అందరూ జుట్టు లేదని బాధ పడుతున్నారు! పొడుగు చేతుల చొక్కా వాడండి గడ్డం మీసం రోజూ షేవ్ చేసుకోవచ్చు

**బాస్కర్- కడుమూరు**

చాలామంది అమ్మాయిలతో సంపర్కం వుండేది ఇప్పుడు అమ్మాయిలంటే విరక్తిగా వుంది వయసు 19 సంవత్సరాలు

ఇంత త్వరలో విరక్తి కల్గినందుకు సంతోషించండి శ్రద్ధగా చదువుకుని తగు సమయంలో వివాహం చేసుకోండి తినగా తినగా తీపి చేదవుతుందంటారు!

**యు రమేష్- వనంపల్లి, తూ గో జిల్లా**

వివాహం కాలేదు మల విసర్జన సమయంలో ఇంద్రియ నష్టం జరుగుతుంది

కొంతమంది అవివాహితులలో అలా జరుగుతుంది స్పిమన్ బిళ్ళలు రోజూ మూడు చొప్పున నెల వాడండి ఫలితం లేకుంటే డాక్టరు గారికి చూపండి అదుర్దాపడనవసరం లేదు

**టి లలిత, ఏలూరు**

మా పాపకు 18 సంవత్సరముల వయసు రుతుస్రావం సరిగా రాదు జుట్టు వూడుతోంది నెరుస్తుంది

జింకోఫర్ గొట్టం రోజుకొకటి వాడండి రెండు మూడు నెలల్లో ఫలితం లేకుంటే లేడీ డాక్టరుకు చూపించండి సైక్లికల్ హార్మోనల్ థెరపీవల్ల ప్రయోజనం వుంటుంది

○

## బొమ్మల పజిల్

# వ్యాఖ్యపోటీ ఫలితాలు




సినిమా రైటర్ల లాగే గొప్ప గొప్ప డైలాగులు కుప్పలు కుప్పలుగా వ్రాసి పంపించిన పాఠకులందరికీ మా శుభాభినందనలు లెక్కకుమించి మాకందిన వాటిలో కొన్నింటిని ఎంపిక చేస్తున్నాము.

> శోభన్‌బాబు: "నేనీ గుర్రంతో కపీకితే మీకేమైనా అభ్యంతరమా?"
>
> జయప్రద: "అది తన్నగలదు జాగ్రత్త!"

### బహుమతి పొందిన వ్యాఖ్య

రాజేంద్రప్రసాద్: "గంట నుంచి గమనిస్తున్నా! అసలు 'మీరు' గుర్రం బొమ్మనే చూస్తున్నారా అంట!"

-మానస (వరంగల్)

జయప్రద: "గుర్రం తోక కాకపోతే చొక్కా, ప్యాంటు విప్పి పరుగెత్తండి! నాకేం అభ్యంతరం లేదు!"

-టి. రాంప్రసాద్ (ప్రొద్దుటూరు)

శోభన్‌బాబు: "ప్రక్కనుంచి చూస్తున్నాడే, అతడి కోరికలే గుర్రాలయితే, వాటి నడుపు చేయాలంటే యిదిగో యిలా చేయాలి!"

-దామర్ల సత్యనారాయణ (పాత మంగళగిరి)

రాజేంద్రప్రసాద్: "నాకు బహుమతిగా వచ్చిన 'కాంస్య గుర్రం' తనే సాధించానని చెప్తాడేంటి!"

-జి సూర్యమోహనరావు (ముంగండ)

జయప్రద: "మీకు 'తోకపీకుడు' గాడని బిరుదిస్తే అభ్యంతరమా?"

-కె. సరోజ (హైదరాబాద్)

జయప్రద: "కోరికలు గుర్రాల వంటివి. గుర్రాన్ని అదుపులో వుంచినట్లే కోరికలను కూడా అదుపులో వుంచుకోవాలి!"

-నెల్లూరు మనోహరరెడ్డి (చిల్లకూరు)

పెద్ద కథ

# మనశ్శాంతికి మందులా?

(గతసంచిక తరువాయి)

రాంబాబు బస్సులోనుంచి దిగి, హోటల్లో భోజనం చేయటానికి వెళ్లాడు. అప్పటికే బల్లల మీద విస్తళ్లు వేశారు. కుర్చీల మీద అంతా కూర్చున్నారు. ఒక కుర్చీ మిగిలింది. వెళ్లగానే చటుక్కున దాని మీద కూర్చున్నాడు. రైలు వేళకు స్టేషన్‌లో ఉండాలంటే ఇక్కడి నుంచి త్వరలో బయటపడాలి. వడ్డన ఆలస్యమవుతున్నదని విసుగేస్తోంది అతడికి.

"ఏమండీ డ్యూటీలో జాయిన అయ్యారా?"

"అయ్యాను. ఏకాస్త ఆలస్యం జరిగినా ఆర్డరు మారిపోతుంది. ఇది అనుకోకుండా వచ్చిన ప్రమోషన్. మా ఆవిడ హాస్పిటల్లో ఉంది. పురుడొచ్చి మూడు రోజులే అయింది. పక్కింటి వాళ్లకు చెప్పి, వచ్చి చేరిపోయాను."

"ఇది కొద్ది నెలలే అనుకోండి. ఆ సీనియర్ ఆఫీసర్ ఒంట్లో బాగాలేక సెలవు పెట్టింది అదీ రెండు నెలలే."

రెండవ అతడి ముఖంలో రంగులు మారాయి.

"పాపం ఎప్పుడూ దిగులుగా కనబడేది. ముఖం చూస్తే ఏదో పోగొట్టుకున్నట్టుండేది."

"ఆమె యిప్పుడు ఇక్కడే హాస్పిటల్లో ఉందిట. మతి లేనట్టు మాట్లాడుతుందట."

రాంబాబు వెంటనే లేచి చెయ్యి కడుక్కుని హాస్పిటల్‌కు కాలి నడకన బయలుదేరి, దారి మధ్యలో బండి కుదుర్చుకుని వెళ్లాడు. అతడు వెళ్లేసరికి హాస్పిటల్ గేటు మూసి ఉంది. కునికిపాట్లు పడుతూ కూర్చున్నాడు స్టూలు మీద వాచ్‌మెన్. అతడు లోపలికి వెళ్లనివ్వడు. రాంబాబు ఆ సమీపంలో ఉన్న ఫుట్‌పాత్ మీద గోడకానుకుని కూర్చున్నాడు.

వేకువ ఝామున నర్సులూ ఆయాలూ లేచి ఇటు అటు తిరుగుతూ కేకలు పెట్టటం అతడికి వినబడుతూనే ఉంది. తెల్లవారి ఏడు గంటలకు నైట్ వాచ్‌మెన్ వెళ్లాడు. కొత్త వాచ్‌మన్ వచ్చాడు.

తన బంధువుకు చాలా సీరియస్‌గా ఉన్నదని అతడికి చెప్పి లోపలికి వెళ్లాడు రాంబాబు. కాని- ఎటు వెళ్లాలి? నర్సులను ఏమని అడగాలి?

ఒకరిద్దరు నర్సులను అడిగితే తెలియదన్నారు.

ఫిమేల్ వార్డు వరండా దగ్గర నిలబడి, ఆ వార్డులోకి వెళ్తున్న డాక్టర్‌నడిగాడు.

"నా వెంట రండి. పేషంటును చూపిస్తే చెప్పగలుగుతాను" ఇద్దరూ మంచాల మధ్య నుంచినడిచి వెళ్లుతున్నారు. అప్పటికే ఒక మంచం దగ్గర నర్సులూ ఆయాలూ చేరి ఘర్షణ పడుతున్నారు.

"హార్టు పేషంటు కోసం తెచ్చి పెట్టిన పెథిడిన్ సీసా లేదు. పది గంటలకు డాక్టర్ వచ్చి అడిగితే ఏం చెప్పాలి? మీరంతా ఆ గదిలో ఏదో పని మీద తిరుగుతూనే ఉన్నారు. ఇది మొదటిసారి కాదు. ఇది మూడో సీసా ఈ నెలలో." అరుస్తోంది హెడ్ నర్స్.

డాక్టర్ వెళ్లివాళ్ల మధ్యన నిలబడి "మళ్లీ పోయిందా? నాకు ఈ పేషంట్‌ను చూస్తే అనుమానంగా ఉంది. ఈమె వచ్చినప్పటి నుంచే పెథిడిన్ సీసాలు పోతున్నాయి. మీలో ఎవరో ఆమెకు అందిస్తున్నారని నా అనుమానం. ఆ ఇంజక్షను కూడా ఇస్తున్నారు. లేకపోతే ఈ పేషంటు కాళ్లూ చేతులూకొట్టుకుని ఏడ్చేది. ఇప్పుడు ప్రశాంతంగా పడుకుంది చూడండి"

నర్సులందరూ ముఖాలు ముడుచుకున్నారు. హెడ్ నర్స్ నడుమ్మీద చేతులు పెట్టుకుని నిలబడ్డది.

"ఈ వార్డు పెద్ద డాక్టరికి చెప్పండి. ఆయనే వాళ్లమీద చర్య తీసుకుంటాడు" డాక్టర్ ముందుకు వెళ్లాడు.

రాంబాబు ఆ పేషంటు ముఖం పరి



# సినిమాలకు 'భాగ్యశ్రీ' గుడ్‌బై

'మైనే ప్యార్‌కియా' చిత్రం ద్వారా పేరు సంపాదించుకున్న భాగ్యశ్రీ యిక ముందు సినిమాల్లో నటించ నంటోంది ఈ అయిష్టతకు కారణ మేమిటా అని ఆరా తీస్తే గృహస్థ జీవితంలోకి అడుగు పెట్టిందని, త్వరలో తల్లి కాబోతున్నదని తెలిసింది. అందుకే చిత్రాల్లో నటించాలన్న ఉత్సాహాన్ని చూపడం లేదట

కొంత మంది నటీనటులు యిలాగే చెప్పి తర్వాత మళ్ళీ చిత్రరంగంలోకి ప్రవేశించిన సంఘటన లెన్నో చూశాం. మరి భాగ్యశ్రీ తన మాట ఎంత వరకు నిలబెట్టుకుంటుందో చూడాలి!

శిలవగా చూశాడు. సంధ్యను చూసి చాలా రోజులయింది. సంధ్య పోలికలు జ్ఞాపకం తెచ్చుకుని ఆమె ముఖంలో వాటిని వెద కటం మొదలు పెట్టాడు.

ఆమె నల్లబడిపోయింది. కళ్ళు గుంటలు పడ్డాయి. చెంపలు లోతుకుపోయాయి. తల వెంట్రుకలు చాలా వరకూ ఊడిపోయాయి. గుర్తు పట్టటం చాలా కష్టమనిపించింది.

సంధ్య ముఖంలోకి చూస్తూ అతడు పన్నెండు గంటల వరకూ మంచం దగ్గరే ఉన్నాడు. ఆమె కనురెప్పలు కదలగానే మెలుకువ వచ్చిందని లేచి నిలబడ్డాడు. సంధ్య కళ్లు తెరిచింది. కాని- ఆమె ముఖంలో ఏదో బాధ పడుతున్న ఛాయలు గోచరించాయి. కొంత సేపటికామె మూలుగుతూ ఇటూ అటూ పొర్లింది. క్రమంగా మూలుగు ఏడుపులోకి దిగింది.

"మళ్లీ లేచావా?" అంటూ దగ్గరికి వచ్చిందివార్డు నర్సు.

ఏడుస్తూనే "సిస్టర్ ఒక్కసారి- ఈ ఒక్కసారికే అడుగుతున్నాను తెచ్చిపెట్టవూ? అది లేకపోతే నా ప్రాణం పోతున్నట్టుంటుంది! ప్లీజ్ ఈ ఒక్కసారి సహాయం చెయ్యవూ?" దీనంగా వేడుకుంది.

నర్సు రాంబాబును చూస్తూ "మీరు ఈమె కోసమేవచ్చారా?" అడిగింది.

"అవును."

"ఈమెకు ఇవ్వవలసిన మందులిచ్చారు. మందులు పని చెయ్యకుండా ఏవేవో డ్రగ్స్ తీసుకుంటుంది. మీరు ఇంటికి తీసుకు వెళ్లి జాగ్రత్తగా కాపాడుకోండి. నేనిప్పుడే డాక్టర్ని పిలుచుకు వస్తాను. ఎప్పటి నుంచో డిస్చార్జి చేస్తానంటున్నారు. పాపం. ఒంటరిది. ఎక్కడికి పోతుందని ఆగారు" అన్నది.

సంధ్యకు నిద్ర రావటానికి ఒక ఇంజక్షన్ ఇప్పించి, ఆమె మత్తులో ఉండగా టాక్సీలో తీసుకువచ్చాడు రాంబాబు.

ఊరి ముందరికి రాగానే "ఈమెను ఇంటికి తీసుకువెళ్లి ఏం చెయ్యాలి? ఈమె మత్తు మందులకు అలవాటు పడిందని ముందే చెప్పి, తగిన జాగ్రత్తలు తీసుకోవలసిందిగా డాక్టర్లకూ నర్సులకూ చెప్పి హాస్పిటల్లో చేర్పిస్తే మంచిది" అనుకుంటూ ఆ ఊరి హాస్పిటల్లో చేర్పించి ఆమె పరిస్థితిని వివరించాడు డాక్టర్‌కు.

"ఇన్నాళ్లెక్కడికి వెళ్లావు చెప్పు రాంబాబూ! నీతో మాట్లాడుతూ ఉంటే మనసులోని భారమంతా తగ్గిపోయి, తేలికగా అయేది. నన్నొదిలి పెట్టి వెళ్ళటానికి నీమనసెట్లా వచ్చింది" శివరామ్ రాంబాబును గుంజి కూర్చోబెట్టాడు.

అతడి చూపులు జాలిగొల్పుతున్నాయి. మాటలు దైన్యాన్ని జాలువారుస్తున్నాయి.

"రోజూ అన్నం తింటున్నావా? రాత్రిళ్లు నిద్రపోతున్నావా? నిన్ను చూస్తుంటే రెండూ లేనట్టున్నాయి. నాకు ఉద్యోగ ధర్మం ఉందని మర్చిపోయావా? నా సంసారం ఏమయిందో చూసి రావద్దా? ఇప్పుడు నా ఎదుట భోజనం చేసి ఒక గంటసేపు రెస్టు తీసుకో. నేను మళ్లీ వస్తా" అంటూ రాంబాబు బైటికి వెళ్లిపోయాడు.

హాస్పిటల్లో ఉన్న సంధ్య ఇక్కడ కూడా గొడవ చేయటం మొదలుపెట్టింది. రాంబాబు ఆమె గత చరిత్రంతా చెప్పి, నర్సులనూ డాక్టర్లనూ మరొకసారి హెచ్చరించి ఆ సాయంత్రానికి శివరామ్ ఇంటికి వచ్చాడు. శివరామ్ అప్పటికే చెరువుగట్టుకు వెళ్లాడు. వచ్చే వేళయింది.

"కోటయ్యా"

మూడు పిలుపులకు గాని బైటకి రాలేదు.

"కోటయ్యా. నీ కొడుకు ఎప్పుడు పుట్టాడు? ఇప్పుడెన్నేళ్లు?"

"మాకు లెక్కలేం తెలుస్తాయి బాబూ. పన్నెండు పదమూడు ఉండవచ్చు."

"తల్లి కనబడదేం?"

"లేదండి"

"నీ కొడుకు ఇంట్లో ఉన్నాడా?"

కోటయ్యకు పిల్లవాడిని గురించి రాంబాబు ఎందుకు అడుగుతున్నాడో నన్న అనుమానం వచ్చింది.

"ఎక్కడున్నాడో పిలు." గట్టిగా అడిగాడు.

కోటయ్యకు పిలవక తప్పలేదు. పిల్లవాడు మాసిన షర్టూ చిరిగిన నిక్కరు చేతులు నులుపుకుంటూ వచ్చాడు

అంతలో శివరామ్ బయటనుంచి వచ్చాడు రాంబాబు జేబులో నుంచి ఫొటో తీసి పిల్లవాడినీ ఫోటోనూ పరికించి చూస్తున్నాడు. ఫోటోలో సంధ్య ముఖం స్పష్టంగా కనిపిస్తోంది. పిల్లవాడి చెయ్యి పట్టుకుని ఆరోవేలు చూశాడు. పుట్టు మచ్చలు చూసి తన అనుమానాన్ని ధృవపరుచుకున్నాడు.

"శివరామ్. వీడు నీ కొడుకు. ఈ ఫోటో గుర్తులూ నర్సింగ్‌హోమ్ డాక్టరిచ్చింది. ఆమెతో మాట్లాడి ఈ ఫోటో తెచ్చాను."

శివరామ్ కళ్లుచికట్లు కమ్ముతున్నాయి. తన కొడుకు! ఈ చింపిరి వేషంలో తన యింట్లోనే పని చేస్తున్నాడా? సంధ్య వీడిని కోటయ్యకు ఒప్పగిస్తే తనకురాగానే ఎందుకు చెప్పలేదు?

శివరామ్ పరిస్థితి చూసి రాంబాబు అతడిని శాంతపరచాలని ప్రయత్నిస్తూ "చూడు నీవు మనసు కుదుటపరచుకొని వీడి విషయం ఆలోచించి మంచి ప్లాను వేసి బాగుపడేటట్లు చెయ్యి."

"అయ్యో! మా ప్లానులు? మా పుట్టబోయే బాబును మాంటెసర్ స్కూల్లో వెయ్యాలనుకున్నాము. వాడికి ఏం డ్రెస్సులు వెయ్యాలో రాసి పెట్టుకున్నాము. వాడికి ఎలా మంచి శిక్షణ యిచ్చి పెంచాలో నిర్ణయించుకున్నాము. వాడు పెద్దవాడైన తరువాత ఏం చదివించాలో రోజూ చర్చించుకునేవాళ్లం.

అలా రోజులు క్షణాల్లా గడిపాం. అటువంటి మా ముద్దు బిడ్డకు ఈ గతి పట్టింది?" పసివాడిలా వాపోయాడు శివరామ్.

"అబ్బబ్బ నీవు ధైర్యంగా ఉండాలి. నేనెంత కష్టపడి నీ కొడుకు ఆచూకి సంపాదించానో తెలుసా? అబ్బాయిని ఇప్పుడెలా చదివించాలో నీవు ఆలోచించు. నేను సంధ్యను కూడా వెతుక్కొస్తాను. అన్నిటికీ బెంగ పెట్టుకుని పరిస్థితులను ఇంకా దిగజార్చకు. వింటున్నావా?"

దీనంగా చూశాడు శివరామ్.

"నీవు ఊ అంటేగాని నేను వెళ్లను. మళ్లీ నేను వచ్చేసరికి నీ కొడుకును పూర్తిగా వేష భాషల్లో మార్చివెయ్యి. చదువు ప్రారంభించు. వెళ్తాను మరి" అన్నట్టు ఆ కోటయ్యను ఇంట్లోంచి వెళ్లగొట్టు"

శివరామ్‌ను వెనక్కు తిరిగి చూడకుండా గబగబా అడుగులు ముందుకు వేశాడు రాంబాబు.

హాస్పిటల్లో సంధ్యను చూడగానే అతడి గుండెజారినట్టయింది.

సంధ్య చిక్కిపోయింది. ఆహారం సరిగా తీసుకోదు. డాక్టర్లు కోప్పడి ఇంజక్షన్లు ఇస్తున్నారు. ఆమె దేనికోసమో ఆరాటపడుతున్నది. ఏదో కావాలని నర్సులను వేడుకుంటున్నది.

"మీకోసం ఎవరో వచ్చారు చూడండి" నర్సు రాంబాబును వేలు పెట్టి చూపించింది.

సంధ్య దిగ్గున లేచి కూర్చుంది. "ఎవరు మీరు? నాకోసం ఏదైనా తెచ్చారా?"

రాంబాబు గుండె గతుక్కుమన్నది.

"మీరెవరు? ఏం పేరు? ఇక్కడెందుకున్నారు?" సంధ్యనడిగాడు ఏం చెప్తుందోనని.

"నేనా? ఇక్కడ నన్నెందుకు చేర్చుకున్నారో తెలియడం లేదు. వీళ్లు నాకు కావలసిన మందు ఇవ్వటం లేదు. నా మాట ఎవరూ వినిపించుకోరు. నన్ను బయటికి వెళ్లనీయరు" బిగ్గరగా ఏడ్చేసింది.

"మీ పేరు? ఎక్కడుండేవారు?"

తల తడుముకుంటూ మెల్లగా తనేం పని చేసేదీ ఎక్కడుండేదీ చెప్పింది.

"అలాగా మీరు శివరామ్ భార్య కదూ?"

"అవునవును. ఆయనెక్కడున్నారో తెలుసా?"

"తెలుసుకోవాలి. అందరికీ ఉత్తరాలు రాయాలి"

"అయ్యో నేను రాసి రాసి విసిగిపోయాను. ఎక్కడున్నారో తెలియదు. కొన్ని ఉత్తరాలుతిరిగి వచ్చాయి. చివరికి అతడి ఇంటికి రోజుకొక ఉత్తరం రాశాను. అవన్నీ ఎటు పోయాయో? ఇంక నిరాశ చేసుకున్నాను. ఆ పిల్లవాడిని శివరామ్ ఊరు వెళ్లి పనివాడికి రెండువేల రూపాయలతో ఇచ్చి, ఆయన ఎప్పుడు వస్తే అప్పుడు అందజేయమన్నాను. ఏం చెయ్యను? నా బాబు బంగారు భవిష్యత్తు ఏమయిందో? ప్రాణంలో ప్రాణమనుకున్న శివరామ్ ఏమయ్యాడో?" వెక్కి వెక్కి ఏడ్చింది. మరి కాసేపటికి కాళ్లూ చేతులూ కొట్టుకుంటూ గిలగిల్లాడిపోయింది.

రాంబాబు నర్సును పిలిచాడు. ఆమె డాక్టర్ చెప్పినట్టుగా ఒక ఇంజక్షను ఇచ్చింది.

"ఈమె రోజూ ఇలా ఇంజక్షన్లు తీసుకుంటూ ఉండవలసిందేనా? ఈమె పరిస్థితి ఎప్పుడు మెరుగవుతుంది? ఆహారం ఏమిస్తున్నారు?" రాంబాబు డాక్టర్ కూర్చున్న గదిలోకి వెళ్లాడు.

"ఆమె ఇప్పటి పరిస్థితికి మూల కారణం తన ఆత్మీయులు ఏమయ్యారో నన్న ఆందోళనని కదా మనముకిందటిసారి కలుసుకున్నప్పుడు అనుకున్నాము? వాళ్లల్లో ఒక్కరయినా ఈమె కంటికి కనుపిస్తే మానసిక పరిస్థితి క్రమంగా బాగుపడవచ్చు. ఆహారం చాలినంత తీసుకుంటే శారీరకంగా ఎప్పటి మాదిరి కావచ్చునని నా అభిప్రాయం" అన్నాడు డాక్టర్.

"రేపు నేను వస్తానని చెప్పండి. మీరన్నట్టుగా ఆత్మీయుల కలయికతో బాగుపడుతుందేమో?" రాంబాబు మరునాడు శివరామ్‌తో మాట్లాడి పిల్లవాడిని తీసుకువెళ్లాడు.

అప్పుడే బలవంతంగా కప్పు పాలు రెండు పళ్లూ తీసుకుని మంచమ్మీద పడుకుని కిటికీలోనుంచి బైటికి చూస్తోంది. ఎర్రటి పూలు పూసే పెద్ద పెద్ద చెట్లుగుండా మెరుపుల్లాక నబడే సూర్యకిరణాలు ఆమె గదిలోకి తొంగి చూస్తున్నాయి.

రాంబాబు గదిబైట పిల్లవాడిని నిలబెట్టి తనుమాత్రమే లోపలికి వచ్చి "సంధ్యగారూ? ఇవాళ ఎలా ఉన్నారు?" అడిగాడు.

కిటికీలోనుంచి బైటికి చూస్తున్న ఆమె గిరుక్కున పక్కకు తిరిగి రాంబాబును కొత్తవాడిని చూసినట్టు చూసింది.

"నేను నిన్నా మొన్నా వచ్చానుకదండీ. నన్నప్పుడే మరిచిపోయారా? శివరామ్ సంగతి మీరు రాసిన ఉత్తరాల సంగతీ అంతా చెప్పారు కదండీ" ఇంకా జ్ఞాపకం రాలేదా?

"ఆ. వచ్చింది. నా మనసు పాడయిపోయిందని చెప్పానుగా. పెళ్లి అయినప్పటి నుంచీ- మా చిన్న కుటుంబాన్ని ఆదర్శంగా తీర్చి దిద్దాలని ఎన్ని కలలు కన్నాను? అన్నీ ఇట్టే కరిగిపోయాయి. బేబీని శివరామ్ యింట్లో నౌకరికి ఇచ్చేశాను. ఇక నాకేం మిగిలింది? సర్వం పోగొట్టుకున్నానండీ. ఇంక నాకెందుకీ జీవితం? నాకు చావాలని ఉంది. ఎవరూ నన్ను చావనివ్వరు. నదిలో పడితే ఎవరో బైటకి తీసి చివాట్లు వేసి పంపించారు. నిద్ర మాత్రలు మింగితే మరెవరో చూసి హాస్పిటల్లో చేర్చి స్టమక్ వాష్ ఇప్పించారు. అది పోలీసు కేసయింది. దానిలో నుంచి బైటపడే సరికి తలంతా తిరిగిపోయింది. ఇంక ఇప్పుడు జరిగినదంతా మరిచిపోవాలని...."

"మీరు జీవితంలో ఏం పోగొట్టుకున్నారో ఇప్పుడు నాకు బాగా అర్థమయింది. మిమ్మల్ని మీవాళ్లదగ్గరికి చేరుస్తాను. కాని- మీరు డాక్టర్లు చెప్పినట్టు విని మంచి ఆహారం మందులు తీసుకొని ఆరోగ్యాన్ని ముందు బాగు చేసుకోవాలి. బాగు చేసుకుంటానని నాకు మాట యిస్తే మీకు నేను చేసిన వాగ్దానం నెరవేరుస్తాను. మాట యివ్వండి."

ఆమె తల తిప్పుకుని మౌనం వహించింది.

## మనశ్శాంతికి మందులా?



రాంబాబు పిల్లవాడిని తీసుకువచ్చి ఆమె ఎదురుగా నిలబెట్టాడు.

"ఇటు చూడండి. ఈ పిల్లవాడు మీకింతకు ముందు తెలుసా?"

ఆమె అతడిని పై నుంచి కింద వరకూ చూసి ఊహూ అంటూ తల తిప్పింది.

"బాగా ఆలోచించి చెప్పండి. మీ దగ్గరగా కూర్చోబెట్టుకుని చూడండి."

ఆమె అతడుతనదగ్గరికి రాగానే "ఇంత పెద్దవాడు కాదండి నా బాబు" అన్నది మూతి విరుస్తూ.

"పన్నెండు పదమూడు సంవత్సరాల క్రిందట సంగతని మీరే చెప్పారు. మీరు బిడ్డతో తీయించుకున్న ఫొటో ఇదిగో. రిజిస్టరులో రాసిన వివరాలివి. పిల్లవాడిని గురించిన వివరాలు చదువుకుని మరోసారి చూడండి"

ఆమె దిగ్గున లేచి కూర్చుని చెవి వెనక వున్న పుట్టుమచ్చను వెతికి చూసింది. చేతికి ఆరవ వేలుందా లేదా అనిచేత్తో తాకి చూసింది.

"నా బాబు ఇంతవాడైనాడా? పేరేమిటి బాబూ?"

"పేరు ఎవరు పెడతారు? తల్లీ తండ్రీ కలుసుకున్నప్పుడు కూడబలుక్కుని ముద్దుగా బిడ్డకు పేరు పెడతారు. మీరు వస్తేగాని ఆ పని జరగదు. ఏమంటారు? ఇంటికి వస్తారా? ఇంట్లో మందులుండవు. ఇంజక్షన్లు ఇచ్చే నర్సులుండరు. బాగా ఆలోచించుకోండి"

"వీడు నిజంగా నా బిడ్డే అయితే తప్పకుండా వస్తాను."

"ఇంకా నిజం ఎట్లా ఉంటుంది? శివరామ్‌ను చూసినా ఇలాగే అంటారా?"

"ముందు చూడనీయండి"

వెంటనే డాక్టర్ దగ్గరికి వెళ్ళి ఆమెను కొన్నిగంటలపాటు ఇంటికితీసుకు వెళ్లటానికి పర్మిషను తీసుకున్నాడు. టాక్సీలో ఆమెనూ పిల్లవాడినీ ఇంటికి తీసుకువచ్చాడు.

శివరామ్ వీధి వరండాలో కూర్చుని పేపర్ చూస్తున్నాడు. కారుచప్పుడు విని గేటువంక దృష్టిని నిలిపాడు.

కారులో నుంచి దిగిన సంధ్య ఆ యింటిని బాగా పరికించి చూసింది. తను చూసిన ఇల్లే. ఆ చెట్లూ ప్రహారీగోడ వాకిటి మెట్లూ ఎప్పుడో చూసినట్లే ఉన్నాయి. వాటి నన్నిటినీ గుర్తు పట్టిన చిహ్నాలు ఆమె ముఖంలో కనబడ్డాయి. వాటిని గమనించిన రాంబాబు ముఖంలో చిరునవ్వులు చిందాయి.

ఆమె అటూ ఇటూ చూసి ఔట్‌హవుస్‌లోకి తొంగి చూసింది. కోటయ్య గదిలో ఒక మూలకు పడుకుని ఉన్నాడు. అతడిప్పుడు పని చేయటం లేదు. మరునాడు ఊరికి వెళ్లాలని నిశ్చయించుకున్నాడు.

సంధ్య అతడిని బైటికి రమ్మని వేలిసైగ చేసింది... 

**Statement about Ownership and other Particulars about Newspaper,**
**ANDHRA SACHITRA VARA PATRIKA**

Form IV [See Rule-8]

1 Place of Publication VIJAYAWADA
2 Periodicity of Publication. WEEKLY
3 Printer's Name S Nageswara Rao
Whether Citizen of India Yes
Address 1, Luz Avenue, Mylapur, Madras 600 004
4 Publisher's Name. S. Nageswara Rao
Whether Citizen of India: Yes
Address 1, Luz Avenue, Mylapur, Madras 600 004.
4. Editorial Adviser: S. Radhakrishna
Whether Citizen of India. Yes
Address 14-14-21, Mallikarjuna Rao street, Gandhinagar, Vijayawada-3
6 Names and Addresses of Individuals who own the News paper and partners or share holders holding more than one percent of the total capital.
(1) Name. S Kamakshamma, 1, Luz Avenue, Mylapur, Madras 600 004, (2) S Radhakrishna, Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (3) Name S Nageswara Rao, Address 1, Luz Avenue, Mylapur, Madras 600 004, (4) Name. S. Rajeswari, Address. 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (5) Name S. Seshamma, Address: 1, Luz Avenue, Mylapur, Madras 600 004, (6) Name: G.V. Subba Rao, Trustee Amrutha Dharma Nidhi, Address 42-45 Luz Church Road, Madras 600 004, (7) Name. S. Ramayamma, Address 1, Luz Avenue, Mylapur Madras 600 004, (8) Name P. Satyanarayana, Address: Plot No. 28, Bhagyalakshmi Nagar, (Behind Kalpana Talkies), Hyderabad 500 380, (9) M/s. Sambhu Prasad & Sons P Ltd 63, Rayapettah High Road, Madras 600 004, (10) Mr. M S. Kini, 1-9-1122/3/1, Dayananda Nagar, Hyderabad 500 004, (11) Sri V. Sundaram, No. 20 First Main Road, Thiruvanmiyur, Madras 14, (12) Sri R. Gopalakrishnan, 79 Venkateswaranagar, Kottivakkam, Madras 600 041, (13) Sri S Sreeramamurthy, 63 Rayapettah High Road, Madras 600 004, (14) Master S.V.S. Arvind, 1, Luz Avenue, Madras 600 004, (15) Smt P. Nageswaramma, 1, Luz Avenue, Madras 600 004, (16) Dr. P.S.N Murthy, 8-2-322, Banjara Hills, Hyderabad, (17) Sri Venkatarao Kordale, 1-1-593/2, Gandhinagar, Hyderabad 38, (18) Smt Ganti Kamakshi, Plot No. 7, 146, Luz Church Road, Mylapur, Madras-4.

1 S Nageswara Rao hereby declare that the Particulars given above are true to the best of my knowledge and belief

**S. NAGESWARA RAO,**
1-3-1990 Signature of Publisher

తల గుడ్డ చుట్టుకుంటూ కోటయ్య బైటికి వచ్చాడు. ఆమెను చూడగానే అతడి గుండె గుబగుబలాడింది.

సంధ్య అతడిని బాగా పరకాయించి చూసి "నేకానాడు నా బాబును రెండు వేల రూపాయలతో ఇచ్చాను. నా బాబును నాకిచ్చెయ్యి" అరిచింది గట్టిగా.

"అయ్యగారికి అప్పగించానమ్మా. చూసుకోండి. ఆరవవేలు- చెవివెనక పెద్ద పుట్టుమచ్చ" అన్నాడు చేతులు జోడిస్తూ.

వెంటనే రాంబాబు వచ్చి "నేనడిగినప్పుడు సరిగా ఎందుకు జవాబు చెప్పలేదు? అయ్యగారికిరాగానే ఎందుకు ఒప్పచెప్పలేదు?" గద్దించాడు.

కోటయ్యకు నిజం చెప్పక తప్పలేదు. పిల్లవాడని నేను పెంచుకుంటే ముసలితనానికి ఇంత కాచిపోస్తాడని ఆశపడ్డాను బాబయ్యా కాళ్లమీద పడ్డాడు.

"నీవు చేసిన పనికి జైలుకు పంపాల్సింది. కాని- మీ అయ్యగారు మంచివాడు కనుక బతికిపొయ్యావు పో" రాంబాబు సంధ్యతో వెనక్కు తిరిగాడు.

మెల్లగా మెట్లెక్కుతూ ఇటూ అటూ చూసింది సంధ్య. వరండాలో నాలుగు కుర్చీలు వేసి ఉన్నాయి. ఒక దాని మీద తల వెంట్రుకలూ గడ్డం నెరసిపోయిన శివరామ్‌ను చూస్తూ నిలబడి పోయింది.

శివరామ్ సంధ్యనే విస్మయంతో చూస్తున్నాడు.

"అట్లా చూస్తూ నిలబడి పోయారేం? ఇతడు శివరామండీ. ఇలా కూర్చోండి. ఏమిటి అలా చూస్తావేం? సంధ్యా అని పిలిచి పలకరించు" రాంబాబు శివరామ్ భుజంతట్టాడు.

"శివరామా? కాదు. శివరామ్ ఎప్పుడూ ట్రిమ్‌గా డ్రెస్ చేసుకుంటాడు. స్మార్ట్‌గా ఉంటాడు. ఇలా జుట్టు నెరిసి పోలేదు అతడికి. గడ్డం పెంచటమంటేచాలా అసహ్యం."

"మీరు శివరామ్‌ను చూసి ఎంత కాలమయింది! ఈ లోపల తల వెంట్రుకలు నెరసిపోవా? విరక్తి కొద్దీ అశ్రద్ధగా బట్టలు వేసుకుంటున్నాడు. గడ్డం పెంచాడు. అతడి పోలికలేమయినా మారిపోయాయా? లేదు" అంటూ సంధ్యతో శివరామ్ తీసుకున్న ఫొటో తీసుకువచ్చి చూపించాడు.

బాగా చూసింది సంధ్య "పెళ్లయిన రెండు నెలలకు ఈ ఫోటో తీయించుకున్నాము. చూడండి దీనిలో ఎలా ఉన్నాడో?" వెక్కి వెక్కి ఏడ్చింది సంధ్య.

శివరామ్ నిర్విణ్ణుడై పోయాడు. నోటి నుంచి మాట రావటం లేదు.

రాంబాబు ఆశించిన ఫలితం ఇది కాదు. సంధ్యను ఆనాటికి హాస్పిటల్‌కు తీసుకుపోవటమే మంచిదనుకుని ఆమెను టాక్సీలో తీసుకువెళ్లి డాక్టర్‌తో జరిగినదంతాచెప్పి అప్పగించాడు.

మరునాడంతా శివరామ్ దగ్గర కూర్చుని "ఓపిక పట్టరా నాయనా. నే చెప్పినట్టు విని రేపు సాయంకాలం వరకూ సిద్ధంగా ఉండు. నేను టాక్సీ తీసుకు వస్తాను" ఊరడిస్తూనే ఉన్నాడు.

సాయంత్రం ఐదు గంటల వేళ సంధ్య తన గదిలో కూర్చుని నర్సు చేత తల దువ్వించుకుంటున్నది. ఆమెను కుదురుగా కూర్చోబెట్టి తల దువ్వటానికి రెండు గంటలు పట్టింది నర్సుకు.

అంతలో ఆ గదిలోకి ఒక యువకుడు ఆధునిక వేషధారణలోనూ, పన్నెండు పదమూడేళ్ల పిల్లవాడు మరింత ఆకర్షణీయమైన వేషంలో నిగనిగలాడే కాళ్ళ షూస్‌తో అడుగు పెట్టాడు.

సంధ్య వాళ్లను చూసి దిగ్గున లేచి నిలబడ్డది.

"సంధ్యా నేను శివరామ్‌ను. వీడు మనబ్బాయి. చూడు. ఎలా వున్నాడో" సంధ్యను మంచమ్మీద కూర్చోబెట్టి తనూ కూర్చుని పిల్లవాడిని దగ్గరగా ఆమె ఎదుట నిలబెట్టాడు.

సంధ్య ఆలోచిస్తున్నట్టు కనబడ్డది. ఏదో జ్ఞాపకం తేచ్చుకోవటానికి నొసలు చిట్లించింది.

"సంధ్యా నీవిక్కడున్నావేమిటి? మాసిన చీరే కట్టుకున్నావెందుకు? ఎన్నాళ్లయింది ఇక్కడికివచ్చి?" అనునయంగా భుజమ్మీద చెయ్యి వేశాడు శివరామ్.

ఆ చేతి మీద తన చెయ్యివేస్తూ "నన్నిక్కడ నానా బాధలు పెడుతున్నారు. ఏదో తిండి పెడతారు. నా సంగతి ఎవరూ పట్టించుకోరు. అడిగినది ఇవ్వరు" ఏడుస్తూ అతడిని అంటుకుపోయింది..

"అయితే మనింటికి పోదాంరా. ముందు మన బాబును చూడు ఎంత పెద్దవాడయ్యాడో? వీడిని నీ దగ్గర కూర్చోబెట్టుకో పలకరించు."

"వీడు- వీడు- మన బాబా? నా బాబును ఎన్నాళ్లనుంచో చూడాలనుకుంటున్నాను. ఎవరూ చూపించరు శివరామ్. ఈ మాట చెప్పు? నీవు వస్తావని రాలేదేం? వస్తే బాబును చూపిద్దామనుకున్నాను. నీవు రాలేదు. ఎవరికో ఇచ్చేశాను. నీకెక్కడ దొరికాడు? బాబూ బాబూ నాన్నరా నాన్న!! అంటూ పిల్లవాడిని గుండెకు హత్తుకుంది."

"సంధ్యా మనింటికి పోదాంరా. వీడూ నీవూ నేనూ అక్కడుందాము. నీ బట్టలునర్దుకో. లే."

"నాకు బట్టలు లేవు. వాళ్ళు మంచి బట్టలివ్వరు. కొనిస్తావా మంచి చీరెలు?" చిన్నపిల్లలా అడిగింది.

ఆమె మాటలకు శివరామ్‌కు మతి పోయినట్లవుతోంది. అంతకు ముందే రాంబాబు, ముందు ముందు ఎదుర్కోవాల్సిన అంశాలను చెప్పి ఉంచటం చేత నిగ్రహించుకుంటున్నాడు.

అంతకు ముందు నర్సు వేసిన జడను విప్పేసి శివరామ్‌కంటె ముందుగా గడపదాటింది సంధ్య.

"అయ్యో సంధ్యా. మన బాబు! వాడు లేకుండా ఇంటికి ఎలా వెళతాం? వాడి చెయ్యి పట్టుకో" బాబు చేతిని ఆమె చేతిలో పెట్టి వాళ్ల వెనక నడిచాడు శివరామ్.

కారు కదిలే వరకూ వరండాలో నిలబడి, నర్సులకూ ఆయాలకూ ఇనామ్‌లిచ్చి డాక్టరు బిల్లు చెల్లించి తన యింటికి వెళ్లిపోయాడు రాంబాబు.

నాలుగు నెలలయిన తరువాత వచ్చిన

## స్వాగతం



నిత్యం నిప్పులుకనే
నేలలో
ఎన్నాళ్ళు నీళ్ళు చల్లుతారు
నిత్యం నిజాలుకనే
భూమిలో
ఎన్నాళ్ళు కళ్ళు కప్పుతారు!
పేగులు చేసిన
తిరుగుబాటును
వెన్నెముక చూపిస్తుంది
సాయుధులై
నిలిచిన వారికి
స్వాగతం పలుకుతుంది!

—అడిగోపుల వెంకటరత్నమ్

## మనశ్శాంతికి మందులా?

రాంబాబును చూసి "మీరే మధ్య రావటం లేదేం? మా అబ్బాయిని చూశారా? బాగా చదువుతున్నాడు. మేమిద్దరం కలిసి ఒక స్కూలు పెట్టాలనుకుంటున్నాము. మా బాబుతోపాటు పది మంది చదువుకుంటారు. నేను నాకొచ్చిన సంగీతం మా బాబుకు నేర్పుతున్నాను. గ్రహింపు శక్తి ఉండటం చేత బాగా నేర్చుకుంటున్నాడు. బాబూ. ఒకపాట పాడరా. వీరు వింటారు." అంటూ సాదరంగా రాంబాబును ఆహ్వానించింది. కాఫీకప్పు చేత పట్టుకుని శివరామ్‌తో మళ్లీ అక్కడికి వచ్చింది.

"ఏమండోయ్. మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. మేమిద్దరం నిరుద్యోగులం. మా ఉద్యోగాలు పోయాయి" అంటూ తేలికగా చెప్పింది.

ఆమెను ఒక్క నిమిషమయినా వదిలి పెట్టకుండా వెంబడే ఉండమని రాంబాబు చేసిన హెచ్చరిక ననుసరించి శివరామ్ అన్నాడు- "అవును రాంబాబు స్కూల్ పెట్టి నడిపితే సంధ్య ఎప్పుడూ నా దృష్టిని దాటి పోదు. అదీగాక- ఏం ఉద్యోగాలు అవి? తల అమ్ముకున్న ఉద్యోగాలు గాని?"

"అవునండీ! మాకిద్దరికీ ఇది నచ్చింది. మనం స్వతంత్రంగా బతకచ్చు" అన్నది సంధ్య శివరామ్ పక్కన నిలబడి.

బాబు వాళ్లిద్దరి మధ్య నిలబడి ఉన్నాడు.

రాంబాబు ఆదృశ్యమే చిరస్థయి కావాలని కాంక్షిస్తూ "అబ్బాయికి మంచి పేరు పెట్టి రేపు నాకు చెప్పండి" అంటూ లేచాడు.

ఆ మరునాడు రాంబాబు వచ్చేసరికి శివరామ్ గాభరాగా ఇల్లంతా తిరుగుతున్నాడు. రాంబాబు శివరామ్‌ను చూడగానే సంధ్య ఏదో చేసే ఉంటుందని ఊహించాడు. పలకరించకుండా నిలబడ్డాడు.

"చూశావురా. నీవు చెప్పినట్టుగానే సంధ్య వెంట వెంట తిరుగుతూ వీధి వాకిలికీ పెరటివాకిలికి తాళాలు వేస్తున్నాను రాత్రిళ్లు. రెండురోజుల నుంచీ మామూలు మనిషయిందికదా అనుకుని తాళాలు వెయ్యలేదు. ఏరాత్రివేళ వెళ్లిందోగాని నా జేబులో ఉన్న ఏభయి రూపాయలు తీసుకుని తలుపులు తెరిచి వెళ్లిపోయింది. నేను పొద్దున లేచి చూస్తే కనబడలేదు. ఇక్కడ ఎవరిని అడగను? అక్కడికీ నౌకర్ని పంపించాను చూడమని. మనిషి బాగుపడిందని సంతోషపడినంత సేపు పట్టలేదు' చిన్నబోయిన ముఖంతో కుర్చీలో కూలబడ్డాడు శివరామ్.

"అబ్బాయేడీ?"

"ఇంకా నిద్ర లేవలేదు'

"లేచినప్పుడు పాలు టిఫెన్ ఇవ్వమని నౌకరుకు చెప్పి ఇల్లుతాళం వేసి నాతోరా చూద్దాం" శివరామ్‌ను తన స్కూటర్ మీద మందులషాపుల దగ్గరికి తీసుకెళ్లాడు రాంబాబు.

ఆడవాళ్లెవరూ మందులు కొనటానికిరాలేదని చెప్పారు. ఆ ప్రాంతంలో సందులన్నీ తిరిగారు. మురికిపేటకు పోయేదారిలో ఒక పిల్లవాడు కనబడ్డాడు.

రాంబాబు వెంటనే స్కూటర్ దిగి ఆ పిల్లవాడిని పిలిచి "ఎక్కడి నుంచి పరుగెత్తుకుంటూ వస్తున్నావు? నీ ముఖంలో ఆ భయమేమిటి?" రెండు చేతులూ పట్టుకుని చెంపమీద వేశాడు.

కొంత సేపు మొరాయించి, ఏడుస్తూ చివరకు చెప్పాడు. అతడు మందుల దుకాణంలో ఊడ్చేవాడట. సంధ్యను వర్ణించి "ఆమె ఒక మందు ఇవ్వమని నాకు రెండు రూపాయలు కూడా ఇచ్చింది. ఈ మందులు కావాలనిచాలా మందిచాటుగా వచ్చి అడుగుతారు. వాళ్లకోసం కొన్ని నా దగ్గర ఉంచుకుంటాను. ఈ అమ్మ నాదగ్గర నాలుగయిదు కొన్నది. ఇవాళ రెండుకొన్నది" అన్నాడు రాంబాబును చూసి భయపడుతూ.

"ఆమె ఎటు వెళ్లిందో తెలుసా? చెబితే నీకు రూపాయిస్తాను' ఆశ పెట్టాడు రాంబాబు.

"ఆ వీధి వెంట వెళ్లింది. ఆమె దగ్గర ఒక సూది ఉంది. దాంట్లో ఈ మందు ఎక్కించి ఎవరిచేతనయినా గుచ్చించుకుంటుంది"

ఆ వీధిలోకి వచ్చి కలుసుకునే సందుచివర గోడకానుకుని కళ్లు మూసుకుని ఉంది సంధ్య.

పిలిస్తే పలికే స్థితిలో లేదు సంధ్య.

శివరామ్‌కుధైర్యం చెప్తూతూ వచ్చిన రాంబాబుకే ధైర్యం దిగజారిపోయింది.

"ఇంక ఈమెను మనం కాపాడలేము' సన్నగా గొణిగాడు రాంబాబు.

ఒక ఆటో తీసుకువచ్చి ఇద్దరూ పట్టుకుని ఆమెను ఎక్కించారు. శివరామ్ ఆమెను గట్టిగా పట్టుకుని కూర్చున్నాడు. ఆటో వెళుతుంటే రాంబాబు "ఈమె ఇక ఇంతే. బ్రతుకు నాశనం చేసుకుంది. శివరామ్ జీవితంలో మిగిలింది ఆ పిల్లవాడు. ఒక నిండు సంసారంలో- పండు వంటి కాపరంలో- మందులు జొరబడి నాశనం చేశాయి" శివరామ్ మీద విరుచుకుపడ్డ సమస్య తనమీద పడినట్లే విలవిల్లాడిపోయాడు రాంబాబు.

(అయిపోయింది)

# మనీలాలో "చెత్త" మనుషులు!

కొద్దిగా దుర్గంధం వస్తేనే ఎక్కడ అంటు వ్యాధులు పెరిగిపోతాయోనని అనేక ముందు జాగ్రత్త చర్యలు తీసుకొని ఆరోగ్యాలు కాపాడుకోవటం, అటువంటి దుర్గంధ భరితమైన వాటిని ఊరి వెలుపల విసర్జించటం మన దేశంలో జరిగే పనేమో! కాని ఆ దుర్గంధంలోనే పుట్టి, పెరిగి, అందులోనే తమ జీవితాలను అంతం చేసుకుంటున్న "చెత్త" మనుషులు ఫిలిప్పైన్స్ రాజధాని 'మనీలా'లో వున్నారట. వారి జీవితాలే చెత్తకు అంకితమైపోయాయి.



మనీలాలోని మురికివాడల్లో అంటరాని వారుగా ఆ విధంగా తమ జీవనాన్ని కొనసాగిస్తున్న పేదలు 25 వేలమంది వున్నారట

20 మీటర్ల ఎత్తున వున్న 'స్మోకీ' పర్వత ప్రాంతంలోని మురికివాడల్లో వీరు తమ జీవితాలను వెళ్లబుచ్చుతున్నారు ఈ ప్రాంతంలో మామూలుగానే నమ్మశక్యంగాని దుర్గంధం తాండవిస్తుంటుందట దీనికి తోడుగా నగరంలో వున్న చెత్తా చెదారాన్ని ప్రభుత్వ ట్రక్కులు మోసుకొచ్చి అక్కడ వదిలి వెళ్తుంటాయి ఈ చెత్తకోసం అక్కడ నివసిస్తున్నవారు పెద్ద పెద్ద బుట్టల్ని తీసుకొచ్చి సిద్ధంగా వుంటారు ట్రక్కులోంచి క్రిందపడటం ఆలస్యం ఆ చెత్తలో పనికొచ్చేవేమైనా వుంటే ఏరుకోవటం వాటిని అమ్మి సొమ్ము చేసుకోవటం ఈ విధంగా వారు ప్లాస్టిక్ సంచులు, డబ్బాలు, పగిలిపోయిన సీసాలు వంటి వస్తువులను దుర్గంధాన్ని కూడా లెక్కచేయకుండా ప్రోగుచేసుకుంటుంటారు ఎండనక, వాననక వారు ఈ కార్యక్రమంలో ఆ సుగంధ పరిమళాన్ని ? ఆస్వాదిస్తూ నిమగ్నులవుతున్నారు ట్రక్కు రాగానే ఏవిధంగా వారు ఎగబడుతున్నారో ఫొటోలో చూడండి! దీన్నిబట్టి ఆ చెత్త వీళ్లకి ఎంత ప్రయోజనం చేకూరుస్తోందో విదితమవుతోంది కదూ!

1954లో ఈ పర్వత ప్రాంతాన్ని మత్స్యకారుల గ్రామంగా పిలిచేవారట అక్కడి నీరు కలుషితం కావటంతోను, చెత్త విక్షేపాలు ఎక్కువ కావటంతోను తమకు అందుబాటులో వున్న వనరులకోసం ఎగబడటం ప్రారంభించారు

ఒకప్పుడు సముద్రంలో చేపల కోసం గాలించే వీరు యిప్పుడు తమ బ్రతుకులు వెళ్లబుచ్చుకోవటం కోసం చెత్తా చెదారాన్ని గాలించాల్సిన అవసరం ఏర్పడింది

పనులు దొరకని కొంతమంది వ్యవసాయ కూలీలు కూడా వీరికి తోడయ్యారట ఆ ధంగా ఈ ప్రాంతంలో "చెత్త" మనుషులు పెరిగిపోయారు

ప్రస్తుతం యిప్పుడు అక్కడ నివసిస్తున్న వారిలో చాలామంది ఆ ప్రాంతంలోనే పుట్టి, అక్కడే పెరిగి, పెళ్లిళ్లయినవాళ్లేట మరి వారి మరణం కూడా యిక్కడే అది ఈ దుర్గంధభరిత వాతావరణంలో సంభవిస్తుంద లంలో ఆశ్చర్యం ఏముంది?

రఫరా వంటి ప్రాథమిక సౌకర్యాలు కల్పించవలసిందిగా ప్రభుత్వంతో చర్చలు కూడా ప్రారంభించారట ఈ చర్చల ఫలితం మళ్లీ వారిని ఆ ప్రాంతంనుంచి ఖాళీ చేయించే ప్రయత్నమే తప్ప ఎలాంటి సవ్యమైన సమాధానం రాలేదు

అయినప్పటికీ వీరు కలిసికట్టుగా వుండి

మ్నాయ ఏర్పాట్లు చేయటానికి తగిన ప్రణాళికను రూపొందించలేకపోయారు దానికి బదులుగా వారి జీవన భృతిని (చెత్తను) తొలగించే ప్రయత్నం చేస్తున్నారట మార్చిలో ఆ ప్రణాళిక 'కార్యరూపం ధరించవలసి వుండగా



ఈ పర్వత ప్రాంతాన్ని ఫిలిప్పైన్స్ ప్రభుత్వం పూర్తిగా విస్మరించటమే కాకుండా వలస వస్తున్నవారి సమస్యలను పట్టించుకోవటం లేదటకూడా మంచి చేయకపోగా వారిని అక్కడినుంచి పంపివేసేందుకు అనేకమార్లు ప్రయత్నించిందట

1982లో ఒకసారి యిక్కడి మురికివాడల్ని ఖాళీ చేయించి అక్కడ వున్నవారిని వేరేచోటుకి తరలించారట కాని ఏ సౌకర్యాలు లేని ప్రాంతంలో మనలేక తిరిగివాళ్లు యథాస్థానానికి వచ్చేశారు

వచ్చినవాళ్లు సవ్యంగా వున్నారంటే అదీ లేదు సంఘాలను ఏర్పాటు చేసుకొని, నాయకుల్ని ఎన్నుకొని వైద్య, విద్య, నీటిస

ప్రభుత్వం నుంచి ఎదురయ్యే ప్రతి చర్యను ఎదుర్కొంటున్నారట

ఫిలిప్పైన్స్ అధ్యక్షురాలు కొరిజాన్ అక్వినోకు వ్యతిరేకంగా బయలుదేరిన ఉద్యమంలో పాల్గొన్న తిరుగుబాటుదారులపై ప్రభుత్వ దాడులు తీవ్రతరం కావటం, ఆ దాడులలో భాగంగా ఈ 'స్మోకీ' పర్వత ప్రాంతం తీవ్రంగా గురికావటం జరిగింది. ఆ దాడులకు భయపడి కొంతమంది అక్కడినుంచి వెళ్లిపోయారట

చెత్తాచెదారాన్ని పారవేసే విధానానికి సంబంధించి ఒక తాజా ప్రణాళికను మనీలా మేయరు మెల్ లోపెజ్ జనర్ రూపొందించారట కాని ఈ "చెత్త" మనుషులకు ప్రత్యా

యిప్పటివరకు ఏవిధమైన చర్య తీసుకోలేదు సరికదా ట్రక్కులు మాత్రం చెత్తను నిర్విరామంగా విసర్జించి వెళ్తునే వున్నాయి

మరి అంటరానివారుగా పరిగణింపబడుతున్న ఈ "చెత్త" మనుషులు "కొత్త" జీవితాలను ఎప్పుడు ప్రారంభిస్తారో ? ! వారికి ప్రభుత్వం ఏవిధంగా సహకరిస్తుందో వేచి చూడాల్సిందే !

- తిలక్

# ఆశ్రమం - ఆశ్రయం

కొండముది రుక్మిణీదేవి

MISSING!



తలుపు దబ-దబా బాదిన చప్పుడైంది. చదువుతున్న ఉత్తరాన్ని పక్కనపెట్టి, వెళ్లి తలుపు తీశాడు ఆనందరావు.

ఎదురుగా కొత్త వ్యక్తి. ఒకచేతిలో బట్టలసంచి, మరొక చేతిలో పుస్తకాల కట్ట, చంకలో దిండు.

"ఎవరు కావాలండీ?!" అడిగాడు ఆనందరావు.

"నన్ను లోపలకు రానివ్వండి. తరువాత మాట్లాడుకుందాం !"

"ఎవరో ఏమిటో చెప్పకుండా...?" సందేహించాడు ఆనందరావు.

"చెబుతాగా ! చెప్పటానికేగా వచ్చాను. ముందు ఈ బరువు దించుకోనివ్వండి. అబ్బ ! కాసిని చల్లని మంచినీళ్లు తాగి ప్రాణం నిలుపుకోవాలి" అంటూ అడుగు లోపలికి పెట్టి, చేతిలో వున్న సామాను గోడవారగా దించాడు.

ఆ చర్యతో అవాక్కయిన ఆనందరావు, తన వయసులోనే వున్న ఆ వ్యక్తిని ఏమీ అనలేక, తనే వెళ్లి కూజాలో వున్న మంచినీళ్లు గాజుగ్లాసులోకి వంచి తీసుకొచ్చి ఇచ్చాడు. ఆ గ్లాసుడు నీళ్లు గడగడ తాగి, "అన్నదాతా సుఖీభవ" అన్నారు గాని, "నీళ్లదాతా సుఖీభవ" అంటాను నేను. మీరేమంటారు ?

"అబ్బే ! ఏమంటాను ?" ఆ మనిషి కలుపుగోలుతనానికి ఆశ్చర్యపోతూ నసిగాడు ఆనందరావు.

"అమ్మయ్య ! ఇహ ఇప్పుడు మీరా మంచంమీద కూర్చోండి. నేను ఈ కుర్చీలో కూర్చుంటాను.

ఇప్పుడు టైం రాత్రి పది గంటలు దాటింది. నేను చెప్పేది వినే ఓపిక మీకుందా ?"

"చెప్పండి !" అన్నట్లు ఆయనవంక చూశాడు ఆనందరావు.



"నాపేరు బ్రహ్మానందం. నాది అయితానగరం. నేను రిటైర్డు టీచర్ని. ఇద్దరు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు నా సంతానం. ఇహ ఇల్లు - ఇల్లాలు అంటారా ? ఇల్లు కట్టలేకపోయాను, ఇల్లాల్ని పోగొట్టుకున్నాను !"

"ఓహో ! నాలాంటి కేసేనన్నమాట" మనసులో అనుకున్నాడు ఆనందరావు.

"చూడండి మీరేదో ఆలోచిస్తున్నట్లున్నారు. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం నా ఉద్దేశం కాదు. ఈ తలగడా వేసుకుని, దుప్పటి పరుచుకుని నేను పడుకుంటాను. మీ మంచంమీద మీరు హాయిగా, సుఖంగా నిద్రపొండి ! గుడ్ నైట్ !" అంటూ వెళ్లి కిలా పడుకొని, దుప్పటి కప్పేసుకున్నాడు బ్రహ్మానందం.

ఆనందరావుకు అతణ్ణి ఎలా వదిలించుకోవాలో అర్థం కాలేదు. పైగా ఇంత రాత్రి వేళ ఇలా వచ్చాడంటే ఆఫీస్ ఫార్మాలిటీస్ పూర్తిచేసి ఉండడు. తెల్లవారి వార్డెన్‌కి ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

బ్రహ్మానందం దుప్పటి పక్కకు తప్పించి "ఇంతకీ మీ పేరు ?" అడిగాడు.

"ఆనందరావు !" అప్రయత్నంగా చెప్పేశాడు.

"మీరు నాకొక్క సహాయం చెయ్యాలి. నేను ఆఫీసులో అప్లికేషన్ పూర్తిచేసి డబ్బు కట్టలేదు. రేపు ఆ ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేస్తాను. ఈలోగా ఏదైనా ఎంక్వయిరీ వస్తే మీ అన్ననో, తమ్ముణ్ణనో చెప్పండి" అంటూ మళ్లీ దుప్పటి కప్పుకున్నాడు బ్రహ్మానందం.

ఆయన వింత మనస్తత్వానికి ఆశ్చర్యపోతూ, లైటార్పి మంచంమీద వాలాడు ఆనందరావు.

ఇక్కడ ఆ వృద్ధాశ్రమాన్ని గురించి కొంచెం తెలుసుకోవాలి.

దాన్ని ఒక విదేశీయుడు స్థాపించాడు. ఊరికి దూరంగా, ప్రకృతి అందాలకు దగ్గరగా అంటే ఒకవైపు తామరకొలను, మరొకవైపు మామిడి తోట, ఇంకొకవైపు ఆకాశాన్నంటే పర్వతపంక్తులు, నాలుగోవైపు నవనవలాడే వరిచేలు. వీటిమధ్య ఆరంతస్థుల భవనం. అందులోనే ఒకవైపు స్త్రీలకు కేటాయించారు. అయితే స్త్రీలకు కేటాయించిన గదులు తరచూ ఖాళీ అవుతూనే ఉంటాయ్ ! క్రిందవరస ఆఫీసు, వంటగదులు, అతిధుల కోసం పెద్ద హాలు. అక్కడ పనిచేసేవాళ్లందరూ అక్కడే ఉంటారు.

రెండోఅంతస్థు మొదటి తరగతి వాళ్లకు కేటాయించారు. అంటే తమకున్న ఆస్తిపాస్తుల్ని ఆశ్రమానికే విల్లు వ్రాసి, ఆశ్రమ అభివృద్ధికి, తద్వారా మానసిక ఆనందానికి పాటుపడే వాళ్ల కోసం. ఈ మొదటి తరగతి ఆశ్రమ వాసులకు ఒక్కొక్కరికి ఒక్కోగది కేటాయిస్తారు. అందులో ఎటాచ్డ్ బాత్, ఒక సీలింగ్ ఫాన్, ఒక మంచం, పరుపు, పోర్టబుల్ టీవీ, చిన్నసైజు ఎయిర్‌కూలర్ ఉంటాయి. వాళ్లు ఒక అతిధిని రెండు రోజులు తమతో ఉంచుకోవచ్చు. మిగిలిన అంతస్థుల్లో వాళ్ల వాళ్ల ఆర్థిక అసమానతల్ని బట్టి సౌకర్యాలుంటాయి. అన్ని అంతస్థులకు లిఫ్టు ఉండటంతో ఎవరికీ పెద్దగా ఇబ్బంది ఉండదు. అయితే ముఖ్యమైన షరతులు ఏమిటంటే తమకు వచ్చే ఆదాయంలో పదిశాతం తప్పనిసరిగా ఆ ఆశ్రమానికి ఇవ్వాలి. ఆ తరువాత స్వచ్ఛందంగా ఎవరి ఇష్టం వచ్చింది వాళ్లు ఇవ్వవచ్చు.

తెల్లవారి ఆనందరావు లేచేసరికి బ్రహ్మానందం తన కాలకృత్యాలు తీర్చుకుని పేపరు చదువుతున్నాడు. ఆయన కళ్లు తెరవటం చూసి, ఆరోజు పేపర్లో వచ్చిన విశేషాలు గబగబా చెప్పి, "దేశం నాశనం అయిపోతున్నదండీ ! పిల్లలు శ్రద్ధగా చదవరు, పెద్దవాళ్లు, వృద్ధుల్ని గౌరవించరు, ఉద్యోగులు తమపన్లు సరిగ్గా చెయ్యరు. ఆఖరికి తద్దినం బ్రాహ్మలు కూడా సరిగ్గా మంత్రాలు చెప్పటం మానేశారంటే నమ్మండి" అన్నాడు బ్రహ్మానందం.

ఆయన వాక్ప్రవాహానికి ఆనందపడ్డా, అనవసరపు మాటలకు మొహం చిట్లించుకుని బాత్‌రూం వైపు నడిచాడు.

ఆనందరావు స్నానాదికాలు పూర్తిచేసుకు వచ్చేసరికి బ్రహ్మానందం అక్కడ లేడు. "బయటకు వెళ్లి ఉంటాల్లే" అనుకుని తన దినచర్యలో మునిగిపోయాడు. ఎండ మొహం మీద పడటంతో కిటికీ కర్టెన్ వేసొద్దామని వెళ్లిన ఆనందరావుకి దూరంగా నీరుకావి పంచెతో అటుతిరిగి పూలుకోస్తున్న మనిషి కనపడేసరికి "ఎవరబ్బా !" అని క్షణం ఆలోచించాడు. వెంటనే గుర్తొచ్చింది. ఆ మనిషి బ్రహ్మానందమేనని.

"అయ్యో! పూలుకోస్తున్నాడు-తోటమాలి ఏమన్నా అంటాడేమో ?" ఇక్కడ ఎంత ప్రశాంతంగా వుంటుందో, అంత కఠినంగా వుంటాయి కొన్ని షరతులు. అందులో "పూలుకొయ్యకూడదు" అనేది ఒకటి. విదేశీయుడైన ఆ యజమాని ప్రకృతి ఆరాధకుడు. అందులోనూ పువ్వులన్నా, (బోసి)నవ్వులన్నా, మరీ ఇష్టం. అందుకే ఏ చెట్టుమీదా చెయ్యి వెయ్యనివ్వడు, ఏ మనిషి మీదా ఈగను కూడా వాలనివ్వడు.

ఆనందరావుకి తన మనస్తత్వంమీద తనకే నవ్వొచ్చింది. కొన్నిగంటల పరిచయంలోనే ఆయన మీద తనకెందుకీ జాలి ? ఆయన్ని వాళ్లేమన్నా అంటే తనకెందుకు బాధ ? అంతలోనే తన గతం గుర్తుకొచ్చింది.

ఒక పనివాడికోసం తను కన్నబిడ్డతో మాట మాట పెరిగి తనిక్కడకు వచ్చేశాడు. అయినా అదేమంత పెద్ద విషయమని ! వాడి పట్టుదలే వాడిదిగాని !

"అష్టరాల్ ఒక నౌకరు కోసం ఇంతపెద్ద ఇంట్లో నువ్వొక్కడివీ వుండొద్దు నాన్నా, మా దగ్గరకొచ్చెయ్!" అన్నాడు తన కొడుకు.

అక్కడేవున్న ముత్యాలు "బాబయ్యా ! నాకన్యాయం చెయ్యకండి, ఈ మట్టితప్ప నాకింకేటీతెల్దు. ఈ శరీరం-ఈ గాలి, నీరుతో పెరిగింది. మీ ఉప్పుతిన్న యిశ్వాసం నన్ను నిలుపుకోనివ్వండి. మిమ్మల్ని మోసిన ఈ భుజాలు ఈడనే మట్టికానివ్వండి" అంటూ

## విద్యార్థులలో అశాంతి ఎందుకు?

క్లాసులో లెసన్ వినాలనుకున్నా అల్లరి కుర్రాళ్ల బారినపడి వినలేకపోవటం, చక్కగా చెప్పే ఉపాధ్యాయులు కరువవటం, ఎగ్జామ్స్‌కి బాగా ప్రిపేర్ అయితే... పేపర్ అవుట్ కావటం, క్లాసు తెచ్చుకొని కూడా డొనేషన్ కడితేనేకాని కావలసిన చదువు చదవలేకపోవటం, ఇంటర్వ్యూలో మెరిట్‌కి వేల్యూ ఇవ్వకపోవటం, పిచ్చి వాళ్లలా ఎదురు చూసినా ఉద్యోగం రాకపోవటం, ఇవే...ఇవే నేటి విద్యార్థులలో అశాంతికి ముఖ్యాతిముఖ్యమైన కారణాలు.

వంకధార మణిమాల,
కె. కోటపాడు.

కాళ్లు పట్టుకున్నాడు.

ఆనందరావు మనసు ద్రవించింది. ముత్యాలుకు ఈ ఇంటితో సంబంధం ఈనాటిదికాదు. అతని తాత, తన తాత దగ్గర పనికికుదిరాట్ట, అప్పటినుంచి ఆ కుటుంబం ఈ కుటుంబానికి సేవచేస్తూనేవుంది. కేవలం పని చేయటమేకాదు మనసు పొరల్లో ఏదో మమత, చెప్పలేని వాత్సల్యం, పైకి కనపడని అనురాగం. అందుకే.

"ముత్యాలు వున్నన్నాళ్లూ నేను ఇక్కడే వుంటాన్రా !" అని గట్టిగా చెప్పాడు కొడుకుతో.

"అయితే నాకంటే వాడే ఎక్కువా నీకు !?"

తన మౌనం అర్థాంగీకారంగా తీసుకుని వెంటనే ఆస్తిపంచి ఇవ్వమన్నాడు-ఆ ఆవేశంలో వాడి వాటా వాడికిచ్చి-ఇల్లు మాత్రం ముత్యాలు బ్రతికివున్నన్నాళ్లువుండి తదనంతరం కొడుక్కి చెందేట్టుగారాసి, తన వాటా పొలం, తోటలు, డబ్బు అన్నీ ఈ ఆశ్రమానికి రాసిచ్చి తనిక్కడికి వచ్చేశాడు.

"ఏంచేస్తున్నారు ? ఇక్కడ మెయింటెనెన్స్ చాలాబాగుందండీ ! ఎవరిపని వాళ్లు శ్రద్ధగా చేస్తున్నారు. నేను అలా ఓ రౌండువేసి, ఆదెమ్మగారు పూజ చేసుకుంటుంటే కాసిని పూలు కోసిచ్చాను. రెండో అంతస్తు మూడోగదిలో రమణయ్యగారు మూలుగుతుంటే కాసేపు మనిషి సాయంగా కూచున్నాను. ఇంతలో ఆఫీసు తెరిచారు. అప్లికేషను పూర్తిచేసి డబ్బు కట్టేశాను. అయిదో అంతస్తు మొదటి గదిలో ఒక్కరేవున్నార్ట, నన్నందులో జాయిన్ కమ్మన్నారు. స్టోర్‌రూం చూశానండీ ! ఎంత పెద్దదో ! సంవత్సరానికి సరిపడా సామగ్రి అంతా ఒక్కసారే కొంటారనుకుంటాను. ఈ గదిలో ఒక్కరూ ఏంచేస్తున్నారు ?" అంటూ అడక్కుండానే సంగతులన్నీ చెప్పాడు బ్రహ్మానందం.

ఆనందరావు గోడగడియారం వైపు చూశాడు-పన్నెండు కావస్తున్నది.

"అయిపోతున్నదండీ ! వంట అయి క్యారేజీలు సర్దుతున్నారు. ఇందాకే చెప్పాగా, ఎవరిపన్లు వాళ్లు మిషన్లలాగా చేస్తున్నారంటే నమ్మండి రెండోతరగతి వాళ్లందరికి కామన్ హాల్లో భోజనాలు పెడతారటగదండీ ! నేను వెళ్తున్నాను నా సామాను నా గదిలోపడేసి వెళ్లి హాల్లో కూర్చుం టాను. నేను వస్తూనేవుంటాను, మీకు బోరుకొడితే పిలవండి. అయినా మనందరం ఒకటండీ ! ఇక్కడ వున్న వాళ్లం, వుండాల్సినవాళ్లం" అంటూ వంగి తన సంచి తీసుకుంటున్న బ్రహ్మానందం కళ్ల నుంచి జారి రెండు కన్నీటిబొట్లు నేలమీద పడ్డయ్ ఆ నిశ్శబ్ద వాతావరణంలో కొద్దిగా చప్పుడుచేస్తూ. ఆ సంఘటన ఆనందరావుని దాటిపోలేదు.

వెనక్కి తిరిగిచూడకుండా తన సామాను చేతబట్టుకుని మెట్లవైపు నడిచాడు బ్రహ్మానందం. ఆయనకెందుకో లిఫ్టు ఎక్కబుద్ధికాలేదు. జీవితంలోలాగానే ఒక్కొక్క మెట్టు ఎక్కి పైకి వెళ్లాలనిపించింది. ఆ అడుగుల సవ్వడి అనంత జీవిత యాత్రలో శ్రుతి పక్వంగానూ, లయబద్ధంగానూ వినిపించసాగింది. మరెందుకు మధ్యలో తనకీ అవస్థలు ? అవమానాలు? పిల్లలకు తనను చూస్తే ఎక్కడ చదువుకోమని కూర్చోబెడతానోనని భయం. కొడుకులకు నీతిగా బ్రతకమని చెబుతాడోనని అసహ్యం, కోడళ్లకు పొదుపుగా సంసారాలు చక్కదిద్దుకోమని సలహా ఇస్తాడని కోపం. అందుకే అందరూ తప్పించుకుని తిరుగుతారు. మనస్ఫూర్తిగా ఒక్కరూ మాట్లాడరు తనతో. ఆ ఒంటరితనాన్ని భరించలేక ఇక్కడికి వచ్చాడతను. ఇదోకొత్తజీవితం, ప్చ్....అనుకుంటు తనకు కేటాయించిన గదిలోకి వెళ్లాడు.

ఆరునెల్లు ఆనందంగా బ్రహ్మానందంగా గడిచిపోయింది ఆయనకు. ఆ ఆశ్రమంలో ఎప్పుడు ఎవరికి ఏ అవసరంవచ్చినా, ఏ సహాయం కావాలన్నా, బ్రహ్మానందాన్నే పిలుస్తున్నారు "ఏమండీ! బ్రహ్మానందంగారూ! ఏమయ్యా! బ్రహ్మానందం ఒరే ! బ్రహ్మం" ఇలాంటి పిలుపులతో క్షణంతీరిక వుండటం లేదు. ముఖ్యంగా ప్రతిరోజు సాయంకాలం నాలుగు గంటల నుంచి ఆరుగంటలదాకా ఆయనచేసే ప్రవచనం, భారత, భాగవత, రామాయణాలు, అందర్నీ ఆకట్టుకున్నయ్ ! మొదట ఒకరిద్దరుగా మొదలైన ఆ కార్యక్రమం ఇప్పుడు అక్కడున్న సభ్యులకే కాక, పనిపాటలు చేసుకునేవాళ్లందరికి అదో దివ్యానుభూతి అవుతున్నది. విశేషమేమిటంటే ఆ ఆశ్రమ యజమాని అయిన విదేశీయుడ్ని సహితం ఆకట్టుకున్నది ఆయన కంఠస్వరం. భావయుక్తంగా పద్యాలు చదివే ఆ తీరు.



ఉన్నట్టుండి ఒకనాడు అందరి దగ్గరా శెలవుతీసుకుంటున్నాడు బ్రహ్మానందం.

ఆయన ఎందుకు వెళ్లిపోతున్నాడో ఎవరికీ అర్థంకావటంలేదు. అడిగిన వాళ్లకు, అడగని వాళ్లకు-"నన్ను చూడటానికి ఎప్పుడన్నా వీలయితేరండి, నా పేరు బ్రహ్మానందం. మా వూరు అయితానగరం, గుర్తుంచుకుంటారుగా, శెలవు! " అంటూ నమస్కారం చేస్తున్నాడు. ఆయన మాట్లాడుతున్న తీరు అందరికీ కన్నీళ్లు తెప్పిస్తున్నది.

బ్రహ్మానందం లేని ఆశ్రమం నిద్రపోతున్న కుగ్రామంలా వుంది. ఎవరిపన్లు వాళ్లు చేసుకుంటున్నా ఏదోవెల్తి, ఎవరికోసమో ఎదురుచూపు అప్పుడే అక్కడున్న అందరికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. "తామేవెళ్లి ఆయన్ను ఒకసారి చూసొస్తే!?" అవును చూడాలి. చూసితీరాలి. ఒకరిద్వారా ఒకరు పనివాళ్లు, వంటవాళ్లు ఆఖరికి వాచ్‌మెన్ కూడా బయలుదేరటం చూసి, "వాట్‌హాపెన్డ్? వేరార్ యు గోయింగ్?!" ఆశ్చర్యంగానూ ఆందోళనగానూ అడిగాడు విదేశీ యజమాని. మేమందరం బ్రహ్మానందాన్ని చూడటానికి వెళ్తున్నాం, ముక్తకంఠంతో అన్నారంతా.

"పూర్ ఫెలో! అయాం ఆల్సోకమింగ్ టు సీద పర్సన్" అంటూ అడుగు ముందుకు వేశాడు. అక్కడున్న అందరూ ఆయన్ను అనుసరించారు.

* * * *

"ఇంట్లోనుంచి చెప్పాపెట్టకుండా వెళ్లి మా పరువుతీశావ్! ఇంట్లో చేస్తున్న భాగోతం చాలక దేశమంతా కొడుకులు సరిగాచూడటంలేదని చాటింపు వెయ్యదల్చుకున్నావా? మమ్మల్నేమీచెయ్యలేవు. నీ మాట వినేవాళ్లెవరూ లేరిక్కడ. ఇంతతిని ఇంట్లోపడుంటావనుకుంటే అదీచెయ్యలేవా?"కోపంగా పెద్దగా అరుస్తున్నాడు కొడుకు.

"అసలు మిమ్మల్ని అనాలి! పీడావిరగడైపోయిందనుకుంటుంటే మళ్లా పేపర్లో వేయించి, అదీఫొటోతోసహా ! అడ్రసు తెప్పించుకువెళ్లి మరీతీసుకొచ్చారు. అనుభవించండి. ఆయన మూలంగా మనకేమీలాభం లేకపోతేమానె, ఈ పస, అప్రతిష్ఠ నేను భరించలేను." కోడలు ఉవాచ.

అక్కడ ఏ మాటకూ బ్రహ్మానందం నుంచి జవాబులేదు.

అప్పుడే అక్కడకు వచ్చిన ఆశ్రమవాసులు అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. తరువాత అందరూ కలిసి విదేశీయుడి వంక చూశారు.

ఆ చూపులో ఆయన ఆచూకీ తెలియజేసి తప్పుచేశామన్న భావం వుంది. దాన్ని గ్రహించిన ఆ యజమాని తలవంచుకున్నాడు■

# క్షయ రోగంతో పోరాడండి

1. రెండు వారాలకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు. ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు.

2. మీ సమీప మందలి ప్రాదమిక ఆరోగ్య కేంద్రం. డిస్పెన్సరీ లేక టి బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి.




3. నిర్ధారిత సమయం వరకు క్రమంగా డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4 చికిత్స కంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బి సి జి టీకాలు వేయించండి




సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి జి హెచ్ ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు న్యూ ఢిల్లీ 110002

davp 89/1023 TEL



సీరియల్

# సూపర్ హీరో



మన్నెం శారద

(గత సంచిక తరువాయి)

"దమయంతెవరు విజయ్!"

తల్లి ప్రశ్నకు ఫోంచేస్తున్న వాడల్లా తలెత్తి "ఎందుకమ్మా?" అనడిగేడు

"నేనడిగిన ప్రశ్నకి తిరిగి ప్రశ్నే జవాబా?"

"ఆమె నా సహ నటి మంచి మనిషి చాల బాగా నటిస్తుంది!"

"అయితే నీ రికమండేషన్ దేనికి?"

"ఓహో! పి. ఏ నీకు సంగతి చెప్పినట్టున్నాడు"

"లేదు నేనంత చౌకబారుగా విని అడగను"

"మరి?" ఆశ్చర్యంగా తల్లి వైపు చూశాడు విజయేంద్ర

"ప్రొద్దుటే ఆ అమ్మాయి ఫోను చేసి చంద్రకాంత్‌గారి పిక్చర్లో రోల్ ఇప్పించినందుకు థాంక్స్ చెప్పింది. నువ్వు లేవలేదుగా అందుకని నాతో మాట్లాడింది"

తల్లి మాట వినగానే విజయేంద్ర కళ్ళు మెరిసేయి సంతోషంతో.

'చంద్రకాంత్‌గారు నా మాట విన్నారన్న మాట! థాంక్స్ చెప్పాలి!"

"అది బానే వుంది. కాని నువ్వొక అమ్మాయిని పర్టిక్యులర్‌గా రికమండ్ చేస్తే నీ గురించి చెడు ప్రచారం చేసే అవకాశముందేమో ఆలోచించేవా?' అంది నిఖిల సాలోచనగా కొడుకు వైపు చూస్తూ.

"తప్పకుండా జరుగుతుంది. కాని దమయంతిలాంటి ఆర్టిస్టులకి సహాయం చేయడంలోని ఔచిత్యం నువ్వు తెలుసుకుంటే నువ్వూ కాదనవు" అన్నాడు విజయేంద్ర దమయంతి వివరాలన్నీ చెబుతూ.

"మంచి పని చేసేవ్! సరే నిన్న వచ్చిన బఫూనెవరు? మీరు సర్కస్ సీన్స్ ఏమన్నా తీస్తున్నారా?"

తల్లి ప్రశ్నకి నవ్వి తనకి కరుణాకర్‌కి జరిగిన సంభాషణ చెప్పాడు విజయ్

"ఇస్తే దానం యివ్వు కాని మరి అంతకంటే సంబంధం అతనితో పెట్టుకుంటే సమస్యలు వుత్పన్నమవుతాయని నా అనుమానం. అతని వాటం నాకు నచ్చలేదు" అంది నిఖిల నిష్కర్షగా

"వాడు పేకముక్కల్లో జోకర్‌లాంటివాడు వాణ్ణి ఎంజాయ్ చెయ్యడమే గాని పట్టించుకోవడం దండుగ వీణ్ణి వీడిగా నేను గౌరవించడం లేదు. ఇతని తండ్రి జ్యోతిష్యం ఫలించిందనీ కాదు అతను పెద్దమనిషి విద్యాధికుడు చూడగానే గౌరవభావం ఏర్పడుతుంది. వీడు సరిగ్గా సెటిలవ్వాలన్నదే అతని ఆకాంక్ష. అందుకే సహాయం చెయ్యాలని నువ్వేమంటావమ్మా!" అని ఎంతో వినయంగా అడిగేడు విజయేంద్ర.

అతనలా చిన్న పిల్లవాడిలా అడగటం నిఖిలకి నవ్వు తెప్పించింది. కొడుకు అయిదేళ్ళ పసివాడులా కన్పించేడామె కళ్ళకు

**ఇంతవరకూ సాగిన కథ-6 :** కాంట్రాక్టరు గోపాలరావుతోవివాహమై మనస్పర్థలు కారణంగా విడిపోయిన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి అనతి కాలంలోనే, బిజీ హీరో అయిన తన కొడుకు విజయేంద్ర విజయాలను చూసి మురిసిపోతుంటుంది. పోలీస్ కమీషనర్ కూతురు పీయూషను విజయేంద్ర ప్రేమిస్తాడు. కాని ఆయన మరిచిపొమ్మని హెచ్చరిస్తాడు. కుటుంబ పోషణా భారం మీదపడిన దమయంతి కోరికను గణేశన్‌కి వివరిస్తాడు విజయేంద్ర. చిన్ననాటి స్నేహితుడు కరుణాకర్ వీడియో స్టూడియో పెట్టుకునేందుకు పెట్టుబడి పెట్టమంటాడు.

వెంటనే అతని క్రాఫ్ నిమురుతూ "ఇవ్వు. ఇందులో కాదనేదేముంది?" అంది చిన్నగా నవ్వి.

ఆ మర్నాడే కరుణాకర్‌ని పిలిపించి చెక్ ఇచ్చేడు విజయేంద్ర

"నేను నమ్మలేకపోతున్నాను బాస్! ఈ డబ్బు త్వరలో నే నీకు పువ్వుల్లో పెట్టి అప్పచెబుతాను" అన్నాడు కరుణాకర్

"నేను అప్పుగా ఇవ్వడంలేదు" అన్నాడు విజయేంద్ర

"నువ్వు గొప్పవాడివి కావొచ్చు! కాని ఇంత డబ్బు దానం పట్టేంత గొప్పవాణ్ణి మాత్రం నేను కాదు!" అన్నాడు కరుణాకర్

"నీ ఇష్టం!" అని వదిలేసేడు విజయేంద్ర

ఆ విధంగా కరుణాకర్ తరచుగా విజయేంద్రని కలుస్తూ తన స్నేహం పెంపొందించుకున్నాడు

నిఖిలేశ్వరి ఊహించినట్టుగానే కొన్ని ఎల్లో జర్నల్స్ విజయేంద్ర గురించి దమయంతి గురించి చెడుగా రాసేయి

అయితే వాటికి ఆ ఇద్దరూ చలించకపోవటంతో అవి తోకముడిచి ఊరుకున్నాయి

దమయంతి ఇప్పుడు బిజీ స్టారయిపోయింది. ఒక వారంలో వచ్చిన ఎడ్వాన్సులతోనే ఆమె ఇల్లు కొనుక్కుంది. చిన్న కారు, ఫోను అమరేయి

★ ★ ★ ★ ★

ప్లేన్ దిగిన పీయూషని రిసీవ్ చేసుకోవడానికి గాంధీ, సుందరమ్మలు ఎయిర్‌పోర్టుకి వెళ్ళేరు పీయూష మాత్రం విజయేంద్ర కోసం చుట్టూ చూసి నిరాశపడింది.

కూతురు అన్యమనస్కంగా వుండటం గమనిస్తూనే వున్నాడు గాంధీ

"ఎలా జరిగిందమ్మా నీ ట్రిప్!" అన్నాడు కూతురితో మాట కలుపుతూ

"బాగానే జరిగింది డేడీ! ఇక్కడంతా బాగానే ఉన్నారుగా!"

"ఆఁ! అమ్మా, నేను మిగతా అక్కయ్యలూ చివరికి నీ పెంపుడు కుక్క ప్లూటో కూడ క్షేమంగానే వున్నాయి!"

"అవును డేడీ, ఎవరెలా వున్నా ప్లూటో గురించి నాకు బెంగగా వుండేది అది సరిగ్గా అన్నం తిందా

డేడీ!'' అంది కారెక్కుతూ

కారు స్టార్టయింది.

"దానికీ నీ గురించే బెంగ! అందుకే దేన్నీ అతిగా ప్రేమించి దగ్గరగా చేరనివ్వకూడదు. తర్వాత వచ్చే సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది'' అన్నాడు గాంధీ

అతని అంతరంగమెరుగని పీయూష తండ్రి మాటలు పట్టించుకోలేదు ఆమె మనసంతా విజయేంద్ర చుట్టే తిరుగుతోంది

'సినిమా షూటింగుల్లో పడి తన సంగతి మరచిపోయేడా? ఆంటీ అదోలా మాట్లాడింది అంటే ఆవిడే తమ పెళ్ళిని ఇష్టపడటం లేదా? నో! ఆంటీ అలాంటిది కాదు తనని కన్న కూతురిలా ప్రేమించేది! బహుశ విజయ్ అవుట్‌డోర్ షూటింగ్‌లో వున్నాడేమో!' ఆమె ఆలోచనల్లో ఆమె వుండగానే కారుకి సడెన్ బ్రేక్ పడింది

'వాట్ హేపెండ్?''

"ఏదో షూటింగ్ జరుగుతోంది సర్!'' అన్నాడు డ్రైవర్

''అయితే మరో రోడ్డుకి తిప్పు!'' అన్నాడు గాంధీ.

''ఎందుకు సర్ మన కారని తెలిస్తే దారి వాళ్ళే ఇస్తారు''

''డ్రైవర్! అధికార దుర్వినియోగాన్ని నేను ఇష్టపడను. వాళ్ళు పర్మిషన్ తీసుకొనే షూటింగ్ జరుపుతున్నారు'' అతని మాట పూర్తయ్యే లోపునే పీయూష రివ్వున కారు దిగి జనంలోకి పరిగెత్తింది

ఈ ఆకస్మిక చర్యకి సుందరమ్మ, గాంధీలు నివ్వెరపోయేరు.

పీయూష జనాన్ని తోసుకొని ''హాయ్, విజయ్, ఎయిర్‌పోర్టుకి రాలేదెందుకని? నీకు నాకన్నా షూటింగ్సే ముఖ్యమా!'' అంటూ విజయేంద్ర దగ్గరకెళ్ళి అతని చేతులు గట్టిగా పట్టుకుంది.

విలన్‌తో రోడ్డు మీద వాగ్వ్యాద్దానికి దిగే సీన్‌లో నటిస్తున్న విజయేంద్ర పీయూషని అక్కడ చూసి సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయేడు

ఆమె అడ్డం రావడంతో డైరెక్టర్ నెత్తి బాదుకొంటూ సీన్ కట్ చెప్పేసేడు. షూటింగ్‌ని చూస్తున్న చాలమంది జనం మాత్రం ఆమె హీరోయిన్ అనుకొని అదంతా నటనే అని సంబరంగా చూస్తున్నారు

''నువ్వా పీయూ, ఎప్పుడొచ్చేవ్?'' అన్నాడు ఆనందంగా

''చాల్లే గొప్పగా అడుగుతున్నావు నేనొస్తానని నీకు తెలియదా? ఎయిర్‌పోర్ట్‌లో నీ కోసం చూసి నువ్వు రాక ఎంత డిజప్పాయింటయ్యేనో తెలుసా! డేడీ కారులో వున్నారు!'' అంది మూతి ముడిచి.

''మై గుడ్‌నెస్! నువ్విప్పుడు షూటింగ్ చూసి ఝూమ్మని కార్లోంచి లంఘించి దూకేసేవన్నమాట! మీ డేడీ ఇంటికి తీసుకెళ్ళి చీపురు కట్టతో దిష్టి తీస్తాడు! వెళ్ళు!'' అన్నాడు మెల్లిగా గొంతు తగ్గించి



అప్పుడు గుర్తొచ్చి "వస్తాను. బై. సాయింత్రం ఇంటికొస్తాను" అంటూ పరిగెత్తింది పీయూష.

ఆమె హీరోయిన్ అనుకొని ఆటోగ్రాఫ్ కోసం, ఆమెను దగ్గరగా చూడాలని కొంతమంది ఆమె వెంట కారుదాక వెళ్ళేరు

"రాధరా రాధ!"

"కాదురా భానుప్రియ"

"నీ మొహం ఎంత తెల్లగా వుందో చూడు! ఈ పిల్ల కొత్త పిల్ల గిరిజ!"

"ఆ పిల్లనే అడిగితే సరి!"

"ఏమండీ, మీ పేరేంటి? గిరిజ కదూ!"

"నేను సినీ నటిని కాదు"

"అబద్ధం చెప్పకండి!"

జనాన్ని పక్కకి తోస్తున్న కానిస్టేబుల్స్ కమిషనర్‌గారి కారు గుర్తుపట్టి ఎలర్టయిపోయి గబగబా జనాన్ని నెట్టివేయసాగారు.

పీయూష గబగబా వెళ్ళి కారెక్కి కూర్చుంది.

కరంచంద్‌గాంధీ మొహం కందగడ్డలా ఎర్రబడిపోయింది.

పీయూష కారెక్కగానే కారు కదిలిపోయింది.

ఇంటికెళ్ళగానే గాంధీ సీరియస్‌గా తన గదిలోకి వెళ్ళిపోయేడు. సుందరమ్మ భయంగా కూతురి వైపు చూసి "నువ్వు చేసిన పనేమన్నా బాగుందా! మీ నాన్నగారు మండిపడిపోతున్నారు ఏ యుద్ధం జరుగుతుందో తెలియటంలేదు" అంది బాధగా.

"నిజమే మమ్మీ, చాల రోజులకి విజయేంద్రని చూశానన్న సంతోషంతో అలా బిహేవ్ చేసేను. కావాలంటే డేడీకి సారీ చెబుతాను" -అంది నొచ్చుకుంటున్నట్టుగా పీయూష.

"ఏం సారీలో! మీ ఇద్దరి మద్యా నాకు సంకటంగా ఉంది ఆయనకి ఎప్పుడు ప్రేమ పుట్టుకొస్తుందో, ఎప్పుడు కోపం ముంచుకొస్తుందో తెలీదు ఆఖరి పిల్లవని నీకు బాగా గారం పెట్టి ఇప్పుడేమో హద్దు మీరుతున్నావని అదే పనిగా వాపోతున్నారు అయినా నీకా సినిమా కుర్రాడితో ఏం పని?' అంది కొంచెం నిష్ఠూరంగా సుందరమ్మ.

## సూపర్ హీరో

"ఏంటమ్మా, నువ్వు కూడ అలానే మాట్లాడతావు! అతనంటే ఎంత క్రేజ్ వుందో తెలుసా నాకు!" అంది పీయూష తల్లి భుజాల మీద చేతులేసి.

"అదంతా నాకు తెలీదు. మీ నాన్నగారికి జవాబు చెప్పుకో!" అంటూ లోనికెళ్ళిపోయింది సుందరమ్మ.

పీయూష భుజాలెగరేసి క్లిప్‌లో బిగించిన హెయిర్‌ని వదిలేసి "ఫ్లూటో! మై డార్లింగ్ వేరార్ యూ!" అంటూ మేడ మెట్ల మీద పరుగుపెట్టింది

★ ★ ★ ★ ★

ఆ రోజు ఆదివారం.

షూటింగ్స్ లేకపోవడంతో దమయంతి స్వయంగా వంట చేస్తోంది.

ఆమెకు టచప్ గర్ల్‌గా పనిచేస్తున్న కోకిల షోకేసుల్లో బొమ్మల్ని నీట్‌గా తుడిచి పెడుతోంది

దమయంతికిప్పుడు నిజంగా వంట చేయాల్సిన పనిలేదు కాని వంట ఆమెకు హాబీ! కూటి కోసమే కోటి విద్యలైనప్పుడు ఆ కూటి పని వంట వాళ్ళ మీద పడేసి వాళ్ళు ఎలా అండే అలా వండిన వంటని తినాల్సిన ఖర్మ దేనికన్నది ఆమె సిద్ధాంతం. వంట గదిని దగ్గరుండి ప్రత్యేకంగా కట్టించుకొంది వంటగదిలొంచి వచ్చే ఘుమఘుమలు ఇల్లంతా వ్యాపించి లాలాజలాన్ని ఊరిస్తున్నాయి

దమయంతి అంత ప్రత్యేకించి వంట చెయడానికి కారణం కూడ ఉంది ఆ రోజు ఆమె పుట్టిన రోజు విజయేంద్రని- అతని తల్లిని, గణేశన్‌గారిని భోజనానికి పిలిచింది తన పాక విద్యా ప్రావీణ్యాన్ని పూర్తిగా చూపించాలన్నది ఆమె తాపత్రయం

ఆమె ఏదో హిందీ పాట హమ్ చేసి పాడుతూ సాంబారు పెడుతూండగా కాలింగ్‌బెల్ మోగింది

కోకిల వెళ్ళి తలుపు తీసింది

ఎదురుగా రింగుల జుట్టుతో పచ్చగా, ఎత్తుగా ఉన్న యువకుడు నిలబడి "అమ్మగారున్నారా?" అనడిగేడు.

"ఉన్నారు" అంది కోకిల.

"ఒకసారి ఆమెను చూడాలి. పిలుస్తావా?"

కోకిల తలూపి వంట గదిలోకొచ్చి "మీ కోసమేనమ్మా" అంది.

"ఎవరైనా అభిమానా! ఇప్పుడు నా టైమంతా తినేస్తాడు. అసలే వంట కాలేదు. లేనని చెప్పు!" అంది దమయంతి నెమ్మదిగా.

"ఒక్కసారి వచ్చి వెళ్ళండి మేడమ్! నేను మీ టైము తినేయనులెండి ప్లీజ్!" అతను తన మాట విని చనువుగా పిలుస్తుంటే సిగ్గుపడి బయటకొచ్చింది దమయంతి.

"నమస్కారం నా పేరు సుధీర్" అన్నాడతను చేతులు జోడిస్తూ.

"నమస్కారం. కూర్చోండి "

"వద్దండి మీరు బిజీగా వున్నట్టున్నారు. మీ టైము తినేయకూడదుగా. నేను మీ అభిమానిని మీ సినిమాలంటే పడి ఛస్తాను ఇంకా బ్రతికేవున్నావుగా అని అడక్కండి ముందు ముందు ఇంకా మీ సినిమాలు చూడాలనే బ్రతికి వున్నాను. మిమ్మల్ని చూశాను సంతోషం. వస్తాను" అన్నాడతను వెనుతిరుగుతూ

"ఆగండి!" అంది దమయంతి కంగారుగా

"దేనికి మేడమ్?"

"కొంచెం కాఫీ తీసుకొని వెళ్ళురు గాని"

"నిజంగానే ఇస్తారా?"

"అంటే అబద్ధంగా కూడ ఇస్తుంటారా?" కొంటెగా అడిగింది దమయంతి

"ఇంతకి ముందే ఓ ప్రముఖ హీరోగారింటికి వెళ్ళేను ఆయన కోసం గంటన్నర కాపు కాస్తే ఆయన దర్శనమయ్యింది ఆయన కాఫీ, టీ, బోర్నవిటా, హార్లిక్స్ ఏం తాగుతారు అనడిగి చివరకు మంచినీళ్ళు కూడ ఇవ్వలేదు. మీరు కూడ అలానే. సారీ! కోప్పడకండి!" అన్నాడతను భయపడుతున్నట్టు బుజాలెగరేసి

దమయంతి గట్టిగా నవ్వి "కూర్చోండి వన్ మినిట్!" అంటూ లోనికెళ్ళింది

ఒక నిమిషం తర్వాత కోకిల ట్రేలో కాఫీ పట్టుకొచ్చి అతనికందించింది. ఆ వెనుక దమయంతి వచ్చి కూర్చుంది

కాఫీ తాగుతూ అతను "మీరే చేసేరా మేడమ్! చాల బాగుంది. మీలానే!" అన్నాడు

"ఈ మాటలు మాకు బాగా విని విని అలవాటయిపోయింది. థ్రిల్ లేదు" అంది.

"మరేం చెప్పమంటారు? ఆఁ ఈ మధ్య మీరున్న వాల్‌పోస్టరొకటి కష్టపడి సంపాదించి ఇంటి గోడకి సరదాగా అంటించుకున్నాను ఆ రాత్రి ఎవరో గిట్టనివాళ్ళు పేడకొట్టిపోయేరు నేను చాల బాధపడిపోయేను. రెండ్రోజుల తర్వాత పొయ్యి మండక అమ్మ ఆ ఎండిన పిడకలు తీసుకెళ్ళి పొయ్యి అంటించుకొని 'కొడితే కొట్టేరు గాని పొయ్యి బాగా మండిందిరా! సుద్దూ!' అంటె పొయ్యిలాగే

నేనూ మండిపోయేను ఇంతకీ మాది బాగా పల్లెటూరులెండి' అన్నాడు అతను నవ్వుతూ

బావుంది' అంటూ నవ్వింది దమయంతి

వస్తానండీ! ఆఁ! నేను సినిమాల్లో పనికొస్తానా అండీ!'

నటించాలనా?'

'అవునండి ఎప్పటికయినా మీ పక్కన హీరోగా నటించాలని ఆశ'

అల్బమ్ ఉందా? అడిగింది దమయంతి

ఆఁ! ఆ ఊహ రాగానే తీయించేసేను ఇంటికి మొన్నే పంటొచ్చిందిలెండి వెధవ ఫోటోలకి వేలు తగలెడ్తున్నానని మా నాయినమ్మ ఒకటే గోల' చూస్తారా?' అతను ఆల్బమ్ అందించేడు

దమయంతి పేజీలు తిప్పి ఫోటోలు సూపర్బ్‌గా వున్నాయి మీరు సినిమాకి పనికొస్తారు! అంది నమ్మకంగా

నిజంగానా?'

ప్రామిస్‌గా ఇంకాస్సేపుంటే మా ఇంటికి గణేశన్‌గారనే నిర్మాత విజయేంద్ర వస్తారు వాళ్ళకి చూపిస్తాను మీరు రేపు రండి అంది

అతని మొహం పుచ్చపువ్వులా విప్పారింది

'చాలా థాంక్సండి రేపొచ్చి కలుస్తాను అంటూ నమస్కరించి వెళ్ళిపోయేడు

అతనెళ్ళగానే కోకిల దమయంతి వైపు చూసి నా సంగతేం చేసేరు? అనడిగింది దీనంగా

దమయంతి వెంటనే జవాబు చెప్పలేనట్టుగా చూసింది

సినిమాల్లో నటించే విషయమేనా?'

'అవునమ్మగారూ! హీరోయిన్ కాకపోయినా చిన్న వేషమైనా ఏదో ఒకటి వేసి తెరమీద కనిపించకపోతే నా పరువు పోతుంది!

"వేషం వెయ్యకపోతె పరువు పోతుందా?' దమయంతి నవ్వుతూ వంట గదిలోకి నడిచింది

మీరలా నవ్వేసెయ్యొద్దు మా వూళ్ళో నేను లేచిపోయే ననుకొంటున్నారు ఒక వేషం వేస్తే గాని మా ఇంటి పరువు నిలవదు కాస్త గణేశన్‌గారికి నా సంగతి చెప్పండి

సరే నువ్వు ముందా టమోటో జ్యూస్ తయారు చెయ్యి అంటూ దమయంతి స్టౌమీద బాణలిపెట్టి వంకాయల్లో మసాలా కూరి నూనెలో వేయసాగింది

కోకిల ఉత్సాహంగా మిక్సీలో టమోటాలు ముక్కలుగా కోసి వేసి గిరగిరా తిప్పింది

వంట పూర్తవుతుండగా కాలింగ్‌బెల్ మోగింది దమయంతి గబగబా వెళ్ళి తలుపు తీసింది

ఎదురుగా విజయేంద్ర - నిఖిలేశ్వరి నిలబడి వున్నారు

"నమస్కారం రండి రండి అంటూ వాళ్ళని ఆహ్వానించింది దమయంతి ఆనందంగా

మీ రనవసరంగా చాల శ్రమ తీసుకుంటున్నట్టున్నారు అంది నిఖిలేశ్వరి నొచ్చుకుంటున్నట్టుగా

అదేంలేదు ఒకసారి ఎలాగైనా మిమ్మల్ని మా

# తారాపథానికి నిచ్చెనలు!

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నటి ఎలిజిబెత్ టెయిలర్ తన 13వ ఏటనే లక్స్‌సోప్ అడ్వర్టయిజ్‌మెంట్లలో పాల్గొని సంవత్సరానికి 30 000 డాలర్లు (సుమారు రు. 4 లక్షల 50 వేలు) సంపాదించసాగింది. ఆనాటి నుంచీ ఆమె పేరు ప్రఖ్యాతుల కోసంగాని, డబ్బుకోసం గాని ఏనాడూ ఇబ్బంది పడలేదు.

ఆమెకు 15వ ఏడు వచ్చేసరికి హాలీవుడ్ కాలమిస్టులు పేపర్లలో ఆమెను యావత్ప్రపంచంలోకెల్లా అందగత్తె" అని అభివర్ణించేవారు.

ఆమె జీవితంలో ఏనాడూ ధనం, పేరు ప్రఖ్యాతుల కోసం అర్రులు జాచలేదు. అవి తనకు లభించవేమోనని బాధపడలేదు. ప్రేమకోసం పరితపించిపోయేది. అన్నీ వున్నా ప్రేమ రాహిత్యంవల్ల ఆమె ఒక త్రాగుబోతుగా తయారయ్యింది



1967లో ఒక ప్రిమియర్ షోకు అటెండ్ అయిన ఎలిజిబెత్ టెయిలర్ రిచర్డ్‌బర్టన్‌లు

# ప్రపంచంతో సంచలనం సృష్టించిన ఎలిజిబెత్ టైలర్

తనను అత్యంతంగా ప్రేమించిన మూడవభర్త మైక్‌టాడ్ విమాన ప్రమాదంలో మరణించినప్పుడు ఎలిజిబెత్ ఎంతగానో విలపించింది అప్పటి నుంచే ఆమె విపరీతంగా త్రాగడం ప్రారంభించింది ఆమె ఐదవ భర్త రిచర్డ్‌బర్టన్ ఆమెను ఎంతగానో ప్రేమించేవాడు లాలించేవాడు అయితే బర్టన్ రేయింబవళ్ళు వోడ్కా త్రాగుతూ ఆ మత్తులోనే వుండేవాడు ఎలిజిబెత్‌కు బర్టన్‌వల్ల కూడా కన్నీళ్ళే మిగిలాయి

జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్న మార్లిన్‌మన్రో, జూడే గార్లాండ్‌లలా ఎలిజిబెత్ టెయిలర్ క్రుంగిపోయి జీవితాన్ని నాశనం చేసుకోలేదు

ఎలిజిబెత్ తన వద్ద పని చేసే వాళ్ళ విషయంలో ఎంతో ఎతరణ చూపేది పెళ్ళి చేసుకునే వారికి పెళ్ళి దుస్తులే ఎన్నో కానుకలే ఇచ్చేది ఎలిజిబెత్‌కి ఇవ్వడం ఎంత బాగా తెలుసో రావలసిన డబ్బును వసూలు చేసుకోవడం కూడా అంత బాగా తెలుసు

ఎలిజిబెత్ రిచర్డ్‌బర్టన్‌లు ప్రయాణానికి బయలుదేరితే 95 సూట్‌కేసులు వారి వెంట వుండేవి వారికోసం విమానాలు వేచివుండి వారొచ్చిన తరువాతే బయలుదేరేవి ఆలస్య మవుతోందని ఎవరైనా అంటే ఎలిజిబెత్ మండిపడేది ఇంగ్లండ్ మహారాణి 20 నిమిషాలు ప్రిన్సెస్ మార్గరెట్ 30 నిమిషాలు ప్రెసిడెంట్ టిటో గంటసేపు నాకోసం వెయిట్ చేశారు ఎలిజిబెత్ అంటే అంతే అనేది యదార్థానికి ఇవన్నీ నిజాలే!

ఎలిజిబెత్ కోరినట్టుగా రిచర్డ్‌బర్టన్ ఇరవైనాలుగు గంటలూ ఆమె వెంట తిరిగేవాడుకాదు ఎప్పుడూ త్రాగుతూ వుండేవాడు త్రాగనప్పుడు మాత్రం పుస్తకాలు చదువుతూ వుండేవాడు

బర్టన్ ఎక్కువగా త్రాగినప్పుడు ఎలిజిబెత్ బాదపడేది ఎలిజిబెత్ ఎక్కువగా త్రాగినప్పుడు బర్టన్ బాధపడేవాడు ఇలా ఆనందంలోనూ బాదలోనూ కూడా ఇద్దరూ చిత్తుగా తాగేస్తూ వుండేవారు ఒకరినొకరు చాలా అభిమానంగా చూసుకునేవారు

అంతకు మునుపు రిచర్డ్‌బర్టన్ నుంచి ఒసారి విడాకులు తీసుకుంది ఎలిజిబెత్ ఆ సమయంలో ఆమె అందరికీ తెలిసేట్టుగానే హెన్రీ వెయన్‌బెర్గ్ అనే సెకండ్‌హాండ్ కార్లమ్మే వ్యక్తితో తిరిగేదిట ఈ విషయాన్ని ఆమె గోప్యంగా వుంచేందుకు ప్రయత్నించలేదు విడాకులిచ్చి మళ్ళీ వివాహం చేసుకునే వరకు కూడా ఎలిజిబెత్ బర్టన్‌ను ప్రేమించడం మానలేదు ఆతడు కూడా ఆమెను చూడకుండా వుండలేక పొయ్యేవాడు

## సూపర్ హీరో

ఇంటికి ఆహ్వానించాలన్నది నా కోరిక. అందుకు నా పుట్టిన రోజు సాకు చేసుకున్నాను" అంది దమయంతి వారిని కూర్చోబెడుతూ

"కొంపతీసి ఇది పెట్టుడు పుట్టినరోజు కాదు గదా!" అంటూ చమత్కరించేడు విజయేంద్ర

"అంత కింకా ఎదగలేదు లెండి!" అంది దమయంతి నవ్వుతూ.

"ఇంకా ఎంత ఎదగాలి తల్లీ! ఈ ఏడు నేషనల్ ఎవార్డు నీవుదా కొట్టేస్తానని ఫీల్డులో రొంబ గోలగా వుంది! "మన పిక్చర్‌లో నీ యాక్షన్‌దా రొంబ బ్యూటీఫుల్!" అంటూ ప్రవేశించేడు గణేశన్

నిఖిలేశ్వరి లేచి నిలబడి అతనికి నమస్కరించింది

"కూర్చుకో తల్లీ! కూర్చుకో! బాగున్నారా?" అన్నాడు గణేశన్ ప్రతి నమస్కారం చేస్తూ

గణేశన్‌గారి మాటలకి నవ్వుతూ "నన్ను ములగచెట్టు ఎక్కించకండి!" అంది దమయంతి

"లేదు దమయంతిగారూ! ఈ మాట నేను విన్నాను" అన్నాడు విజయేంద్ర చిరునవ్వుతో

"నిజంగా ఎవార్డు వస్తే అదంతా మీ చలవే!" అంటూ భోజనాలు వడ్డించేందుకు ఉపక్రమించింది దమయంతి.

భోజనాల దగ్గర సుధీర్ సంగతి చెప్పింది

"మా విజయేంద్రని పోటీదా తెస్తుండావా?" అన్నాడు గణేశన్ నవ్వుతూ

"ఆయనకు సాటి ఎవరూ లేరు ఆయనకు పోటీ ఆయనే!" అంది దమయంతి అభిమానంగా విజయేంద్ర వైపు చూస్తూ.

"అలా అనుకోవడం పొరబాటు. అవకాశమొచ్చి టాలెంట్‌వుంటే అతను మా విజయ్‌ని బీట్ చేసినా సంతోషిస్తాను" అంది నిఖిలేశ్వరి చెయ్యి కడుక్కుంటూ

భోజనాలనంతరం గణేశన్, విజయేంద్ర సుధీర్ ఆల్బమ్ చూశారు

"కుర్రాడుదా బానే వున్నాడు యాక్షన్‌దా ఎందమాదిరి చేసిపూడుస్తాడో! రేపుదా మా ఆఫీసుకి రమ్మని చెప్పు!" అన్నాడు గణేశన్

"థాంక్సండి" అంది దమయంతి

అందరూ వెళ్దామని లేస్తుండగా కోకిల దమయంతి పక్కకి వచ్చి సైగ చేసింది తన సంగతి చెప్పమన్నట్టుగా చేతులు జోడించి

"మా కోకిలక చిన్న పాత్ర కావాలట!" అంది దమయంతి.

"ఏది, స్టేలుదా, వెండిదా?" అన్నాడు గణేశన్ నవ్వుతూ

"నవ్వులాట కాదు అంకుల్! తను సినిమాల్లో వేయాలనే ఈ ఊరు పారిపోయి వచ్చిందట! వేషాలు దొరక్క మా ఇంట్లో టచప్ గర్ల్‌గా చేరింది రోజూ నన్ను చెప్పమని పోరుతుంది."

గణేశన్ వెనుతిరిగి కోకిల వైపు చూశాడు.

నల్లగా స్ఫోటకం మచ్చలతో ఫర్లాంగు కొకటిగా వున్న పళ్ళతో కోకిల వికారంగా కనిపించిందతని కన్నులకి.

"నీవుదా వచ్చే ముందర అద్దంలో ముగం చూసుకునే వస్తివా?" అన్నాడు వెటకారంగా.

"పోనివ్వండి పాపం, బాధ పడుతుంది" అంది నిఖిలేశ్వరి ఊరడింపుగా

"చూడు కోకిలా! అందరూ అన్నిటికీ పనికిరారు సినిమా వేషాల కోసం ప్రాకులాడి జీవితం పాడు చేసుకోకు నీ అదృష్టం బాగుంది. దమయంతిగారి చేతుల్లో పడ్డావు ఇంటి కెళ్తానంటే చెప్పు నేను పంపిస్తాను ఎవరిమాటా నమ్మి ఈ ఇల్లు వదలుకోకు!" అంటూ హెచ్చరించేడు విజయేంద్ర.

కోకిల తలదించుకొంది

అందరూ వెళ్ళిపోగానే దమయంతి తలుపేసి కోకిల వైపు చూసి "బాధ పడుతున్నావా?" అంది

కోకిల జవాబు చెప్పలేదు

"ఈ ఫీల్డు సంగతి నీకు పూర్తిగా తెలీదు కోకిలా! తెలియకుండా వచ్చిన అమాయకుల్ని మోసంచేసే ఎన్నో దుష్టశక్తులు నగరమంతా వున్నాయి నువ్వు ఇంటి కెళ్తానంటే నేనే పంపిస్తాను విజయేంద్రగారు సహాయం చేస్తారు వేషాలకోసం ప్రాకులాడి బంగారంలాంటి భవిష్యత్తు పాడు చేసుకోకు" అంది ఊరడింపుగా

బదులుగా రెండు నీటి చుక్కలు రాలి పడ్డాయి కోకిల కళ్ళనుండి.

(ఇంకా ఉంది)















# జలుబు పోయిందే!

యూకలిప్టస్ చేరి వున్న అమృతాంజన్ కోల్డ్ రబ్ చంటిపాపల లేత చర్మాలకు ఎంతో సున్నితమైనది. తల్లి యొక్క చల్లని స్పర్శలాగా

కొత్త
15 గ్రామ్




అమృతాంజన్
**కోల్డ్ రబ్**
జలుబుల నుంచి శీఘ్రనివారణ

HTA 7351

# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

ఏ రామకృష్ణారావు, సోమల (చిత్తూరు జిల్లా)

ప్రశ్న : నా భార్య నా జీతం అంతా తనకే వినియోగించమంటోంది. ఇంటి వస్తువులు ఎక్కువ ఖరీదు పెట్టి కొనమని వేధిస్తున్నది. నామీద ఆధారపడిన తల్లి దండ్రులు, చెల్లెళ్ళు ఉన్నారు. వారి పోషణ కోసం నన్ను డబ్బు పంపవద్దు అని పోరు పెడుతుంది. నా తల్లి దండ్రులను వదులుకొనడం న్యాయమా? మా అత్త మామలు కూడా నన్ను నా తల్లి దండ్రులతో సంబంధాలు మానుకొని తమ కుమార్తె సరదాల కోసం నా జీతం మొత్తం వినియోగించమంటున్నారు. నా భార్య తన మాట వినకుంటే చస్తానని బెదిరిస్తోంది. తాను మరణించి నాకు శిక్ష పడేలా చెయ్యాలని ఆమె ఉద్దేశ్యం. నాకు రక్షణ లేదా? నేను నా భార్య నుండి రక్షింపబడాలంటే ఏమి చెయ్యాలి? విడాకులు తీసుకోవాలంటే ఎలా? దయచేసి తెలుపగలరు.

జవాబు : క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సెక్షన్ 125 (1) (డి) ప్రకారం పోషించుకోవడానికి అవకాశం లేని తండ్రినిగాని లేదా తల్లిని గాని పోషించడానికి నిర్లక్ష్యం చేసినప్పుడు, మేజిస్ట్రేట్ నెలసరి జీవనభృతి మంజూరు చేయవచ్చును. పాండురంగ కేసులో తండ్రికి జీవనభృతి చెల్లించాలని 1980 లో బొంబాయి హైకోర్టు తీర్పు చెప్పింది. సవతి తల్లికి కూడా జీవనభృతి చెల్లించాలని 1985 లో ఒరిస్సా హైకోర్టు తీర్పు చెప్పింది. డాక్టర్ విజయ కేసులో సుప్రీంకోర్టు వివాహమైన కుమార్తె కూడా తండ్రిని పోషించాలని, ప్రతి నెలా జీవనభృతి చెల్లించాలని 1987లో తీర్పు చెప్పింది. కనుక మీరు తల్లి, దండ్రులకు ప్రతి నెలా జీవనభృతి చెల్లించాలని మేజిస్ట్రేట్ ఆదేశాలు జారీ చేసినప్పుడు ఆ విధంగా చేయక తప్పదు. అప్పుడు మీ భార్య బెదిరించి ప్రయోజనం లేదు. ఇక మీ భార్య మరణించి శిక్ష పడేలా ఎలా చేస్తుంది? హత్యగాని, ఆత్మహత్యగాని జరిగినప్పుడు కోర్టు తగు సాక్ష్యాధారాలను పరిశీలించి శిక్ష విధిస్తుంది. మీరు నిర్దోషి అయినప్పుడు నిర్భయంగా ఉండండి. ఇక హిందూ వివాహ చట్టము (1955) లోని సెక్షన్ 13 ప్రకారం-

(1) మరియొకరితో లైంగిక సాంగత్యం పెట్టుకొనినా,

(1) (ఏ) క్రూరత్వముతో ప్రవర్తించినా-

(1) (బి) రెండు సంవత్సరములకు తక్కువ కాకుండా విడిచి పెట్టినా

(2) హిందూ మతము నుండి మరియొక మతమునకు మారిపోయినా,

(3) మానసిక వ్యాధితో బాధ పడుతున్నా,

(4) నయముకాని కుష్టు వ్యాధితో బాధ పడుతున్నా,

(5) సుఖ రోగముతో బాధ పడుతున్నా,

(6) ప్రపంచమును పరిత్యజించి మరియొక మత సంబంధమైన నియమము పాటించినా,

(7) ఏడు సంవత్సరముల నుండి జాడ తెలియక పోయినా, డైవోర్స్‌కు పిటిషన్ పెట్టుకొనవచ్చును. కనుక సెక్షన్ 13 ప్రకారం మీరు డైవోర్స్‌కు పిటిషన్ పెట్టుకొనవచ్చును.

కె. రమణయ్య,మైదుకూరు (కడప జిల్లా)

ప్రశ్న : నేను జూనియర్ అసిస్టెంట్‌గా 1969 లో చేరాను. అప్పటి రూల్సును అనుగుణముగా నా పుట్టిన తేదీ 1-1-40 నుండి 24-5-41 గా నా ఎస్. ఎస్. ఎల్. సి. లో సరిచెయ్యమని 1970 లో డైరెక్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్‌కు పిటిషన్ పంపాను. జి. ఓ. 158 ప్రకారం పుట్టిన తేదీ ఎస్. ఆర్. లో కరక్ట్ చేసుకోవాలంటే ఎస్. ఎస్. ఎల్. సి. అక్కరలేదని ఎడ్యుకేషన్ డైరెక్టర్ తెలియపర్చారు. హెడ్ ఆఫ్ డిపార్ట్‌మెంట్‌కు పిటిషన్ పెట్టుకొనమని రాశారు. మా జిల్లా కలెక్టర్ నా బర్త్ ఎక్స్‌ట్రాక్ట్‌తో తన ఎన్‌క్వయిరీ రిపోర్ట్ జత చేసి పుట్టిన తేదీ మార్చమని గవర్నమెంట్‌కు రాశారు. 1న్నర సంవత్సరములు అయినది. ఈ లోపల జి. ఓ. 165 ప్రకారం ఎస్. ఎస్. ఎల్. సి. రిజిష్టర్‌లో ఉన్న పుట్టిన తేదీ పాత కేసులకు కూడా ఎస్. ఆర్. లో వేయాలి. అని వచ్చినది. నా పిటిషన్ తిరస్కరించారు. ఎ. పి. ఎడ్మినిస్ట్రేషన్ ట్రిబ్యునల్ కూడా నా కేసులో మెరిట్ లేదని నా పిటిషన్ కొట్టి వేస్తూ 12-6-89 లో తీర్పు ఇచ్చింది. ఇప్పుడు నేను ఏమి చేయవలెను? ప్రస్తుతానికి ఎస్. ఎస్. ఎల్. సి. రిజిష్టర్ చేసుకొనవచ్చునా? లేక జి. ఓ పాత కేసులకు అన్వయించుట తప్పని అప్పీలు పెట్టుకొనవలెనా? తెలుపవలెను.

జవాబు : మీ కేసులో మెరిట్ లేదని ఆంధ్రప్రదేశ్ ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ 12-6-89 లో మీ పిటిషన్ కొట్టివేసిందని రాశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 21-4-1984 లో జి. ఓ. 165 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉద్యోగ (పుట్టిన తేదీ వ్రాయుట మరియు మార్చుట) నిబంధనలు (1984) జారీ చేశారు. నింబంధన 2 ప్రకారం ప్రతి ఉద్యోగి ఉద్యోగములో చేరిన నెల రోజుల లోపల తన పుట్టిన తేదీ గురించి డిక్లరేషన్ ఇవ్వాలి. ఈ నిబంధనలు పాత కేసులకు కూడా వర్తిస్తుందని నిబంధన 4 లో

ఉన్నది సెర్వీస్ రిజిష్టర్‌లో పుట్టిన తేదీ రాసిన తర్వాత పుట్టిన తేదీ మార్చమని అడగడానికి ప్రభుత్వోద్యోగికి హక్కు లేదని 4వ నిబందనలో ఉన్నది 5వ నిబంధన 1886 కేంద్ర చట్టమునకు విరుద్ధమని 1985 లో హయగ్రీవశర్మ కేసులో ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ తీర్పు

చెప్పింది ఈ నిబందనలు ప్రకారం గడువు దాటిన తర్వాత పుట్టిన తేదీ మార్చడానికి ప్రభుత్వానికి అదికారంలేదు కాని నిబందన 4 లో పాత కేసులకు వర్తింపచేయడం అన్యాయముగా ఉన్నది పెన్షనర్ల కేసులో రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్ ఇవ్వడానికి వీలు లేదని 1986 లో

సుప్రీం కోర్టు తీర్పు చెప్పింది కాబట్టి ఈ నిబంధనలు పాత కేసులకు వర్తింప చెయ్యడం అన్యాయమని, ఏకపక్షమని, రాజ్యాంగ విరుద్ధమని సుప్రీం కోర్టులో అప్పీలు పెట్టుకొనవచ్చును అంతే కాకుండా కొత్త వారికి నిబంధన వర్తించే విదంగా పాత వారికి కూడా పుట్టిన తేదీ మార్చుకొనడానికి గడువు పెట్టలేదు ఈవిధంగా వివక్ష చూపారు కనుక నిబంధన 4 రాజ్యాంగంలోని 14, 16 అధికరణలకు విరుద్ధమని హైకోర్టులో గాని, సుప్రీం కోర్టులోగాని రిట్ పిటిషన్ పెట్టుకొనవచ్చును

నూకల సుబ్రహ్మణ్యశర్మ, అనంతవరం (తూర్పు గోదావరి జిల్లా)

ప్రశ్న - నేను వికలాంగుడను విశాఖపట్నం ఉపాదికల్పనా కార్యాలయము వారు నా యొక్క పేరును వికలాంగుల కోటాలో విశాఖపట్నం లోని లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ వారి డివిజనల్

ఆఫీసుకు పంపించారు ఎల్ ఐ సి డివిజనల్ ఆఫీసు వారు టెంపొరరీ అసిస్టెంట్ పోస్టునకు నన్ను 1988 మే నెలలో ఇంటర్వ్యూ చేసి జూలైలో గాజువాక ఎల్

ఐ సి ఆఫీసునకు పోస్టింగ్ ఇచ్చారు నేను 1988 జూలై 22 తేదీన జాయిన్ అయి ఆగస్టు 23 వరకు ఉద్యోగం చేశాను నా ఆరోగ్యం బాగులేనందు వలన

అమలాపురంనకు బదిలీ చెయ్యమని లెటర్ ఇచ్చాను ఎల్ ఐ సి వారు నన్ను అమలాపురం ట్రాన్స్‌ఫర్ చేశారు నేను అమలాపురంలో 1988 డిశంబర్ 19 తేదీన జాయిన్ అయ్యాను 1989 ఫిబ్రవరి 8 తేదీ వరకు 85 రోజులు ఉద్యోగం చేశాను నాకు పెర్మనెంట్ అయ్యే అవకాశం వున్నదా? ఉంటే ఏ కోర్టుకు వెళ్ళవలెను? ప్రొసీజర్ చెప్పవలెను

జవాబు - మీకు రిజర్వుడు కేటగిరీలో ఉద్యోగం దొరికింది లేనట్లయితే మీకు దొరకదు గాజువాకలో

33 రోజులు పనిచేశారు 1988 ఆగస్టు 24 నుంచి డిశంబర్ 18 వరకు మీరు ఏమి చేశారో వ్రాయలేదు మీరు మెడికల్ సర్టిఫికేట్ మీద సెలవు కావాలని లీవ్ అప్లికేషన్ పెట్టండి ఆ పీరియడ్ రెగ్యులరైజ్

అవుతుంది ఇక 1989 ఫిబ్రవరి 9 తేదీ నుంచి మీరు ఉద్యోగం చేస్తున్నారా? లేదా? కనీసం మెడికల్ సర్టిఫికేట్ పెట్టి లీవ్ అప్లికేషన్ పంపించారా? లేనట్లయితే ఇప్పుడైనా మెడికల్ సర్టిఫికేట్ రిజిష్టర్డ్ పోస్టులో పంపించండి వీలు వుంటే జీతం నష్టం మీద సెలవు మంజూరు చేస్తారు

ఆంధ్రప్రదేశ్ ప్రబుత్వోద్యోగులకు లీవ్ రూల్స్ పండమెంటల్ రూల్స్ వున్నవి వాటి ప్రకారం సెలవు పీరియడ్ రెగ్యులరైజ్ చేస్తారు ఆ విధంగానే ఎల్

ఐ సి వారు కూడా వారికి సంబంధించిన నిబంధనలు పాటించాలి మీకు సెలవు మంజూరు చెయ్యడానికి వీలు లేక పోయినట్లయితే మళ్ళీ

ఉద్యోగం ఇమ్మని పిటిషన్ పెట్టండి ఇక మీరు బ్రేక్ లేకుండా ఉద్యోగం చేసుకుంటే మీ ఉద్యోగం దానంతట అదే పెర్మనెంట్ అవుతుంది ఏ కోర్టుకు వెళ్లనవసరం లేదు

●



"ఖైదీ దాదా"లో వాణిశ్రీ, బేబిజయ, రాధ

## కృష్ణ, రమేష్‌బాబులు నటించిన "ఆయుధం"

"ఒక స్వార్థపరుడు తనమీద ఆయుధం ఎక్కుపెట్టగా-దానిని ఒక నిజాయితీపరుడు మారణాయుధంగా మార్చి, ప్రయోగించిన వాడిపైనే తిప్పి కొడతాడు. స్థూలంగా- గన్‌పవర్‌కు, పెన్ పవర్‌కు మధ్య సంఘర్షణ" అన్నారు కె. మురళీ మోహనరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. సత్యనారాయణ. నిర్మించిన బాలాజీ ఫిలిమ్స్ 'ఆయుధం' చిత్రంలో కృష్ణ, రమేష్‌బాబు, రాధ, వాణీ విశ్వనాథ్, సత్యనారాయణ, పి. ఎల్. నారాయణ, వేణు, బాబూ మోహన్, యువశ్రీ, సాయికుమార్, అనూరాధ, మాడా, వినోద్, ఒక కీలకమైన పాత్రలో శివకృష్ణ నటించారు. పరుచూరి సోదరులు, వేటూరి, చక్రవర్తి, కె. ఎస్. హరి, నరసింహారావు, త్యాగరాజన్, శ్రీను, రాంచంద్రసింగ్, తార, చిరంజీవి రాజీ, కాశీ ప్రసాద్, రవీంద్రనాథ్, జి. శివయ్య ప్రభృత సాంకేతికవర్గం.

## "నాయకురాలు" శారద

"విజయవాడలో అసంఖ్యాక జనుల మధ్య పతాక సన్నివేశాలు ఈ చిత్రంలో హైలైట్" అన్నారు సత్యారెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. ప్రభాకర్ సినిమాస్కోప్‌లో నిర్మించే ప్రియా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "నాయకురాలు" చిత్రంలో శారద,





"కలియుగ అభిమన్యుడు"లో రమేష్, శాంతిప్రియ



"శశిరేఖ శపథం"లో రాళ్ళపల్లి, డిస్కో శాంతి, రాజు

ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 2-3-'90

## చక్రవ్యూహం ' మార్చిలో

"జనవరి 25 నుంచి ఫిబ్రవరి వరకు చివరి షెడ్యూల్ జరిగింది మార్చి విడుదల ' అన్నారు కె కృష్ణారెడ్డి ఈయన నిర్మించే జయేంద్ర ఫిలిమ్స్ చక్రవ్యూహం చిత్రంలో సుమన్ అర్చన, గౌతమి రాజాకృష్ణమూర్తి, రఘువరన్ డిస్కో శాంతి ప్రదీప్‌శక్తి పి జె శర్మ, ప్రభృత నటవర్గం తనికెళ్ళ భరణి మాటలు వేటూరి పాటలు ఇళయరాజా సంగీతం కృష్ణ సాహసాలతో కె సుబ్బారెడ్డి సమర్పించే ఈ చిత్రానికి కథ స్క్రీన్‌ప్లే ఛాయ కూర్పు దర్శకత్వం బాలూమహేంద్ర

## నాగార్జున "సిద్ధార్థ"

మొదటి షెడ్యూల్ కేరళ తమిళనాడులోని కీకారణ్యాలలో జరిగింది రెండవ షెడ్యూల్ మద్రాసులో, హొగెనకల్‌లో మూడవ షెడ్యూల్ చివరి షెడ్యూల్ మద్రాసులో ముగించాం ' అన్నారు క్రాంతికుమార్ ఈయన స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్న శ్రీకాంతి చిత్రవారి ' సిద్ధార్థ చిత్రంలో నాగార్జున సరసన శోభన, బొంబాయికి చెందిన ఓ యువనటి నాయికలు కృష్ణంరాజు శరత్‌బాబు కన్నడ ప్రభాకర్ దేవరాజ్, ప్రదీప్‌శక్తి వేలు తార తదితరులు కూడా నటిస్తున్నారు సత్యానంద్ రచన వేటూరి గీతాలు, లక్ష్మీకాంత్ ప్యారెలాల్ సంగీతం ఎ శ్రీకరప్రసాద్ కూర్పు తెర వెనుక హంగులు

**-జి.వి.జి.**

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నిండి




4 మాసాలు నిండి




6 మాసాలు నిండి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం



కొల్లిమళ్ల అప్పారావు

"పోస్ట్" అని కేకేసి కవర్‌ని కటకటాల లోంచి విసిరి వెళ్ళిపోయాడు ఆ వీధి పోస్ట్‌మెన్.

వసారాలో బట్టలు ఉతుకుతున్న భార్గవి చేతులు కడుక్కొని బయటికి వచ్చి చూసేసరికి, పోస్ట్‌మెన్ ఆ వీధి మలుపు తిరిగాడు సైకిల్ ఎక్కి.

సిరామిక్ ఫ్లోర్ మీద తెల్లని కవరు వుంది. దానిని చేతులోకి తీసుకొని చూసింది. కవర్ వెనక వైపు డెబ్బై పైసల స్టాంప్స్ అతికించి వున్నాయి. కవర్ ముందు భాగంలో నీట్‌గా టైప్ చేయబడి వుంది రవివర్మ ఎడ్రస్. కవర్ మీద ఫ్రం ఎడ్రస్ లేదు.

ఒకరికొచ్చిన లెటర్స్ మరొకరు చదవ కూడదన్న నైతిక నిబంధన భార్గవికి తెలీదు.

సీల్ చేసిన కవర్‌ని చించింది.

లోపల ఒకే ఒక కాగితం వుంది. తెల్లని కాగితం మీద ఎర్ర సిరాతో రాసిన అక్షరాలు అసహ్యంగా ఉన్నాయి.

"మిష్టర్ రవివర్మా! ఒక నెల నీ దగ్గర, మరో నెల మీ తమ్ముడు చంద్రకాంత్ వద్ద విశ్రాంతి పొందుతున్న మీ నాన్న ప్రస్తుతం మా దగ్గర విశ్రాంతి పొందుతున్నాడు. ఆశ్చర్య పోతున్నావు కదూ? నిన్న సాయింత్రం మీ నాన్న పరంధామయ్యని మేము కిడ్నాప్ చేశాం. నువ్వే ఇస్తావో, మీ తమ్ముడే ఇస్తాడో? లేక మీ రిద్దరు కలిసే ఇస్తారో మాకు తెలియదు. మాకు మాత్రం రు. 10,000, అక్షరాలా పదివేల రూపాయలు రేపుసాయంత్రం ఆరుగంటలకల్లా ఊరవతల నది దగ్గరకు పట్టుకొచ్చి ఇవ్వాలి. ఈ సంగతి పోలీసులకు గాని, ఇతరులకు గాని తెలియ చేసినా, చెప్పిన సమయానికి డబ్బు అంద చేయక పోయినా మీ తండ్రి డెడ్‌బాడీ రికవరీ చేసుకోడానికి సిద్ధంగా వుండండి. కాపీ టు చంద్రకాంత్.

– కిడ్నాపర్స్"

లెటర్ చదవడం పూర్తి చేసిన భార్గవి ఆందోళన చెందలేదు. ఆమె వొళ్ళు కుతకుత లాడింది.

లెటర్‌ని చింపేయాలనుకుంది. భర్త ప్రతిస్పందన ఎలా వుంటుందో కనుక్కోవాలని మడత పెట్టి అలాగే వుంచింది.

భర్త వచ్చేవరకూ ఆలోచనలతోనే గడిపింది క్రైసిస్‌ని ఎలా ఎన్‌కౌంట్ చేయాలని?

ఆమె ఆలోచనంతా మావయ్య కోసం కాదు. డబ్బు కోసమే. వందా? యాభయ్యా? ప...ది...వే...లు!

భర్త లంచ్‌కి ఆఫీసు నుంచి రానే వచ్చాడు.

లంచ్ కంటే ముందు లెటర్ అందించింది. దానిలో సారాంశానికి రవివర్మ ఆకలి చచ్చిపోయింది. తల పట్టుకొని కూర్చున్నాడు.

డబ్బు సమస్య అతనికి లేదు. బ్యాంకులో యాభైవేలు వరకూ బ్యాలన్స్ వుంది. చంద్రకాంత్ ఓ అయిదు వేలు భరిస్తాడు కాబట్టి తను ఓ అయిదు వేలు తండ్రి కోసం నీళ్ళొదులు కోవాలి.

ఆ అయిదు వేలయినా ఎందుకువదులుకోవాలి?

తండ్రి వలన ప్రయోజనం శూన్యం. ఆయన రిటైరయ్యారు. ఆయనకున్న ఆస్థిపాస్తులు అన్నదమ్ములు ఇరువురూ ఎప్పుడో పంచేసుకున్నారు. మృత్యువు పిలుపు కోసం ఎదురు చూస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. అతనికి మూడు పూట్లా తిండి పెడుతున్నది కాక లాట్రి టిక్కెట్‌కి రోజుకి రూపాయి ఇవ్వాలి.

"ఏం చేస్తారు?" అడిగింది భార్గవి భర్తని.

"బోధపడటం లేదు. ఇప్పుడు తండ్రిని విడిపించకపోతే లోకం ఏమనుకుంటుంది?"

"లోకాన్ని నమ్మించడానికి సాకులు చాలా వున్నాయి."

"నీకు తోచిన సాకు ఏమైనా చెప్పు."

"ఏముంది? మనకి ఈ లెటర్ అందలేనట్టుగా మనం శ్రీశైలం మల్లిఖార్జుడి దర్శనం కోసమని పోతేసరి. తిరిగి మనం ఎల్లుండి ఉదయం ఈ ఊరు వస్తాం. అప్పటికి అంతా అయిపోతుంది." ముగించింది.

"బెస్ట్ ఐడియా. కాకపోతే తండ్రి మరణం తథ్యం అని తెలిసాక హృదయం కలుక్కు మంది."

అప్పటికప్పుడు గుట్టు చప్పుడు కాకుండా శ్రీశైలం వెళ్ళే బస్సుకు బయలు దేరారు.

★ ★ ★ ★ ★ ★

అన్న ఇంటికి వెళ్ళి నిరుత్సాహంగా తిరిగి వచ్చాడు చంద్రకాంత్.

"ఏమన్నారండీ, మీ అన్నయ్య?" ఆసక్తిగా అడిగింది చంద్రకాంత్ భార్య.

"ఇంటికి తాళం వేసి వుంది. ప్రక్క ఇళ్ళ వాళ్ళను అడిగాను వాళ్ళకు తెలియదట

"ఆఫీసులో కనుక్కోలేక పోయారా?"

"ఫోన్ చేసి అడిగాను లంచ్‌కి ఇంటికి వెళ్ళి మరి రాలేదట ఆఫీసుకు."

అతని భార్యకి చప్పున అర్థమై పోయింది తాజా పరిస్థితి.

"చూసారా? మీ అన్నయ్య, వదినలు ఎంత కర్కోటకులో?" నిష్ఠూరంగా అంది

"ఏమైంది?" అర్థంకాక ప్రశ్నించాడు.

"ఉదయం ఉత్తరం అందుకొని మాకీ సంగతి తెలియలేదని నలుగురికీ తెలియాలని ఏదో ఊరు వెళ్ళిపోయారు "

చంద్రకాంత్ నివ్వెరపోయాడు

"అంత కరెక్ట్‌గా ఎలా చెపుతున్నావు?"

"మనుషుల మనస్తత్వాలు ఎనాలసిస్ చేస్తే తెలుస్తుంది

"అయితే ఇప్పుడు మనం ఏం చేద్దాం? పదివేలూ మనమే భరిద్దామా?

"పోనీలెండి వెధవ పదివేలు ఆయన ద్వారా మనకు డెబ్బై వేల ఇల్లు, లక్ష రూపాయిల పొలం ముట్టింది. ఆయన కోసం పదివేలు ఖర్చు పెట్టినంత మాత్రాన మనకి తరగి పోయినది ఏమీ లేదు అసలు ఆయన మీకు జన్మ నిచ్చినందుకు ఖర్చు పెట్టాలండి పదివేలు " ఆవేశంగా అందామె

"సరే, అలాగే చేద్దాం

"అంతేకాదు ఇకపై మావయ్యగారిని మీ అన్నయ్య ఇంటికి పంపించ వద్దు మనం ఆయన శేష జీవితం ఇక్కడే గడుపుతారు '

"అలాగే"

* * * * * *

సోమవారం ఉదయం

ఆర్ టి సి కాంప్లెక్స్‌లో శ్రీశైలం నుంచి వచ్చిన డీలక్స్ బస్సు ఆగింది

మావయ్య బ్రతికున్నాడో, లేదో తెలియక భార్గవి ఆందోళన చెందుతోంది ఒకవేళ చనిపోతే ఆయన మృతకాయం మీద పడి ఘోరున పడి ఎలా ఏడవాలో ఊహించుకుంటూంది రవివర్మ అయితే ఫ్యునరల్ ఫంక్షన్‌లో తండ్రికి తల కొరివి పెట్టడం వరకూ తన పాత్రని గుర్తు చేసుకుంటున్నాడు

పాసింజర్లు ఒక్కొక్కరు బస్సు దిగుతున్నారు

"భార్గవి మన ఊరు వచ్చేశాం

"ఊఁ అంటూ బేగ్ అందుకుంది

ఇద్దరూ కండక్టర్ సీటు వరకు నడిచారు

"కండక్టర్ ఇవ్వవలసిన డబ్బులు టిక్కెట్ వెనక రాశాడుగా పుచ్చుకోండి ' గుర్తు చేసింది భార్గవి

"ఆఁ ఆఁ మాకు మూడు రూపాయిలు వస్తాయండి అంటూ రవివర్మ టిక్కెట్టు కండక్టర్‌కి ఇచ్చాడు

కండక్టర్ టిక్కెట్ మీద రాసిన మూడు అనే అంకెని పెన్‌తో కొట్టి మూడు రూపాయిలు ఇచ్చాడు

బస్సు దిగి కాంప్లెక్స్‌లోకి నడిచారు

వాళ్ళ కోసమే ఎదురు చూస్తున్న ఓ ముసలి వ్యక్తి కాకతాళీయంగా వారిని కలిసినట్టు విష్ చేశాడు

అతడు ఆ భార్యాభర్తలకు బాగా తెలుసు

అతని పేరు శ్యామ్‌సుందరం పరంధామయ్యకి కొలీగ్ మరియు బెస్ట్ ఫ్రెండ్

తండ్రి ప్రెజెంట్ పరిస్థితి ఏమిటో శ్యామ్‌సుందరంకి తెలుసునని రవివర్మ సిక్స్త్ సెన్స్ చెబుతోంది

"గుడ్‌మానింగండి శ్యామ్‌సుందరం గారు మా ఆవిడ నాకు అప్పుడెప్పుడో సుస్తీ చేసినప్పుడు శ్రీశైలం మల్లిఖార్జునుడికి మొక్కుకుందట. ఆ మొక్కు తీర్చుకోవటానికి మొన్న పొద్దుటే వెళ్ళి ఇప్పుడు తిరిగి వస్తున్నాం ' ఎందుకయినా మంచిదని ముందే చెప్పేశాడు వివరాలు

శ్యామ్‌సుందరం నర్మగర్భితంగా నవ్వేడు

"మా నాన్నగారు ఎలా వున్నారు? ఈ నెల మా తమ్ముడి ఇంట్లో కదా వుంటారు

"నిక్షేపంగా వున్నాడు ఏం చచ్చిపోయాడను కున్నారా?

రవివర్మ ఆ వాక్యంకి భార్య ముఖంలోకి చూసాడు

"అదేమిటండి అలా అంటారు?

"నాకు అంతా తెలుసు మిస్టర్ అండ్ మిసెస్ రవివర్మ మీ నాన్నని కిడ్నాప్ చేశారని తెలిసి నీ వంతు అయిదు వేలు ఇవ్వవలసి వస్తుందని అప్పటికప్పుడు శ్రీశైలం బయలు దేరావు

"అబద్ధం

"నీ ఇష్టం నువ్వు అయిదు వేలు కోసం ఎంత నష్టపోయావో తెలుసా? యాభై వేలు!

"వ్వాట్ ఆర్ యు టాకింగ్

"మీ నాన్నకి లాటరీలో లక్ష రూపాయిలు వలికాయి ఆ విషయం గుప్తంగా వుంచి ఏం చేయమంటావు అని అడిగాడు నన్ను డబ్బుకు లెక్క చేయకుండా నిన్ను రక్షించే కొడుకు పేర బ్యాంకులో వేయమని సలహా ఇచ్చాను ఆ విధంగా మీ నాన్న ఈ కిడ్నాప్ ప్లాన్ వేశాడు. ఈ పరీక్షలో మీ తమ్ముడు లక్ష రూపాయిలు గెలుచుకున్నాడు "

మిస్టర్ అండ్ మిసెస్ రవివర్మ ముఖంలో కత్తివాటుకి నెత్తురు చుక్క కరువయింది! ●

# తారాపథాన పామెల్లా

మాజీ మిస్ ఇండియాగా ప్రఖ్యాతి గాంచిన పామెల్లా బోర్డెస్ సినిమా రంగాన్ని ఒక ఊపు ఊపాలను కుంటోందట. ఈమె వ్యవహారం యిటీవల అంతర్జాతీయంగా బహుళ ప్రచారం పొందిన విషయం పాఠకులకు విదితమే.



పాత జీవితానికి స్వస్తి చెప్పి కొత్త జీవితం ప్రారంభించాలనుకుంటున్న పామెల్లా లండన్‌లోని 'లీస్ట్రాస్‌బెర్గ్' యాక్టింగ్ స్కూల్లో శిక్షణ పొందుతోంది. "ఆర్థికంగా దెబ్బ తిన్న పామెల్లా గతంలో మోడలింగ్‌కు తీసుకున్న 500 పౌండ్లను యిప్పుడు 5 వేల పౌండ్లకు పెంచిందట. యూరప్‌లో మోడల్‌గా మంచి పేరు సంపాదించిన పామెల్లా సినిమాల్లో ఎంత డిమాండు చేస్తుందో మరి! పామెల్లాపై వస్తున్న సినిమాలను చూస్తున్న ప్రేక్షకులకు స్వయంగా పామెల్లానే నటించే చిత్రాలు మరింత కనువిందు' చేస్తాయనటంలో సందేహం లేదు!



# లవ్ గేమ్



## చల్లా సుబ్రహ్మణ్యం

భయంతో కెవ్వుమన్న నవ్య స్వరాన్ని డామినేట్ చేస్తూ వినిపించిందో ఆర్తనాదం-

బొద్దింకల్ని చూసి వణికిపోతున్న నవ్య ఆ ఆర్తనాదానికి మరింత భయపడి అటుగా చూసింది.

స్వాగత్ కొయ్యబారి పోయి నిల్చున్నాడు.

అతనిషర్ట్ తడిసిపోయి ఉంది. చెమటతో స్నానం చేస్తున్న వాడిలా ఉన్నాడతను.

కళ్ళు పెద్దవి చేసి-

ప్రపంచంలోని భయాన్నీ అసహ్యాన్నంతటినీ- తన కళ్ళలో నింపుకుని షర్ట్ జేబు మీదికి చూస్తున్నాడు

అక్కడ-

బూడిద రంగు శరీరం మీద నల్ల చిన్న మచ్చలతో - లావుగా ప్రారంభమై సన్నగా అంతమైన తోకతో - పూసల్లాంటి కళ్ళను ఎదురుగా నవ్య మీదున్న బొద్దింక మీద కేంద్రీకరించి- ఎర్రని నోటిని చప్పరిస్తూ తోకను మెల్లగా కదిలిస్తూ-

జేబు మీద అతుక్కు పోయినట్టుంది

ఓ బల్లి!

ఒక అడుగు వ్యాసంలో ఉంది

(గత సంచిక తరువాయి)

చుట్టూ పడగలెత్తిన విషనాగులు బుసలు కొడుతుంటే ప్రాణభయంతో ఊపిరి బిగబట్టిన వాడిలా దాన్నే చూస్తున్నాడతను.

అవతల నవ్య నడుము మీద వున్న బొద్దింక నెమ్మదిగా రెక్కలు విప్పింది. అవతల వ్యక్తి జేబు మీద తన శత్రువును పసిగట్టినట్టు - కదిలేత్ శత్రువుకు ఆహారమై పోతానన్న భయంతో ఒక్కసారిగా ఎగిరి పోవాలన్న ప్రయత్నంలో తన రెండు జతల కాళ్ళతో ఆమె శరీరం మీద బలంగా నొక్కసాగింది

గుండెల మీదున్న బొద్దింక నెమ్మదిగా కదిలి- ఆమె మెడమీదకెళ్లే ప్రయత్నంలో ఉండగా - భరించ లేని అసహ్యంతో మళ్ళీ కెవ్వున అరిచింది నవ్య

ఆమె కేకకు ఉలిక్కి పడిన దానిలా - షర్ట్ జేబు మీదున్న బల్లి జర జరా పాకి అతని మెడ మీద కెళ్ళి, అక్కడ్నుంచి తన ఆహారాన్ని గమనిస్తోంది దాని శరీరం తాలూకు నులివెచ్చని దనాన్ని అనుభవించిన స్వాగత్ ఒళ్ళు జలదరించగా-

మరో ఆర్తనాదం అతని గొంతులోంచి అప్రయత్నంగా వచ్చింది.

తన గదిలో ఆదమరచి నిద్రపోతున్న మీనాక్షి ఉలిక్కిపడి లేచింది

అప్పటిదాకా తాను విన్న కేకలు - కలో - భ్రమో- నిజమో అర్థంకాలే దామెకు.

కొంతసేపు అలాగే కూర్చుండి పోయింది

గదిలో జీరో వాట్స్ బల్బ్ నీలి రంగు కాంతిని ప్రసరిస్తోంది

టేబుల్ మీదున్న జగ్‌లోని నీళ్ళు తాగి - తాను భ్రమ పడుతున్నాననుకొని - తిరిగి నడుము వాల్చ బోతున్న ఆమెకు మరో సారి వినిపించింది.

ఓ స్త్రీ ఆర్తనాదం - ఆ వెనకేఓ పురుషుడిదీ-

భయంతో ఆమె గుండె వేగం పెరిగింది.

ఏ బందిపోట్లో వచ్చి చెల్లెల్నీ - మరిదినీ హత్య చేయడం లేదుగదా? హైదరాబాద్ బందిపోట్లకు ప్రసిద్ధి అని తాను చదివింది

భగవంతుడా!

నువ్వే రక్షించాలి ఈ గండం గడిస్తే వంద కొబ్బరికాయలు కొడతాను-

మనసులో నే మొక్కుకుంది

సరిగ్గా అప్పుడే-

మరో రెండు ఆర్తనాదాలు.

లేచి నిల్చున్న మీనాక్షికి ఏం చేయాల్లో అర్థంకాలేదు

'దొంగ- దొంగ' అని అరవాలా? అలా అరిస్తే తన దగ్గరికి కూడా వచ్చి తననూ చంపేస్తారేమో!

అయినాసరే- వాళ్ళిద్దర్నీ కాపాడే అవకాశం ఇప్పుడు తనకే ఉంది. చెల్లెలికోసం ప్రాణాలకు తెగించి- బందిపోట్లతో ముఖాముఖి పోరాటానికి వెళ్తున్న వీరనారిలా కొంగు బిగించి తలుపు బోల్టు తీయబోతుండగా కనిపించిందామెకు-

గది మూలలో ఉన్న దుడ్డుకర్ర

ఆవేశంగా వెళ్ళి దాన్ని తీసుకుని గది తలుపులు తీసింది

అంతా చీకటి-

లైటేస్తే బందిపోట్లు తనను చూస్తారేమోనన్న ఊహతో - అలాగే కర్ర పట్టుకుని మెల్లగా నడుస్తూ చెల్లెలి బెడ్‌రూం వేపునడవసాగింది వాళ్ళ గదిలోని లైటు వెలుగు కిటికీ గ్లాసులద్వారా బయటకొస్తోంది. అంటే దోపిడీ ప్రారంభమైందన్నమాట! కర్రను బలంగా రెడీగా పట్టుకుని తలుపు దగ్గరకొచ్చి నెట్టింది

తలుపు తెరుచుకోలేదు

గదిలోంచి బయల్దేరేటప్పుడున్న ధైర్యం క్రమంగా నీరుగారి పోయిందామెలో.

**ఇంతవరకూ సాగిన కథ-5 :** పెళ్లయిన భార్యాభర్తలు ఆనందలోకాల్లో విహరించే మధురాతి మధురమైన తొలిరోజు అనుభవాలను చవిచూడాలనుకున్న స్వాగత్‌కు భార్య నవ్య నుంచి ఊహించని వ్యతిరేకత ఎదురవుతుంది. సంవత్సరం పాటు ఆ దాకులు తీసుకోవాలన్న నిర్ణయానికి కట్టుబడి వేరే కాపురం పెడతాడు స్వాగత్. ఒకనాడు నవ్య పొందుకోరబోయిన స్వాగత్ నవ్య ప్రతిఘటించి ఆత్మహత్య చేసుకున్నట్లు కలగంటాడు. నవ్యను తన కౌగిలిలో బందీ చేయాలనుకున్న స్వాగత్ ఆమెపై బొద్దింకల్ని ప్రయోగిస్తాడు.



దుఃఖం ముంచుకొస్తోంది

వర్తు – ఎల్లలూ గుర్తుకొస్తున్నారు

అయినా నిగ్రహించుకుని – వణుకుతున్న చేత్తో నెమ్మదిగా తలుపు తట్టాలని చెయ్యెత్తిన క్షణంలో

సరిగ్గా మళ్ళీ రెండు ఆర్తనాదాలు హృదయ విదారకంగా వినిపించాయి– అపరిడ – తానూ కెవ్వున కేకేసింది

స్వాగత్ – నవ్య ఉలిక్కిపడి అంత భయంలోనూ – మూడో ఆర్తనాదం ఎవరిదా అని కళ్ళతోటే ప్రశ్నించుకున్నారు

అప్పుడు వినిపించింది తలుపు చప్పుడు

తాను కదిలితే – మోచేతి మీదున్న బల్లి ఎటువెళ్ళి తన శరీరాన్ని స్పృశిస్తుందోనన్న భయంతో బేలగా నవ్యను చూశాడు

ఆమె పరిస్థితి కూడా అలాగే వుంది

తలుపు తడుతున్న చప్పుడు ఎక్కువవుతోంది

అన్నింటికి తెగించినట్టు స్వాగత్ బలంగా చేతిని విదిలించాడు బల్లి తటాలున నవ్య మీదున్న బొద్దింక మీదకు దూకి – నోట కరుచుకుని– అదే వేగంతో కంచెక దూకి గోడమీదికెళ్ళి పోయింది విసురుగా వెళ్ళి తలుపు తీశాడు స్వాగత్ అయితే ప్రమాదాన్ని పసిగట్టి అంతే విసురుగా పక్కకు ఎగిరాడు

ఒక్క క్షణం అతను తప్పుకోక పోయివుంటే – మీనాక్షి కొట్టిన దెబ్బకి అతని తల రెండు ముక్కలయ్యేది

చేతిలోని కర్రతో నిలబడ్డ వదినగార్ని విమెరపోయి చూశాడు అతనికంతా అయోమయంగా వుంది

తాను ఊహించిన సన్నివేశానికీ – జరుగుతున్న దానికీ పొంతన కుదరక ఆశ్చర్యపోయిన మీనాక్షి – ఆవేశంతో రొప్పుతోంది–

చప్పున తేరుకుని–

వెళ్ళిపోయారా?" నెమ్మదిగా అడిగింది మీనాక్షి

ఎవరు?" అంతకంటె తగ్గు స్వరంతో అడిగాడు

బందిపోట్లు–

'మైగాడ్ – ఎక్కడ?

మీ గదిలో ?

ఆమె నవ్వు కలుపుకుంటున్నట్టు చూసింది–

మీకు నిద్రలో నడిచే అలవాటుందా?

అన్నాడతను

మీకు నిద్రలో కేకలేసే అలవాటుందా?

లేదే'

మరి నాకూ లేదే'

'అయితే ఈ కర్ర – బందిపోట్లు

ఆమె జవాబు చెప్పేంతలో నవ్య మరోసారి కెవ్వుమంది

ఆ కేకకు వేగంగా లోపలికొచ్చిన మీనాక్షిని – భయంతో గట్టిగా కౌగలించుకుంది నవ్య

హూ! దేనికయినా అదృష్టముండాలి!

## లవ్ గేమ్

తనకు దక్కాల్సిన చాన్స్ మీనాక్షి కొట్టేసిందని బాధగా నిట్టూర్చాడతను.

"ఏవిటమ్మా- బొద్దింకా?" చెల్లెల్ని బుజ్జగిస్తూ అడిగింది మీనాక్షి.

"అవును రెండు.." అని నవ్య కళ్ళు మూసుకుని మరింతగా హత్తుకుంది అక్కను.

ఆ దృశ్యాన్ని చూడలేక తల తిప్పుకున్నాడతను

గోడమీద బల్లి నవ్య చీరెమీద నుంచి కింద పడి నేలమీద పాకుతున్న మరో బొద్దింకను చూస్తూ- ఎటాక్‌కు రెడీగా ఉంది.

తన పథకాన్ని తలకిందులు చేసి- తన అదృష్ట భాండాన్ని క్షణంలో ముక్కలు చేసిన ఆ బల్లిమీద పట్టరాని కోపం వచ్చిందతనికి ఆవేశంతో -

టేబుల్ మీదున్న పేపర్ వెయిట్ తీసుకుని బలంగా దాని మీదకు విసిరాడు.

క్షణంలో అది తప్పుకుని - ఓ సారి అతన్ని చూసి ఎర్రని నోరు తెరిచి చిన్నగా నవ్వి - తాపీగా మరో గోడమీదకు వెళ్ళి పోయింది పేపర్ వెయిట్ ముక్కలయి - గదంతా పెంకులు పడ్డాయి

అతన్ని విస్తుపోయి చూస్తూ చెల్లెలితో అంది మీనాక్షి.

"ఈ ఇంటిని ఏదో దుష్ట శక్తి ఆవహించినట్టు డౌట్‌నాకు. రేపు శాంతి చేయిద్దాం."

★ ★ ★ ★ ★ ★

కళామందిర్ సెంటర్లో-

కిళ్ళీషాప్ ముందు నిలబడి సినిమాకొస్తున్న ఆడవాళ్ళను చూపుల్తో తినేస్తూ నిలబడ్డ మన్మథరావ్-

"నమస్తే గురూగారూ" అన్న మాట విని విసుగ్గా తల తిప్పాడు.

రిక్షా సీట్‌మీద ఓ కాలు ఎత్తిపట్టి - విలాసంగా కూర్చుని బీడీ తాగుతూ నవ్వుతున్నాడు 'నాగులు'

వాణ్ణి చూసే సరికి ప్రాణం లేచొచ్చింది మన్మథరావ్‌కి.

హడావుడిగా దగ్గరకెళ్ళి-

"ఏవిట్రా విశేషాలు?" అన్నాడు.

"మా దగ్గరేముంటాయండీ- ఒకటే ఇసేసం." అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

రిక్షా నాగులు ఆ ఊళ్ళో రవణమ్మ కంపెనీకి ఏజెంట్.

"ఏ ఊరట?" ఆత్రుతగా అడిగాడు మన్మథరావు.

"రాజమండ్రి గురూగారూ- అంతా ఫేమిలీ ట్రిప్పు".

"బాగుందా?" పెదవులు తడుపుకుంటూ అడిగాడు.

"సెక్కెర బొమ్మండి బాబూ- ఈ ఊళ్ళోకి మద్దేనం ఒచ్చింది- రవణమ్మ మొదటి ఛాన్స్ మీకే ఇయ్యాలని సెప్పిరమ్మంది-"

"పదపద ఇంకాలస్సిం దేనికి?"

హడావుడిగా రిక్షా ఎక్కాడు మన్మథరావు.

నాగులు రాజమండ్రి బొమ్మ రూపురేఖా విలాసాలు రసవత్తరంగా వర్ణిస్తుంటే - పొందబోయే అనుభవాన్ని టెక్నికలర్‌లో ఊహించుకుంటూ సంబరపడి పోతున్నాడు మన్మథరావ్.

రిక్షా నాలుగు వీధులు తిరిగి గాంధీపేట కొచ్చి - ఓ డాబా ముందాగింది.

వాచీ చూసుకున్నాడు మన్మథరావు.

ఏడు కావొస్తోంది.

నాగులుకో పది రూపాయలిచ్చి - లోపలి కెళ్ళాడు.

వరండాలో నవారు మంచం మీద గోడకు ఆనుకుని కూర్చుని తమలపాకులు వేసుకుంటున్న రవణమ్మ మన్మథరావుని చూసి-

"రండి బాబూ రండి. మమ్మల్ని బొత్తిగా మర్చిపోయారు...." అంది. యాభైఏళ్ళ వయస్సులో పుష్టిగా - తెల్లగా- మెడనిండా బంగారు నగలతో చేతులనిండా బంగారు గాజులతో వెలిగిపోతున్న ఆమెను చూసి-

"దొంగ ముండ! బాగా సంపాదించేస్తోంది..." అనుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"ఓ గంట క్రితమే రాజమండ్రి ఎయిర్ బస్‌లో వచ్చి - విజయవాడ దిగి ఈడ కొచ్చింది..." అందామె.

ఆశ్చర్యంతో మన్మథరావ్ కళ్ళు పెద్దవయ్యాయి.

వెధవ బ్రతుకు! ఆకాశంలో పిట్టలా ఎగిరిపోయేటప్పుడు తప్ప విమానాన్ని కనీసం కిలోమీటర్ దూరం నుంచి కూడా చూడలేదు తను.

"ఏవన్నా తెప్పించ మంటావా?" నవ్వుతూ అడిగింది.

ఎయిర్ బస్‌లో వచ్చినమ్మాయికి వెధవ టీ నీళ్ళతో మర్యాదివ్వడం సముచితం అనిపించక జేబులోంచి ఓ యాభై తీసి ఆమెకిస్తూ-

'ఓ హాఫ్ తెప్పించు-" అన్నాడు

యాభై నోటు అందుకుని-

"నువ్వెళ్ళు బాబూ - నేను పంపిస్తాను-" అంది రవణమ్మ.

లేచి నిల్చున్నాడతను. పర్స్ తీసి వందనోటిస్తూ అన్నాడు.

"ఈ రాత్రంతా ఉంటాను-"

"మంచిది బాబూ- మరో వందియ్యి-" అందామె.

"ఎప్పుడిచ్చేది వందేగా?" ఆశ్చర్యంగా అన్నాడతను.

"అమ్మాయిని చూశాక ఆ మాటను! మామూలు ఆర్టీసీ బస్ ట్రిప్పు కాదు. ఎయిర్ బస్-" అందామె

"అవునవును- ఎయిర్ బస్-" గొణుక్కుంటూ మరో వందిచ్చి డాబా మెట్లు ఎక్కి - పైనున్న చిన్నగది ముందు నిల్చుని తలుపు తట్టాడు

కొన్ని క్షణాలనంతరం తలుపులు తెరుచుకున్నాయి-

అతని కళ్ళు చెదిరాయి-

నోరు తెరిచి అలాగే చూస్తుండి పోయాడు

"పాతిక- ముప్ఫై ఏళ్ళ మధ్యలో తెల్లగా- అందంగా- శిల్పంలా ఉంది- నీలి రంగు చీరె మీద అదేరంగు జాకెట్ వేసుకుని నవ్వుతూ నిలబడి ఉందామె

"లోపలికి రండి...." అంది.

కలలో మనిషిలా లోపలి కొచ్చాడు మన్మథరావు.

కిలకిలా నవ్విందామె-

ఆశ్చర్యంగా చూశాడు మన్మథరావు.

"అదేం అలాగుండి పోయారు? మాటలు రావా?"

అతని క్రాఫ్‌ను సవరిస్తూ గోముగా అడిగింది.

వెర్రెత్తి పోయాడతను. ఇన్నేళ్ళ సర్వీసులో - ఇలాంటి అపరంజి బొమ్మను చూడ్డం ఇదే ప్రథమం అనుకుంటే - బాగా చదువుకున్న దానిలా- ఎంత చక్కగా మాట్లాడుతోంది?

"నీ అందం చూసి నోరు పడిపోయింది-" చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"నోరే అయితే పర్లేదు- రక్షించారు" అంది

కొంటెగా అతన్ని చూస్తూ-

ఆమె చేయి పట్టుకుని లాగాడతను విసురుగా వచ్చి అతని ఒళ్ళో పడింది

"నీ పేరేవిటి?" అడిగాడతను

"నీకు నచ్చిన పేరుతో పిల్చుకోవోయి మగడా!" అందామె మెడ చుట్టూ చేతులేసి. తలుపు చప్పుడయింది

ఆమె లేచి తలుపు తీసింది.

పదేళ్ళ కుర్రాడు విస్కీ సీసా- చిప్స్- పల్లీ పొట్లాలు ఇచ్చి వెళ్ళిపోయాడు

ఆమె ఆశ్చర్యంగా-

"అరె! నా బ్రాండ్ మీకెలా తెలుసు?" అంది

"మనిద్దరం ఒకే బ్రాండ్ మనుషులం గదా- రుచులు కూడా ఒకటే!" అన్నాడు ఆమె బాటిల్ మూత తీసి- టీపాయ్ మీద రెడీగా ఉన్న గ్లాసుల్లో పోసి- ఒక గ్లాసులో నీళ్ళు పోసి అతని కందించింది. నీళ్ళు కలపని గ్లాసుని తాను తీసుకుని

"చీర్స్!" అంది

"చీర్స్! అదేవిటి? నీళ్ళు కలుపుకోవా?"

ఆమె ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీ చేసి నవ్వుతూ-

"మందునైనా- మగాడినైనా- ఏ ముసుగూ లేకుండా తాగడం నాకలవాటు"

అతను సగం గ్లాసు ఖాళీ చేసి పక్కన పెట్టాడు

ఆమె మరో లార్జ్ పోసుకుని అలాగే తాగింది

ఆ తర్వాత-

బద్ధకంగా రెండు చేతులూ పైకెత్తి ఒళ్ళు విరుచుకుంది.

పైట జారిపోయి-

నిండుగా వున్న ఆమె అందాలు లో నెక్ జాకెట్లోంచి తొంగుతూ కనిపించడంతో- ఉద్రేకంతో లేచి- ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు ఆమె అతని మెడమీద చెయ్యేసి అతని ముఖాన్ని తన ముఖం దగ్గరకు లాక్కుని- అతని కింది పెదవిని తన ముని పంట నొక్కి వదిలింది

ఆమె నడుము మీద అందంగా పడిన మడతను చూపుడు వేలుతో రాస్తూ- ఆమె చెంప మీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు

"అబ్బా ." బాధగా- చిరుకోపంగా చూసిందతన్ని.

వెంటనే మాసిన గడ్డంతో ఉన్న అతని చెంపను కసుక్కున కొరికింది

"అమ్మా" అన్నాడతను

పక్కున నవ్విందామె

అతను పట్టరాని ఉద్రేకంతో ఆమె దగ్గరకు రాబోయాడు

"వన్ మినిట్!" అందామె

ఆగిపోయాడతను

ఆమె వంగి- బాటిల్లో మిగిలిన ద్రవాన్ని గ్లాసుల్లో పోసి క్షణంలో గ్లాసు ఖాళీ చేసి టీపాయ్ మీద పెట్టింది. మన్మథరావ్ కూడా తన గ్లాసు ఖాళీ చేశాడు.

ఆమె అతన్ని చూసి రెచ్చగొడుతున్నట్టుగా నవ్వింది



మన్మథరావిక ఆగలేకపోయాడు

మరో నిముషంలో ఆమెను వివస్త్రను చేశాడు

చెలరేగే నాగపాములా ఉందామె

"ఐ లవ్ యు ' అతని చెవి కొరికి నెమ్మదిగా అంది

పిచ్చెక్కిపోయింది మన్మథరావుకి.

నాటు సరసం- మోటు శృంగారం- అలవాటయిన అతనికి- ఇంగ్లీష్‌లో ప్రేమిస్తున్న ఈ ఎయిర్‌బస్ అమ్మాయి- అపురూపంగా అనిపించి ఉన్న పళంగా ఆమెను రెండు చేతుల్తో ఎత్తి బెడ్ మీద పడేశాడు

తెల్లటి దుప్పటి మీద-

నల్లటి కురులు బెడ్ అంతా పరుచుకోగా ఆ కురుల మధ్య- వికసించిన ఎర్రకలువ పువ్వులా ఉందామె ముఖం

కొన్ని క్షణాలు అలాగే-

ఓ అద్భుతాన్ని చూస్తున్నట్టు- ఆమెనలాగే చూస్తుండిపోయాడు

ఆ తర్వాత-

అమాంతం బెడ్ మీదకు దూకాడు

సరిగ్గా అప్పుడు-

తలుపు చప్పుడయింది

ఉలిక్కిపడ్డాడతను అతని చేతులు పట్టు తప్పాయి

"ఎవరూ?" గుసగుసలాడిందామె

"ఎవడో- ఎదవ నాకొడుకు-" కసిగా లేచి తలుపు తీయబోతున్న అతన్ని వారించి- తలుపు దగ్గరకొచ్చి అంది

"ఎవరూ?"

"తలుపు తీయవే బొమ్మా! తెలుస్తుంది"

ఆమె చప్పున అతనివేపు తిరిగి-

"చచ్చాం- పోలీసులు"- అంది.

వేయి వోల్టుల ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్టు అదిరిపడ్డాడతను.

ఆమె హడావుడిగా చీరె కట్టుకుంది.

"తీయరా బాడకోవ్... తలుపు తీయ్. ."

కర్కశంగా వినిపించింది బయటి కంఠం.

వణుకుతున్న చేతుల్తో- నెమ్మదిగా తలుపు తీశాడతను. ఖడ్గ మృగానికి యూనిఫాం వేసినట్టున్నాడు యస్ ఐ ఎలుగుబంటి ఎర్ర టోపీలు పెట్టుకున్నట్టున్నారు కానిస్టేబుల్స్. ఆ ఊరికి కొత్త ఎస్. ఐ వచ్చాడని విన్నాడు గానీ .. వాడికే తాను దొరుకుతానని ఊహించని మన్మథరావ్-

గభాల్న వెళ్ళి అతని కాళ్ళ మీద పడి-

"తప్పయిపోయింది సార్! ఒక్కసారికి క్షమించండి"- అన్నాడు

ఎడమ చేత్తో ఎలుకపిల్లను తోక పట్టుకుని పైకెత్తినట్టు అతని పర్స్ పట్టుకుని పైకెత్తాడు యస్ ఐ

"హు!" అన్నాడు గంభీరంగా-

"ఈసారి క్షమిస్తే- మరోసారి మరో కంపెనీ కెళ్దామని నీ ఐడియా అంతేనా?"

"లేద్సార్- తప్పయిపోయింది సార్ ప్లీజ్ సార్ " ఏడుస్తున్నాడతను

కానిస్టేబుల్స్ రాజమండ్రి అమ్మాయిని తీసుకెళ్ళిపోయారు

యస్ ఐ అతన్ని నిలువెల్లా పరీక్షించాడు ఆ

తర్వాత చేతిలోని స్టిక్‌ను అతని వాచీ మీద పెట్టి-

"సిటిజనా?" అన్నాడు.

"అవున్సార్- ఇండియన్ సిటిజన్నే సార్! తప్పయింది ప్లీజ్ సార్ "

"షటప్! నీ వాచీ సిటిజెనా అని అడుగుతున్నాను" అన్నాడు యస్ ఐ.

"అవున్సార్" అన్నాడు బిక్క చచ్చిపోయి

"ఏదమ్మా చూద్దాం అత్తారు పెట్టిందేగా?" అన్నాడు యస్ ఐ.

ఏడుస్తూ తీసిచ్చాడు మన్మథరావ్ అది జేబులో వేసుకుని-

"ఆ ఉంగరం బావుందోయ్ అదీ అత్తారెట్టిందేనా?" అన్నాడు యస్ ఐ

అదీ తీసిచ్చాడు

"పర్స్ తీయమ్మా!"

పర్స్ ఇచ్చాడు

మోకాలి మీద స్టిక్‌తో ఒక్కటిచ్చి-

"ఎళ్ళరా ఎదవ నాకొడకా! మంచోణ్ణి కాబట్టి చొక్కా విప్పించలేదు గెటౌట్!" అన్నాడు

కుంటుకుంటూ బయటకు పరుగెత్తాడు మన్మథరావ్

* * * *

"సర్! ఎవరో ఎలక్ట్రిసిటీ లైన్‌మన్ అట మిమ్మల్ని చూడాలంటున్నాడు" ఫోన్‌లో సెక్రటరీ శైలజ కంఠం విని-

"రమ్మని చెప్పు" అన్నాడు ఆనందంగా స్వాగత్

మరుక్షణం లోనికి ప్రవేశించాడు లైన్‌మన్.

సన్నగా- పీలగా- పాతికేళ్ళుండవచ్చు ఖాకీ ప్యాంట్

## లవ్ గేమ్

మీద తెల్ల షర్ట్ టక్‌చేసి పాన్ నములూ స్వాగత్‌ని చూసి ఓ చెయ్యెత్తి-

"నమస్తే సాబ్" అన్నాడు.

"నమస్తే! కూర్చో... నీ పేరేవిటి?" అడిగాడు స్వాగత్.

"యాదగిరి సాబ్. దోస్తులంత 'యాదీ' అంటరు. మా ఆఫీస్‌ల 'గిరీ' అంటరు. ఎట్ల పిలిసిన నాకేం ఫరక్ పడదు సాబ్." నవ్వుతూ అన్నాడు.

"వెరీ గుడ్! నీతో ఓ చిన్న పని పడిందోయ్!" అన్నాడు స్వాగత్.

"సెప్పండ్రి" అన్నాడతను.

"మరేం లేదు. మా ఏరియాకి లైన్‌మన్ నువ్వే కదా? అంచేత ఈ రోజు సరిగ్గా ఏడున్నరకు మా ఏరియాలో రెండు నిముషాలు కరెంట్ తీసెయ్యాలి..."

యాదగిరి కళ్ళు పెద్దవయ్యాయ్.

"కరెంట్ తీసేయాల్నా- ఎందుకు సాబ్" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవసరం ఉంది- ఎంత? రెండు నిముషాలు- ఆ తర్వాత మళ్లీ కరెంట్ ఇచ్చెయ్"- అన్నాడు స్వాగత్.

"గట్లసేసుడు మా డూటీకి ఎగనెస్టు సాబ్- రూల్సు ఒప్పుకోవ్"- అన్నాడు యాదగిరి.

"నాకు తెలుసోయ్- ఎంత? రెండు నిముషాలే గదా?" అన్నాడు స్వాగత్-

"ఎందుకు సాబ్"- ఉత్సుకతతో అడిగాడతను.

"పనుందన్నానుగా?" చిరాగ్గా అన్నాడు స్వాగత్.

"ఏమైనా మర్డర్ గిట్ల సేయాల్నా?" రహస్యంగా ముందుకొంగి అడిగాడు

షాక్ తిని చూశాడు స్వాగత్.

అతను నవ్వుతూ-

"గట్లాంటిదేమైనా ఉంటే సెప్పండ్రి ఆ తర్వాత మళ్ళీ నేను పరేషాన్‌లో పడిపోతా"- అన్నాడు.

"ఛ! అలాంటిది కాదు చాలా చిన్న విషయం". అన్నాడు స్వాగత్.

"రూల్సొప్పుకోవ్ సాబ్!" అతనివేపు దొంగ చూపులు చూస్తూ అన్నాడతను.

"ఎంతోయ్. రెండు నిముషాలు! రూల్సు ఒప్పుకోవాలంటే ఏం చేయాలి?" అతని చూపులను అర్థం చేసుకుని అడిగాడు.

"జర కర్సయితది సాబ్!" అన్నాడతను నవ్వుతూ.

"మరామాట ముందుగానే ఏడవొచ్చుగా?" అని వో వంద రూపాయలు తీసిచ్చాడు. యాదగిరి వినయంగా దాన్ని అందుకుని లేచి నిలబడి-

"కరెక్ట్ టైం సెప్పండ్రి సాబ్!" అన్నాడు.

ఏడు ముప్ఫై నుంచి ఏడు ముప్ఫైరెండు వరకూ"-

"ఓ కే సాబ్ వస్తా!" అనేసి వెళ్ళిపోయాడు యాదగిరి

రిలాక్స్‌డ్‌గా కూర్చుని సిగరెట్ వెలిగించి విలాసంగా పొగ వదిలాడు స్వాగత్. తన మొదటి ప్రయత్నం వెధవ బల్లి మూలంగా ఫ్లాపయి రసాభాస అయింది సెకెండ్ ట్రైల్‌కి కావల్సిన అన్ని ఏర్పాట్లూ చాలా పకడ్బందీగా చేశాడు చివరకు లైన్‌మన్‌ని కూడా లైన్లో పెట్టేశాడు. ఈ రాత్రి ఏది ఏమైనా నవ్య తనను కౌగలించుకోవడం ఖాయం.

అప్పుడు గుర్తొచ్చిందతనికి!

మీనాక్షి!

ఉలిక్కిపడ్డాడు అవును ఆమె సంగతే మర్చిపోయాడతను ఈ రాత్రి ఆ రెండు నిముషాలు ఆమె ఇంట్లో ఉండకూడదు ఉంటే తన పథకం దెబ్బతినే ప్రమాదముంది

ఏం చేయాలి?

మరో సిగరెట్ వెలిగించాడు

సినిమాకు పంపిస్తే? ఊహు అప్పుడు నవ్య కూడా బయల్దేరుతుంది షాపింగ్‌కంటే- నవ్య వెళ్ళదన్న గ్యారంటీ లేదు

తీవ్రంగా ఆలోచించసాగాడు

మరో అయిదు సిగరెట్లు తగలేశాక వెలిగిందతనికి-

ఉత్సాహంతో ఫోనందుకుని ఇంటికి డయల్ చేశాడు.

అదృష్టం మీనాక్షే ఫోనందుకుంది

"మీకో శుభ వార్త వదినగారూ"- అన్నాడు స్వాగత్.

"చెప్పండి"-

"అక్కినేని నాగేశ్వర్రావుని చూస్తానన్నారు గదూ-"

"హవునవును హెప్పుడు చూపిస్తారు?"

# భీముడి శీలాన్ని శంకించిన జర్నలిస్టు



టి. వి. భీముడు శీలాన్ని ఒక మహిళా జర్నలిస్టు శంకించిందట. పిరికివాడు కావటంవల్లే ఏ అమ్మాయిని చేసుకొనే ధైర్యం లేక బ్రహ్మచారిగా వుండిపోయాడని అన్నదట ఆ జర్నలిస్టు.

చిత్ర రంగంలో ప్రవేశించే రోజుల్లోనే ప్రవీణ్‌కుమార్ పిరికివాడనే విషయం అందరికీ తెలుసునట. రవి నగాయిచ్ చిత్రం 'రక్ష'లో ప్రవీణ్‌కు తొలిసారిగా అవకాశం లభించింది. టి. వి. మహాభారత్ పుణ్యమా అని బాగా పేరు రావటంతో నిర్మాతలు ఎగబడుతున్నారట. నిర్మాతలు ఎగబడటం వరకు బాగానే వుంది. అమ్మాయిలు కూడా ఎగబడుతుండటంతో వాళ్ల బాధ తట్టుకోలేక పోతున్నాడట. ఈ అమ్మాయిల్లో 'హిడింబి'గా వేసిన అమ్మాయి కూడా వుందట. ఏం చూసి వీళ్లంతా ఎగబడుతున్నారో? ప్రతి రోజూ జాగింగ్‌కు జుహు బీచ్‌కి వెళ్లేవాడట కాని అమ్మాయిల బాధ తట్టుకోలేక మానేసాడట. అమ్మాయిలతో ఎప్పుడైనా, ఏదైనా 'చేదు' అనుభవం ఎదురైందేమో?!

ఆతృతగా అడిగింది మీనాక్షి ఆమె నాగేశ్వర్రావుకి వీరాభిమాని!

ఇంతవరకూ ఆయన నటించిన సినిమాలు తప్ప వేరే సినిమాలు చూళ్ళేదు

'ఈ రోజే వదినగారూ' సరిగ్గా సాయంత్రం ఆరు గంటలకు కారు ఎంగేజ్ చేసి వస్తుంది నాగేశ్వర్రావుగారింటికెళ్దాం ."

"ఒక్క నిముషం-" అని రెండు నిముషాల తర్వాత-

"అది రాదటండీ!" అంది దిగులుగా

హాయిగా నవ్వుకున్నాడు స్వాగత్ అతనికి కావలసింది కూడా అదే!

"మరేం చేద్దాం పోనీ ఓ పని చేయండి "

"చెప్పండ్చెప్పండి " అంది ఆతృతగా

"నేను సరిగ్గా ఆరుగంటలకు ఫ్రీ అవుతాను మనిద్దరం కలిసి వెళదాం"-

"థాంక్సండీ! అలాగే- మర్చిపోరుగా?" అంది

"లేదు కారొచ్చేసరికి రెడీగా ఉండండి" అని ఫోన్ పెట్టేసి వెంటనే శైలజని పిలిచాడు బాబ్డ్ హెయిర్‌తో- స్లీవ్‌లెస్ బ్లౌజ్‌తో సన్నగా నాజూగ్గా మెరుపు తీగెలా ఉన్న శైలజ ప్రవేశించి గ్రేషియస్‌గా నవ్వి అంది

"యస్ సర్!"

"సీ మిస్ శైలజా ఈవెనింగ్ మీకేమైనా ఎపాయింట్‌మెంట్స్ ఉన్నాయా?" ఆమె గుండె ఓ క్షణం లయ తప్పింది ఆశ్చర్యంగా చూస్తూ-

"నో సర్-" అంది-

"నువ్వో చిన్న హెల్ప్ చేయాలి-"

'విత్ ప్లెజర్ సర్-"

"ఈ రోజు సాయంత్రం ఆరున్నరకి- మా వదినగారొస్తారిక్కడికి ఆమెను అక్కినేని నాగేశ్వర రావు గారింటికి తీసుకెళ్ళాలి"-

ఆమె మాట్లాడలేదు.

"నాకు వేరే అపాయింట్‌మెంట్ ఉంది పాపం ఆమె చాలా ఇంట్రెస్ట్ ప్లీజ్ " అన్నాడతను

"తప్పకుండా సర్ అలాగే తీసుకెళ్తాను అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేశారా?" అందామె

"లేదు అది కూడా నువ్వే చెయ్ ప్లీజ్" అన్నాడతను

"అలాగే సర్ "

"థాంక్యూ మిస్ శైలజా' '

"యు ఆర్ వెల్‌కం సర్!" అని శైలజ వెళ్ళిపోయింది

ఓ పది నిముషాలయాక శైలజ ఫోన్ చేసి అక్కినేని గారితో అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేశానని చెప్పింది-

ఫోన్ పెట్టేసి-

సిగరెట్ వెలిగించుకుని- సీలింగ్‌ను చూస్తూ అనుకున్నాడు

"నవ్యా డియర్- ఈ రాత్రి నిన్ను నా నుంచి ఆ దేవుడు కూడా రక్షించలేడు చాలెంజ్!"

**(ఇంకావుంది)**

# యువతా! కవితా!

## కాలం !

'ఎండ' కొంత కాలం
'వాన' కొంత కాలం
'చలి' కొంత కాలం
ఆకలిదప్పులు కలకాలం!

-శాళ్ల గోవిందరావు

## ఓర్పు-నేర్పు

మనిషి-
ఆనందసమయాన'అబ్బా' అని-
కష్టసమయాన'అమ్మా'అని-అంటాడు!
భరించే ఓర్పు అమ్మకే వుందిమరి!
బ్రతుకు నేర్పు నాన్నకే వుంది సరి!

-పచ్చిగోళ్ల సుధ

## భారం

కలలుకనే ప్రతివారూ...
కలలలోనే ఉంటారు.
గళం విప్పలేరు.
చేతకలం పట్టి
కదం త్రొక్కలేరు.
నేను కూడా ఎంతో కాలం
కలల అలల్లోనే గడిపాను!
ఇప్పుడిప్పుడే కనులు విప్పి,
ప్రపంచాన్ని చూస్తున్నా
బడుగు జీవి బ్రతుకులోన,
భవితలేని యువతలోన
నిండుతున్న
నైరాశ్యం ఛాయలని
పరికిస్తే...
కనుల నిండ నీరునిండి
దొర్లి నేల మడుగు కట్టె!
భరతమాత స్థితిని చూస్తే
భారమాయె నా హృదయం!
అమిత భారమాయె హృదయం

-నందిగామ మురళీకృష్ణ

# ఎవరు దెయ్యం?

ఇ.టి.రామారావు





పృ్యాన్ పోస్ట్‌లో వచ్చిన వుత్తరాలు తెచ్చి నా టేబిల్ మీద పెట్టి వెళ్ళాడు.

ఉత్తరాలను చేతిలోకి తీసుకొని ఒక్కొక్కటే చింపి చదువసాగాను. ఎక్కువ భాగం వుత్తరాలు సంతాప సందేశాలే! స్వరూప మరణానికి తమ విచారాన్ని వ్యక్తం చేస్తూ, నాకు తమ సంతాపాన్ని తెలియచేస్తూ దూరపు బంధువులు; స్నేహితులు వ్రాసిన వుత్తరాలే వున్నాయి ఎక్కువగా. గోడకు తగిలించి వున్న క్యాలెండర్ వైపు చూశాను. తారీఖు పది! అంటే స్వరూప మరణించి యీ రోజుకి సరిగ్గా నెలరోజులు!

ఉత్తరాలన్నీ టేబిల్ డ్రాయర్లో వేసి కుర్చీలో వెనక్కి వాలి సిగరెట్ తీసి ముట్టించాను గోడకు తగిలించి వున్న స్వరూప ఫోటో వైపు తదేకంగా చూస్తూ వుండిపోయాను చాలా పెద్ద సైజు ఫోటో అది. ప్రత్యేకంగా ఆర్డరు యిచ్చి తయారు చేయించి ఆఫీసులో నా రూంలో తగిలించాను చనిపోయిన స్వరూపను అనుక్షణం నా కళ్ల ముందు వుంచుకోవాలన్న తాపత్రయమో, స్వరూపపై నాకు గల ప్రేమాభిమానాలను ఆఫీసులో ప్రదర్శించుకోవాలనే ఆరాటమో తెలీదు కాని ఆ ఫోటో అక్కడ చేరిపోయింది

స్వరూప రూపం ఫోటోలో నుండి నవ్వుతున్నట్లుగా వుంది పెద్ద అందమైన రూపం కాదు స్వరూపది. ఇంకా నిర్మొహమాటంగా చెప్పాలంటే అందవిహీనురాలనే చెప్పాలి! కాని అమోఘమైన తెలివితేటలు! డిగ్రీ ఫస్ట్ క్లాస్‌లో పాసయిన తర్వాత తండ్రి నడిపిస్తున్న వ్యాపారాన్ని తన చేతుల్లోకి తీసుకొంది చిన్నపిల్లల ఆటవస్తువులు తయారు చేసి విక్రయించే వ్యాపారం అది!

స్వరూప యాజమాన్యంలో, అజమాయిషీలో ఆ వ్యాపారం దినదిన ప్రవర్ధమానమైంది వివిధ రాష్ట్రాలకు ఎగుమతి చేసే స్థాయికి పెంపొందించింది వ్యాపారాన్ని లక్షల మీద వ్యాపారం నడుస్తూ వుంది మేనేజింగ్ డైరెక్టర్ స్థానానికి ఎదిగిన స్వరూపను చూసి తండ్రి గర్వపడేవాడు

అలాంటి స్వరూప ప్రేమను పొందగలిగాను నేను కాలేజీలో కొద్దిపాటి పరిచయం ఆమెతో! ఉద్యోగాల వేటలో ఒకసారి కాకతాళీయంగా ఆమె ఫ్యాక్టరీకి వచ్చాను ఆప్యాయంగా పలకరించడమే కాకుండా ఉద్యోగం యిచ్చింది కాలం మా యిద్దరి మధ్య అనుబంధాన్ని పటిష్టం చేసింది. స్వరూప నన్ను చాలా గాఢంగా ప్రేమించింది తండ్రిని ఒప్పించి నన్ను పెళ్లి చేసుకుంది

దురదృష్టం! పెళ్ళయి రెండేళ్ళు నిండక మునుపే ప్రమాదవశాత్తు కారు బ్రేకులు ఫెయిలై యాక్సిడెంటులో మరణించింది!

ఇంటర్‌కమ్ బజర్ మ్రోగిన శబ్దంతో ఆలోచనల నుండి తేరుకున్నాను

"యస్!" అన్నాను రిసీవర్ చేతుల్లోకి తీసుకొని

"మీ కోసం లాయర్ గిరిధర్‌గారు వచ్చారు" చెప్పింది ఆపరేటర్!

"ప్లీజ్ సెండ్ హిమ్ యిన్!" చెప్పాను

మరి కొద్దిసేపట్లో రూం లోపలికి వచ్చాడు లాయర్ గిరిధర్

"కూర్చోండి" అని చెప్పి బజర్ నొక్కాను. ప్యూన్ రాగానే కూల్ డ్రింక్స్ తెమ్మని చెప్పి పంపాను.

గిరిధర్ తన చేతుల్లో వున్న పేపర్లను నా ముందు వుంచాడు.

"మిస్టర్ శ్రీకాంత్! స్వరూప గారి పేరుతో వున్న యీ ఫ్యాక్టరీ, యిందులోని షేర్లు, మిగతా కంపెనీలలో వున్న ఆవిడ షేర్లు అన్నీ చట్ట ప్రకారం మీకు యీ రోజు నుండి సంక్రమించాయి. ఆ విధంగా కోర్టు తీర్మానాలు యివి. ఇక యీ ఫ్యాక్టరీకి మీరు సర్వాధికారి" చెప్పాడు గిరిధర్!

ఆ వార్త నాకేమీ సంతోషం కలిగించలేదు. ఎందుకంటే అవి ఎలాగూ నా స్వంతం అవుతాయని నాకు తెలుసు భార్య పోయాక ఆవిడ పేరుతో వున్న ఆస్తిపాస్తులు భర్తకు గాక మరెవరికి సంక్రమిస్తాయి? పిల్లలు ఎలాగూ లేరు

నా ముఖ కవళికలను గమనిస్తున్న గిరిదర్ అన్నాడు

"భార్య పోయిన విచారం నుండి మీరింకా పూర్తిగా కోలుకున్నట్లు లేదు ఎనీహౌ ఆవిడ లేని లోటు కన్పించకుండా యీ ఫ్యాక్టరీని అంత పటిష్టంగా నిర్వహించవలసిన బాధ్యత మీది!"

"ప్యూన్ కూల్ డ్రింక్స్ తెచ్చాడు గిరిధర్ కూల్ డ్రింక్ త్రాగుతూ, "మీ శ్రీమతి ఆ రోజు డ్రైవ్ చేస్తున్న కారు బ్రేకులు ఫెయిల్ కావడం మూలాన యాక్సిడెంటుకి గురయి ఆవిడ మరణించిందని నిర్ధారించి ఫైల్ క్లోజ్ చేసారని ఇన్‌స్పెక్టర్ మూర్తి చెప్పాడు" అన్నాడు.

"నేనేమీ మాట్లాడలేదు గిరిధర్ లేచి నిలుచున్నాడు

"ఎనీహౌ మరొక్కసారి మీకు నా సానుభూతి

**దెయ్యాల కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ!**

ఆవిడ లేని లోటు మీకు భరింప శక్యం కాదనుకుంటాను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"థాంక్యూ మిస్టర్ గిరిధర్!" మనసులోనే అనుకున్నాను. ఎందుకంటే అతను రెండు శుభవార్తలు చెప్పివెళ్లాడు. స్వరూప పేరుతో వున్న ఆస్తిపాస్తులన్నీ నాకు సంక్రమించాయనే వార్త ఒకటి, స్వరూప మరణాన్ని యాక్సిడెంటుగా నిర్ధారించి పోలీసులు కేసు మూసి వేసారని మరొకటి! అప్పటి వరకు మనస్సులో దాచుకున్న ఆనందం ముఖంలోకి వచ్చి చేరింది "ఈ ఆనందాన్ని వెంటనే వెళ్ళి సునందతో పంచుకోవాలి" అనుకుంటూ సీట్లో నుంచి లేచి బయటికి నడిచాను. తలుపు దగ్గర ఆగి వెనక్కి తిరిగి స్వరూప ఫోటో వంక కసిగా చూసాను.

"చూసావా స్వరూపా! నువ్వు చేస్తే తప్పు నాకు ఆనందం మిగల్లేదు" అనుకుంటూ బయటికి నడిచాను.

కారు దిగి యింట్లోకి నడుస్తుండగా పనిమనిషి రంగమ్మ ఎదురొచ్చింది.

"హైదరాబాదు నుండి వందనమ్మ గారు, మరొకాయన కలిసి వచ్చారండి. ఏదో పని మీద బైటికెళ్ళారు. ఇంకో గంటలో వస్తామని చెప్పమన్నారు" అన్నది.

నా భృకుటి ముడి పడింది. 'వందన ఎందుకొచ్చినట్టు? ఆమెతో పాటు వచ్చిన యింకో వ్యక్తి ఎవరు' అనుకుంటూ బెడ్‌రూంలోకి నడిచాను. వందన స్వరూప చెల్లెలు. హైదరాబాదు ఉస్మానియా యూనివర్సిటీలో రీసెర్చి స్కాలర్! స్వరూప చనిపోయినప్పుడు వచ్చింది అక్కంటే పంచప్రాణాలు వందనకు. ఆమె పోవటం వందనకు పెద్ద షాక్! చాలా బాధ పడింది. నాలుగు రోజులుండి వెళ్ళిపోయింది అప్పుడు ఆమె వెళ్లేటప్పుడు నేను చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి నాకు.

"వందనా! మీ అక్కంటే నీకు ఎంత అనురాగమో నాకు తెలియని విషయం కాదు. ఆవిడ పోయినంత మాత్రాన యీ యింటితో నీకు సంబంధం తెగిపోయిందని ఎంత మాత్రం అనుకోవద్దు నీకు ఎలాంటి అవసరం వచ్చినా మీ బావ బ్రతికే వున్నాడన్న విషయం గుర్తు పెట్టుకో!" గొంతులో దుఃఖాన్ని ధ్వనింప చేస్తూ, ముఖంలో ఆవేదనను ప్రతిఫలింప చేస్తూ పలికాను

బహుశా ఏదో పనిమీద యీ వూరొచ్చివుంటుంది. ఇక యీ రోజు సునంద యింటికి వెళ్లటానికి కుదరదు వందనను యింట్లో పెట్టి తను రాత్రంతా సునంద యింట్లో గడిపితే ఆమె అపార్థం చేసుకునే ప్రమాదం వుంది "అక్క చనిపోయి నెల రోజులయిందో లేదో బావ ఎక్కడెక్కడో తిరుగుతున్నాడని ఆమె అనుకోకూడదు"

డ్రస్సు మార్చుకొని బెడ్‌పై వాలిపోయాను. పర్సులో నుండి సునంద ఫోటో తీసి పెదాలపై ఆనించుకున్నాను. అద్భుతమైన సౌందర్య రాశి సునంద. వెరీ స్మార్ట్ గర్ల్!

# ఎవరు దెయ్యం?

తొమ్మిది కావస్తుండగా వచ్చింది వందన తనతో పాటు మరొక యువకుడు వున్నాడు.

"ఇతను ఫణికుమార్ అని మా కజిన్ బ్రదర్ బావా! భిలాయి స్టీల్ ఫ్యాక్టరీలో కెమికల్ యింజనీర్గా జాబ్ చేస్తున్నాడు. అక్క పోయిన విషయం తెలిసి వచ్చాడు" అన్నది అతన్ని నాకు పరిచయం చేస్తూ. ఆ యువకుడు నాకు తన సానుభూతిని తెలియ చేశాడు. ఆ తర్వాత అందరం కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు పూర్తి చేశాము వందన తన రీసెర్చి వర్క్‌లో భాగంగా ఎవరో ప్రొఫెసర్‌ని కలవాలని యీ వూరొచ్చినట్టు, రెండు మూడు రోజులలో తిరిగి వెళ్ళిపోతానని చెప్పింది వాళ్ళిద్దరికీ క్రింద గదుల్లో పక ఏర్పాటు చేయమని పని మనిషితో చెప్పి మేడ మెట్లు ఎక్కి మా బెడ్ రూంలోకి చేరుకున్నాను.

బెడ్ మీద పడుకొని టీపాయ్ మీదున్న ఫోటో ఫ్రేం చేతుల్లోకి తీసుకున్నాను నేను, స్వరూప కలిసి తీయించుకున్న ఫోటో వుంది అందులో. ఎంతో అన్యోన్య దంపతులు అనిపించేలా వుంది ఆ ఫోటో! ఎప్పుడో పెళ్లయిన కొత్తల్లో తీయించుకున్న ఫోటో అది! ఆ ఫోటోలోని స్వరూప రూపాన్ని తదేకంగా చూస్తూ వికృతంగా నవ్వుకున్నాను.

"ఇంకొద్ది రోజుల్లో నీ స్థానంలో సునంద వుంటుందిస్వరూపా! చచ్చిపైలోకంలో వున్నావే కాని నేను సునందను పెళ్లి చేసుకోవటం చూసి మరీ ఏడుస్తావు. బ్రతికినంత కాలం నన్ను నరకయాతన పెట్టినందుకు నీకు నేను విధిస్తున్న శిక్ష యిది" అనుకుంటూ ఫోటోను తీసి టీపాయ్ మీద పెట్టాను సునందను మనసులో నింపుకొని నిద్రకు వుపక్రమించాను

హఠాత్తుగా నిద్ర మెలకువ వచ్చింది. గది చీకటిగా వుంది. ఫ్యాన్ కూడా తిరగటంలేదు.




'కరెంటు పోయింది కాబోలు' అనుకుంటూ రిస్ట్ వాచీ చూశాను. రేడియం డయల్ పన్నెండు చూపించింది. అప్పుడు వినిపించింది నా చెవులకు సన్నని ఏడుపు. ఎవరో స్త్రీ వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దం. ఆశ్చర్యంతో లేచి నిలుచున్నాను. క్రమంగా ఆరోదన తీవ్రస్థాయికి చేరుకుంటున్నది. ఎవరు ఏడుస్తున్నది? వందనా? చనిపోయిన అక్క జ్ఞాపకాలతో విలపిస్తున్నదా? చెవులు రిక్కించి విన్నాను. ఆ ఏడుపు క్రింద నుంచి కాదు. ఇక్కడే – నా గదిలోనే ఏడుస్తున్న శబ్దం. కళ్ళు చిట్లించి చూశాను. ఏమీ కనిపించటంలేదు. గుండెల్లో సన్నగా భయం ప్రవేశించింది ఆ గొంతు అచ్చం స్వరూప గొంతులాగావుంది. భయంతో నా శరీరంలో వణుకు ప్రారంభమైంది అనుమానం నివృత్తి చేసుకుందామని తలుపు తీసి మెట్లు దిగటం ప్రారంభించాను. ఆశ్చర్యం! క్రింద హాల్లో లైటు వెలుగుతూనే వుంది. మరి నాగదిలో కరెంటు ఎందుకులేదు? ఆలోచిస్తూ క్రిందికి చేరుకొని కిటికీ గుండా వందన పడుకొని వున్న గదిలోకి తొంగి చూశాను బెడ్ మీద నిశ్చలంగా నిద్రిస్తున్నది వందన అయితే ఏడుస్తున్నది వందన కాదన్నమాట. పనిమనిషి రంగమ్మ వంటగది బయట చాపపై పడుకొని ఆదమరిచి నిద్రపోతున్నది ఇంట్లో వున్నది యిద్దరే ఆడవాళ్ళు. ఇద్దరూ నిద్రపోతున్నారు. మరి నేను విన్న ఆ ఏడుపు ఎవరిది? స్వరూపదా? ఛీఛీ! ఏమిటి తను యింత మూర్ఖంగా ఆలోచిస్తున్నాడు? చనిపోయిన స్వరూప ఏడుపు తనకు వినిపించటం ఏమిటి? ఏదో భ్రమలో తనకు అలా అనిపించి వుంటుంది అనుకుని తిరిగి మెట్లు ఎక్కి నా రూంకి చేరుకుంటూ వుండగా భళ్ళున ఏదో క్రింద పడినట్లు శబ్దం వినిపించింది ఆ శబ్దం నా రూంలో నుండి అనిపించటంతో హడావిడిగా రూంలోకి ప్రవేశించాను. రూమ్‌లో లైటు వెలుగుతూవుంది ఫ్యాన్ తిరుగుతూవుంది టీపాయ్ మీదున్న ఫోటో ఫ్రేంక్రింద పడి అద్దం బ్రద్దలయివుంది.

"ఎలాక్రింద పడింది యిది? బలమైన గాలి కూడా రావటం లేదు. అయితే ఏ పిల్లినో నెట్టివుండాలి" అనుకుంటూ బెడ్‌పై వాలిపోయాను. ఆ రాత్రి నాకు నిద్ర కరువైంది. మళ్ళీ ఆ ఏడుపు వినిపిస్తుందేమోనని చాలాసేపు ఆలకించాను కాని వినిపించలేదు

* * * * * * *

మరుసటి రోజు సాయంత్రం ఫ్యాక్టరీ నుండి నేరుగా సునంద యింటికి వెళ్లాను రాత్రి పదింటివరకు ఆమెతో ఉల్లాసంగా గడిపాను మాటల సందర్భంలో రాత్రి జరిగిన అనుభవాలను ఆమెతో చెప్పి, "ఆ గొంతు అచ్చం స్వరూప గొంతులాగే వుంది. ఎంత వెదికినా ఎవరు ఏడిచిందీ తెలిసి రాలేదు. పైగా నేను రూంలో వుండగా కరెంటు లేకపోవటం, క్రింది నుంచి పైకి రాగానే గదిలో కరెంటు వుండటం, ఫోటోఫ్రేం దానంతట అదే క్రిందపడి పగిలిపోవటం చాలా విచిత్రంగా

అనిపించింది. నిజం చెప్పాలంటే కొద్దిగా భయపడ్డాను కూడ" అన్నాను.

సునంద పకపకానవ్వింది.

"ఒకవేళ మీ ఆవిడ చచ్చి దెయ్యమై వచ్చిందేమో!" అన్నది ఆమె తమాషాకు ఆ మాట అన్నప్పటికీ నాకెందుకో ఆవూహ భయంకరంగా అనిపించింది. స్వరూప దయ్యమై నన్ను సాధించబోతున్నదా? తను బ్రతికినంత కాలం, నాకు సుఖం లేకుండా చేసింది. చచ్చికూడా నాకు సుఖం లేకుండా చేయబోతున్నదా?

"ఇంతకీ మన పెళ్ళెప్పుడు డియర్!" సునంద నన్ను గారంగా అల్లుకుపోతూ అడిగింది

"ఆ తొందరే వద్దన్నాను. పెళ్లి కాలేదని తప్ప నీకు ఏం తక్కువ చెప్పు! అయినా భార్య పోయి నెల దాటిందో లేదో అప్పుడే పెళ్ళికి సిద్ధపడితే ఏం బావుంటుంది చెప్పు! కొంత కాలం గడవనీ!" అన్నాను

"మీ ఆవిడ దయ్యమై వచ్చి మన పెళ్లి జరగకుండా చేస్తుందేమో! ఆవిడ బ్రతికుండగా మీరు నన్ను కలుసుకోవడానికి ఎన్ని యిబ్బందులు పడేవారో గుర్తుందో కదూ!" కవ్విస్తూ అన్నది సునంద. ఆ మాట నిజమే! స్వరూప బ్రతికుండగా నాపైన ఎంత నిఘా, ఎన్ని ఆంక్షలు! ఆస్తులు, బ్యాంకి అకౌంట్లు అన్నీ తన పేరు మీదుగా వుంచుకొని నన్ను ఎంతగా బాధించింది! సుఖాలకు, జల్సాలకు అలవాటు పడిన నన్ను ఎన్ని కట్టుదిట్టాలలో పెట్టాలని ప్రయత్నించిందో! ముఖ్యంగా నేను సునందతో కలిసి తిరుగుతున్నానని గ్రహించి నప్పటి నుండీ పగబట్టిన పాము అయింది

ఎలాగైతేనేం స్వరూప పీడ విరగడయి పోయింది

సునంద దగ్గర శలవు తీసుకొని కారెక్కి యింటికి బయలు దేరాను. సన్నగా వర్షం చినుకులు పడుతున్నాయి రోడ్డు మసక మసకగా వుంది వైపరు వేశాను పనిచేయటం లేదు. ఆశ్చర్య పడ్డాను ఇందాక వచ్చేటప్పుడు పనిచేస్తున్న వైపర్లు యిప్పుడు ఎందుకు పనిచేయలేదో అర్ధం కాలేదు సునంద అన్నట్లు స్వరూప ఆత్మ నన్ను వెంటాడుతున్నదా? అన్ని విధాలుగా నన్ను యిబ్బంది పెట్టాలని, బాధించాలని ప్రయత్నిస్తూ వున్నదా?

ఇంటికి చేరాను పనిమనిషి రంగమ్మ తలుపు తీసింది

"వందన, ఫణికుమార్ మేలుకొని వున్నారా? అడిగాను. వాళ్ళు మేలుకొని వుంటే యింత రాత్రి వరకు నేను బయట తిరిగి రావడం చూస్తే బావుండదనిపించి అడిగాను

"ఇప్పటి వరకు మీ కోసం చూసి యిప్పుడే నిద్రపోయారు బాబూ!" చెప్పింది రంగమ్మ 'థాంక్ గాడ్' అనుకున్నాను.

భోజనం అక్కర్లేదని రంగమ్మతో చెప్పి మేడ మెట్లెక్కి నా బెడ్‌రూంకి చేరుకున్నాను. డ్రస్సు మార్చుకొని లైటు ఆర్పి బెడ్ లైటు వెలిగించి పరుపుపై వాలిపోయాను. బాగా అలిసి పోయి వుండటంచేత వెంటనే నిద్ర పట్టింది!

"ఏమండీ!"

చెవి దగ్గర ఎవరో మెల్లగా పిలుస్తున్నట్లు అనిపించి గబుక్కున నిద్ర మేల్కొన్నాను సందేహం లేదు అది స్వరూప స్వరమే! భయంతో వళ్లంతా చెమటలు పట్టాయి. గదంతా చీకటిగా వుంది. మళ్లీ కరెంటు పోయిందా! లేచి కూర్చున్నాను మంచం మీద ఒక్క సారిగా గుండె ఝల్లు మంది. కిటికీ అవతల నుండి ఒక స్త్రీ మూర్తి లీలగా అదృశ్యమై పోతున్నది తెల్ల చీరలో వుంది ముఖం సరిగ్గా కనిపించటం లేదు వెనుక నుంచి అచ్చం స్వరూపలాగే వుంది అదే ఎత్తు, అదేలావు

ఆ వైపుకు చూడాలంటేనే భయం వేసింది దుప్పటి లాక్కొని నిండుగా కప్పుకొని పడుకున్నాను గుండెల్లో వణుకు ప్రారంభమైంది సందేహం లేదు! స్వరూప దయ్యమై నన్ను పీడిస్తున్నది నేను సుఖపడకుండా అడ్డు పడుతున్నది నాకు




మనశ్శాంతి లేకుండా చేస్తున్నది ఈ సంగతి వందనకు చెపితే! నవ్వుతుందేమో! 'అక్క పోయిన బాధతో, ఆమె తలపులతో వుండబట్టి మీకు అలా అనిపిస్తున్నది బావా!" అంటుందేమో!

ఆలోచనల్లో వుండగానే మళ్ళీ వినిపించింది సన్నని ఏడుపు! వెక్కి వెక్కి. ఏడుస్తున్న స్వరూప గొంతు

'ఏమండీ!" ఆ ఏడుపులో నుండి మెల్లగా నన్ను పిలుస్తున్న స్వరూప గొంతు భయంతో గుండె దడదడలాడింది కళ్ళు తెరిచి చూడటానికి ధైర్యం చాలటంలేదు

గదిలో ఎవరో అటూ యిటూ నడుస్తున్న అడుగుల చప్పుడు నాగుండె దడను రెట్టింపు చేస్తున్నది

"ఎవరు? ఎవరది? బిగ్గరగా అరిచానని అను కున్నాను కాని నా గొంతు నాకే వినిపించ నంత తగ్గు స్థాయిలో వుంది

నవ్వు! తెరలు తెరలుగా నవ్వు!

"ఏమండీ! అప్పుడే నన్ను మర్చిపోయారా? నేనండీ! మీ స్వరూపని "

ఆ మాటలు వినగానే భయంతో నాకు నాలుక ఎండి పోయింది నోట్లో నుంచి మాట రాలేదు ఎంత ప్రయత్నించినా. సందేహం లేదు ఇది స్వరూప గొంతు! కాని ఎందుకో ఆ నిజాన్ని అంత త్వరగా నమ్మలేక పోతున్నాను చనిపోయిన స్వరూప దయ్యమై మళ్ళీ నా గదిలోకి రావడం ఏమిటి!

ఎందుకొచ్చావు? హీన స్వరంతో ప్రశ్నించాను

'నేను పోయాక మీరెలా వున్నారో చూద్దామని వచ్చానండీ! ఎంతైనా మీరు నా భర్త గదా!" బదులిచ్చింది నేనేమీ మాట్లాడలేక పోతున్నాను నాకు గుండెలు జారిపోతున్నాయి

అడుగుల శబ్దం దూరం అవుతున్న చప్పుడు. మెల్లగా దుప్పటి తొలగించి కళ్ళు విప్పి చూశాను కిటికీకి అవతల వైపు సన్నని పొగ క్రమంగా కరిగి పోతున్నది లేచి వెళ్లి స్విచ్ దగ్గరకు నడిచాను. ఎవరో మంత్రించినట్లు గదిలో లైట్లు వెలిగాయి ఫ్యాను తిరగడం ప్రారంభించింది భయంతో, ఆశ్చర్యంతో బిర్ర బిగుసుకు పోయాను. సరిగ్గా అప్పుడే గోడగడియారం మూడు కొట్టింది

* * * * * * * *

"సునందా! నా కెందుకో భయంగావుంది. స్వరూప దయ్యమై రావటం కళ్ళారా చూశాను. నాకు మనశ్శాంతి లేకుండా పోతున్నది'' దిగులుగా అన్నాను రెండు రోజుల్లోనే ఎంతో నీరసపడి పోయాను మానసికంగా బాగా క్రుంగి పోయాను. పరిస్థితులు ఎలా దారి తీస్తాయో ననే భయం క్షణక్షణం నన్ను క్రుంగదీస్తున్నది

ఇదివరకటి లాగ సునంద నా మాటలను తమాషాగా తీసుకోలేదు ఆమెకూడా ఆలోచనల్లో పడింది రెండు రోజుల్లో శారీరకంగా, మానసికంగా నాలో వచ్చిన మార్పులు ఆమెని కూడా ఆందోళనకు




గురి చేయసాగాయి.

"పోనీ యీ రాత్రికి నేను కూడా మీ గదిలో మీతో పాటు పడుకుంటాను" అన్నది సునంద అయితే ఆ సలహా నాకు నచ్చలేదు. ఇంట్లో వందన, ఆమె కజిన్ బ్రదర్ వుండగా నేను మరొక స్త్రీతో కలిసి వెళితే నన్నెంత నీచంగా తలపోస్తారు? నా భయం యింకొకటి కూడా! నేను, సునంద ఆ బెడ్ రూంలో పడుకొని వుండగా స్వరూప మళ్లీ దయ్యమై వచ్చి ఎంత గలభా చేస్తుందో అనే ఆలోచన కూడా లేకపోలేదు

"చూద్దాం! నాది కేవలం భ్రమేనేమో! తొందరపడి నలుగురిలో అభాసుపాలు కావడం ఎందుకు? రెండు రోజులు ఆగి ఏదో ఒక నిర్ణయం తీసుకుందాం" అని ఆమెకు చెప్పి యింటికి చేరుకున్నాను డ్రాయింగ్ రూంలో కూర్చొని చెస్ ఆడుతున్నారు వందన, ఆమె కజిన్‌బ్రదర్ ఫణికుమార్!

"రండి బావా! మీరూ కూర్చోండి" నన్ను చూస్తూనే ఆహ్వానించింది వందన.

"నేను బాగా అలిసిపోయి వున్నాను. మీరు ఆడండి. నేను వెళ్లి రెస్టు తీసుకుంటాను" అని చెప్పి పైగదిలోకి చేరుకున్నాను.

ఆ రాత్రి ఏమైనా సరే నిద్రపోకూడదని, యీ దయ్యం సంగతి ఏమిటో తేల్చుకుందామని అనుకున్నాను. ఫ్రిజ్‌లో నుండి బాటిల్స్ తీసి టీపాయి మీద పెట్టుకొని కూర్చున్నాను. కాలం కరిగి పోతూవుంది. సీసాలు ఖాళీ అవుతున్నాయి. గోడ గడియారం ఒకటి కొట్టింది. తలెత్తి ఆగడియారం వంక చూశాను. పదకొండున్నర అయింది. చాలా పాతకాలం నాటి గడియారం అది. స్వరూపకు ఎంతో యిష్టం! కోరి తన గదిలో పెట్టించుకుంది. కొత్త ఎలక్ట్రానిక్ వాల్‌క్లాక్ కొందామని తను ఎన్ని సార్లు చెప్పినా ఆ గడియారం మార్పించటానికి ఒప్పుకోలేదు. రేపో ఎల్లుండో యీ గోడగడియారాన్ని మార్చాలి' అనుకుంటూ గ్లాసు అందుకున్నాను అర్ధగంట గడిచింది. గడియారం గంటలు కొట్టడం ప్రారంభించింది. శ్రద్ధగా లెక్కించ సాగాను. ఒకటి.... రెండు.... పది.. పన్నెండు.. పదమూడు!

పదమూడు గంటలు!

నిజంగానే గడియారం పదమూడు గంటలు కొట్టింది.

స్వరూపకి ఎంతో యిష్టమైన యీ గడియారాన్ని మార్చి వెయ్యాలని తను అరగంట క్రితమే అనుకున్నాడు. ఇంతలోనే తన అయిష్టత తెలియచేస్తూ స్వరూప గడియారం చేత పదమూడు గంటలు కొట్టించిందా? దయ్యం పని. కాకపోతే గడియారం పదమూడు గంటలు కొట్టడం ఏమిటి? నాలో భయం క్రమ క్రమంగా చోటు చేసుకోసాగింది. దానితో పాటు అసహనం, కోపం కూడా చేరాయి

చచ్చి కూడా తనను సాధిస్తున్నది స్వరూప. అనుక్షణం తనకి మనశ్శాంతిని కరువు చేస్తూ పిచ్చివాడిని చేస్తున్నది. కోపంతో గుండె భగభగ మండసాగింది నాకు.

సరిగ్గా ఆ క్షణంలో వినిపించింది స్వరూప గొంతు

"ఏమండీ! నా పీడ విరగడైందని ఎంతో సంతోషిస్తూ వున్న మీకు యిలా దయ్యమై వచ్చి బాధ కలిగిస్తున్నాను కదూ!" మెల్లగా మంద స్వరాన వినిపించింది. నాలో ఆవేశం, కసి, ఉద్రేకం!

"చచ్చినదానివి మళ్లీ నా వెంట ఎందుకు పడ్డావు?" ఆవేశంగా ప్రశ్నించాను

"నేను చచ్చిపోలేదండీ! మీరే నన్ను చంపారు. బాగా గుర్తు తెచ్చుకోండి. ఆ రోజు కారు బ్రేకులు చెడగొట్టి చాలా చాకచక్యంగా నా చావుకి కారణం అయ్యారు."

గుండె ఝల్లుమంది! నా గుండెల్లో దాచుకున్న నిజం బయటికి రావటంతో ఉలిక్కిపడ్డాను. స్వరూపను నేనే చంపానన్న నిజం లోకానికి తెలీదు అని సంతోషించాను కాని దయ్యాలకు నిజం తెలీకుండా వుంటుందా?

"ఏమండీ మాట్లాడరు? నన్ను చంపింది మీరు కదూ?" రెట్టించింది ఆ స్వరం భయము, ఆవేశము, కోపం, త్రాగిన మైకం అన్నీ నాలో విపరీతమైన సంచలనాన్ని సృష్టిస్తున్నాయి

"యస్! నేనే చంపాను నీ కారు బ్రేకులు తొలగించి నీ అడ్డు తొలగించుకున్నాను లక్షల ఆస్తి కలిగిన స్త్రీకి భర్తనయి కూడా చేతిలో చిల్లిగవ్వ లేక అవస్త పడే స్థితికి తీసుకొచ్చావు. నీతో సంసారం యిష్టంలేక సునందతో ప్రేమాయణం సాగించాను. నీ అడ్డు శాశ్వతంగా తొలగించుకుంటే ఆస్తిని యథేచ్ఛగా అనుభవించవచ్చునీ, సునందతో సుఖంగా గడపవచ్చునీ నేనే నిన్ను హత్య చేశాను. యస్, ఐ డిడ్ యిట్!" బిగ్గరగా అరిచాను

ఒక్కసారిగా గదిలో లైట్లు వెలిగాయి. నా చుట్టూ వందన, ఫణికుమార్, యిద్దరు పోలీస్ యిన్స్‌పెక్టర్లు నిలుచుని వున్నారు.

"మిస్ వందనా! మీ సందేహం నిజమైంది మీ అక్కయ్యను హత్య చేసిన మీ బావగారిని అరెస్టు చేస్తున్నాను" అంటూ ఒక యస్. ఐ. బేడీలతో నా దగ్గరకు వస్తున్నాడు.

"ఏమిటిది?" బిగ్గరగా అడిగాను. ఫణికుమార్ గది మూలలో చెత్త బుట్టలో పెట్టిన టేప్ రికార్డును, బీరువా పైన వుంచిన స్పీకర్లను తీస్తున్నాడు. నాకు బుర్ర తిరిగి పోతున్నది.

"ఐ యాం సారీ బావా! అక్కయ్యను హత్య చేసింది నువ్వేనని నా అనుమానం అక్కయ్య చనిపోయే నెలరోజుల ముందు తన భయాన్ని వ్యక్తం చేస్తూ నాకు లెటర్ వ్రాసింది. అయితే నువ్వు చాలా పకడ్బందీగా, ఎవ్వరికీ అనుమానం కలిగించని రీతిలో ఆమెను అడ్డు తొలగించావు. నేను హైదరాబాదులో ప్రైవేటు డిటెక్టివ్ ఫణికుమార్ గారితో సంప్రదించాను. మా కజిన్ బ్రదర్‌గా ఆయన్ని యిక్కడికి తీసుకొచ్చాను. ఆయన మెజీషియన్, పైగా మిమిక్రీ ఆర్టిస్టు కూడ. ఆయన సహకారంతో పథకం వేసి నిజాన్ని నీ నోటి ద్వారానే చెప్పించి రికార్డు చేశాము" చెప్పింది వందన.

ఫణికుమార్ గొంతు విప్పాడు.

"చట్టానికి భయపడని వ్యక్తి కూడ అంతరాత్మకు భయపడతాడు. అందుకే మీ మనసులో భయం క్రియేట్ చేయడానికి దయ్యం పేరుతో యింత కథ నడపవలసి వచ్చింది. మీరు విన్న స్వరూపగారి గొంతు నాదే! స్పీకర్ల ద్వారా శబ్దాలు, ఏడుపులు మీకు వినిపించేలా చేశాము. కిటికీ బయట భాస్వరం మండించి పొగ సృష్టించాము. కరెంటు పోవడం, రావడం యివన్నీ చాలా చిన్న ట్రిక్కులు" నవ్వుతూ అన్నాడు. "అలాగే ఫోటో ఫ్రేం క్రింద పడెయ్యడం."

"మరి గడియారం పదమూడు గంటలు కొట్టడం, కారు వైపర్లు పని చేయకపోవడం...?" అడిగాను.

"మీరు సునంద యింట్లోకి వెళ్లినప్పుడు నేను మిమ్మల్ని ఫాలో అయి అక్కడ వైపర్ల కనెక్షన్లు తీసివేశాను. గడియారం పళ్ల చక్రానికి మధ్య యింకొక సందు ఏర్పరిస్తే పదమూడో గంట కొడుతుంది. మనిషి తప్పు చేశాననే ఫీలింగ్‌తో వున్నప్పుడు ప్రతిచిన్న విషయానికి భయపడతాడు. ఆ సైకాలజీ ఆధారంగా మిమ్మల్ని ఆడించాము. దయ్యాలు వున్నాయనేది కేవలం భ్రమ! మానవత్వం మరిచి డబ్బు కోసం అమానుషంగా ప్రవర్తించే మనుషులే దయ్యాలు." అంటున్న ఫణికుమార్ మాటలు నా మనస్సును సూటిగా తాకాయి సిగ్గుతో తలవంచుకున్నాను ఇన్స్‌పెక్టరు నా చేతికి సంకెళ్లు తగిలించాడు ●

**తెలుగు-తెగులు**

అమ్మాయిల కోసం
వెతుకుతున్నారు స్టూడెంట్స్
సందులు!
మర్చిపోయారు
తెలుగు మాస్టారు చెప్పిన
సంధులు!

వారి ఆనందాన్ని
మరింత పెంచుతున్నాయ్
సోమాసాలు!
గుర్తుంటం లేదు
పంతులుగారు వ్రాసిన
సమాసాలు!

—కె.సి.బాబు,జె.వి.బాబు




పి. సూర్యనారాయణరాజు, హైదరాబాద్.

సినిమారంగం గాని, ప్రస్తుతం ప్రజలచే తూర్పారబడుతున్న టి.వి. రంగం గాని ఏమాత్రం ప్రజలకు ఉపయోగం లేకుండా సాగుతున్నాయి. మీ అభిప్రాయం ఏమిటి?

* సినిమారంగం ప్రజోపయోగంకోసం అనుకోవడం- మీ అమాయకత్వం. అది డబ్బు కోసమే పనిచేస్తుంది.

టి.వి. అంటారా? ఇప్పుడిప్పుడే కదాకా లూని నడుస్తూంది. "ఉపయోగం" అంటే- మీరు సిటీలనే దృష్టిలో పెట్టుకుని అనేమాట. చాలా మంది 'ఈ కార్యక్రమాలెందుకు?' అంటూ వ్యవసాయిక, ఆరోగ్య, సాంఘిక కార్యక్రమాలని చీదరించుకుంటారు గాని ఇవి పల్లెజీవితాలకి ఎంత ప్రయోజనకరమో ఓ క్షణం ఆలోచించాలి. గంట ప్రాపగాండ కంటే- ఒక్క దృశ్యం ఎంత సాధించకలదో యోచించండి. కార్యక్రమాలు- ఒక్క డ్రాయింగ్రూం ఆడియన్స్‌కి కాదు. మనదేశంలో నిరక్షరాస్యత వల్ల ఎంతో అనర్థం జరుగుతోంది- అటువంటప్పుడే శబ్ద-దృశ్యరంగం పల్లె ప్రాంతపు వాసులకెంతో ఉపయోగిస్తూంది- మరిచిపోకండి. పంటలు-పొలాలు, జానపద జీవనాన్ని ప్రతిబింబించే నాట్యాలు పాటలు- తోట పనులు పయోజన విద్యా కార్యక్రమాలు- మంచి మాటలు- అన్నీ అందరికీ కాకపోవచ్చు. కాని అందరికీ వినడానికే యిబ్బంది కల్గించవు. నేను టి.వి.లో పయోజన విద్యాపాఠాలు చూసి చూసి తమిళం నేర్చుకున్నాను. నాకు అర్థం పర్థంలేని, అంతగా వుపయోగంలేని- చేతిపనులూ, అలంకార వస్తువుల తయారీ లాంటివే- విసుగు కల్గిస్తాయి. ఇంక 'వినోదం' అంటారా? లోకో భిన్నరుచిః ఒకరికి బాగుంటే ఇంకొకరికి బాగుండకపోవడం- మానవనైజం కదా!?

పి. వెంకటేశ్, అయిజ.

ప్రేమవేరు, కోరిక వేరు అంటే?

* తప్పేం లేదు... చాలా మంది అనుకునేదే!

వరకట్న దురాచారానికి బలి అయిపోతున్న వనితలకి మీరిచ్చే సలహా ఏమిటి?

* ఎందుకా పెళ్లి? ఎవరు బలి అయిపొమ్మంటున్నారీ అమ్మాయిలని? ఎందుకీ సిగ్గుమాలిన పెళ్లిళ్లకి తలవంచాలి? చదువుకుని, సంపాదించుకునే- అర్హతలేనిదే- ఆడ- మగ ఎవరూ పెళ్లిమాట తలపెట్ట కూడదు. పెళ్లే జీవితం అనుకుంటే ఎలా ఆడపిల్లలు- ఈ రోజుల్లో కూడా?

ఎ.ఎస్. అప్పలరాజు, విజయవాడ.

కవితలురాస్తే ఫలితం ఏముందంటారు?

* కవి అనిపించుకుంటున్నారు గదా!

కవితలు రాసినా ఏం చెయ్యమంటారు? ఒకేళ రాసినా పత్రికలు ప్రచురిస్తాయంటారా?

* ఎలా చెప్పను చిలక జోస్యం? రాసి పంపితే కదా తెలిసేది?!

గౌడబ రమేష్ పట్నాయక్, రాయగడ.

అమ్మకి అర్థం?

* ఫలితం ఎదురు చూడని త్యాగం.

మాతృహృదయం అంటే ఏమిటి?

* తన బాధ తెలుసుకోక- ఎదుటివారి బాధతో చలించిపోయే తల్లి మనసు. మీరీ కథ వినలేదా? ఒక ఉంపుడుకత్తె 'నీ తల్లి గుండె తెచ్చివ్వు' అంటే తల్లిని చంపి గుండెపట్టుకెడుతున్నాట్ట ఓ కొడుకు. అది చేయిజారిపడింది. అతను కాలురాయిని తన్నడంతో 'నాయనా దెబ్బతగిలిందా?' అని అడిగిందట రక్తం చిందిస్తున్న ఆ గుండె. అదీ- తల్లి గుండె.

చొప్పరపు సత్యనారాయణ, మంటాడ.

విద్యార్థులు సమ్మె చేస్తూంటే విమర్శించే నాయకులు అసెంబ్లీలో బీభత్సం చేస్తూ బంద్‌లు చేస్తున్న విద్యార్థుల కన్న హీనంగా తయారయ్యారు. మీరేమంటారు?

*చదువుకునేటప్పుడు బుద్ధిగా, చదువుకోవాలిగాని, సమ్మెల జోలికి పోకూడదని చెప్తారంతే- కాని పబ్లిక్ లైఫ్‌లోకి వచ్చాక నలుగురి దృష్టినీ ఆకర్షించడానికి ఏమైనా చెయ్యక తప్పదని వారి విమర్శలకి ప్రవర్తనకి మనం అర్థం చెప్పుకోవాలి!

పాతిక సంవత్సరాల నుంచి ఈ శీర్షిక నిర్వహిస్తున్న మీకు విసుగు కల్గించడంలేదా?

*లేదే! పాతికేళ్ల నుంచి ఒకే పాఠకులు కాదే- చదువుతున్నది- మరిచిపోయారా?!

ఎస్. బదరినాధ్, బెంగుళూరు.

మీరు 64 నుంచి యిస్తూంటే ఇప్పటికీ జవాబులు 18000 మందికి ఇచ్చివుంటారు. (అందాజుగా 15X4X12X25) మరి మనుష్యుల మనస్తత్వాలు గురించి ఆపోసనపట్టివుంటారు. వారి పట్ల మీ ఘనస్తత్వం కాస్త తెలియచెప్తారా? దాటవేయకుండా జవాబివ్వండి.

*మీ లెక్కలు చూస్తే తప్ప నాకు తోచలేదు- యింత ఘనకార్యం చేశానని! నేను ఈ శీర్షికను నిత్యనూతనంగానే భావిస్తాను- గాని 'చింతన'తో భారం చేసుకోను. రకరకాల వాళ్ళు- పలువిషయాల గురించి రకరకాలుగా అనుకుంటారు. నేనేం అనుకుంటున్నాను అన్నది- పంచుకోడమే యీ శీర్షిక ఉద్దేశ్యం గాని మనస్తత్వ పరిశీలన కాదు- అది నేను చేయవలసిన పనికాదు.... ఇది ఊహల కలపోత మాత్రమే.

తడకమళ్ల రాజవరయ్యగుప్త, సికిందరాబాద్.

దేవాలయంపై బూతుబొమ్మలెందుకు?

*తాపీవారి రచనలు చదవండి. ఇప్పుడు- మానవ పరిణామ శాస్త్రపరంగా, సామాజిక పరిణామ శాస్త్రపరంగా వీటిని విశ్లేషిస్తున్న ఆరుద్ర వ్యాసాలు చదవండి. కొంచెం అర్థం అవుతుంది.

విఘ్నేశ్వరుడికి ఏనుగుతల ఎందుకు?

*ఏ నానమ్మగారినడిగినా చెప్తారే! ●

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

## 13

(గత సంచిక తరువాయి)

వ జ్రపాణి పేరు వింటూనే పింకీ వులిక్కి పడడం జూడా గమనించాడు. వెంటనే అతని కళ్ళు అనుమానంతో చిన్నవ య్యాయి.

"వజ్రపాణి యెవరో మీకు తెలుసా?" నెమ్మదిగానే అడిగినా అతని ప్రశ్నలో పదు నుంది.

అరక్షణంలో పింకీ తన వులికిపాటు సరిదిద్దుకుంది. నెమ్మదిగా సోఫాలో వెనక్కి వాలి పెదవులపైకి బలవంతంగా నవ్వు కొని తెచ్చుకుంటూ జూడా వైపు మామూలుగా చూడ్డానికి ప్రయత్నించింది. జూడా కళ్లలో యింకా- అనుమానం తొంగిచూస్తూనే వుంది.

"వజ్రపాణి పేరు తెలీకేం!" చిరునవ్వు మరింత వికసింపజేస్తూ అందామె. "వజ్రపాణి జెమ్‌స్టోన్ కంపెనీ"కి అధిపతి అతను.

దేశంలోని మొదటి వందమంది కోటీశ్వరుల్లో ఒకడు. నవరత్నాల గురించి రిసెర్చిచేసే ఓ ప్రత్యేకమైన సంస్థని స్వంతానికి యేర్పాటు చేసుకోగలిగిన మనిషి. దేశంలో కెల్లా అతి పెద్దదైన జెమ్‌స్టోన్ కటింగ్ ఎస్టాబ్లిష్‌మెంట్ ఇక్కడే హైదరాబాద్‌లోనే స్థాపించిన ఘనుడు. ఇటీవలే ప్రపంచం నలుమూలల నుంచీ ఆ కటింగ్ ఎస్టాబ్లిష్‌మెంటుకి కాంట్రాక్టులు వస్తున్నాయి. ప్రపంచంలోని అన్ని ముఖ్యపట్టణాల్లోనూ వజ్రపాణి వజ్రాల కంపెనీకి బ్రాంచీలున్నాయి.

"గొప్ప గొప్ప వజ్రాల సేకరణ అతని హాబీ. తన కంపెనీ వ్యవహారాలన్నీ స్వగ్రామమైన మణిపురంలోనే వుంటూ మేనేజ్ చెయ్యగలగడం అతని విశిష్టత. బయటి ప్రపంచంతో వ్యక్తిగత సంబంధాలు పెద్దగా పెట్టుకోకుండా అజ్ఞాతంగా వుండిపోవాలనుకోవడం అతని ప్రత్యేకత. రాజులతో, చక్రవర్తులతో, దేశాధీశులతో తప్ప సామాన్యులతో స్నేహం చెయ్యకపోవడం అతని ఆభిజాత్యం. బ్రిటిష్ మహారాణి దగ్గర్నుంచి సౌదీ అరేబియా యువ రాజు వరకూ అతన్ని తమ గౌరవనీయులైన స్నేహితుల్లో ఒకడుగా భావిస్తారు. అయినా అతను అరుదుగా తప్ప విదేశాలకు ప్రయాణాలు చెయ్యకపోవడం ఓ చిత్రమైన విశేషం."

"దేశంలోని ప్రముఖ రాజకీయ పార్టీలన్నింటికీ అతను ధారాళంగా విరాళాలిస్తాడు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక విధానాల్లో అతని అభిప్రాయాలకు యెప్పుడూ విలువ వుంటుందని చెప్పడం అతిశయోక్తి కాదు. మీరు చెప్పిన సూర్యనేత్రం లాంటి మహా వజ్రం అతని దగ్గరుండడంలో ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. కానీ, ఆ వజ్రం సంగతి ఇప్పటి వరకూ బయటి ప్రపంచానికి తెలీకపోవడమే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది.

ఆ మినీ ఉపన్యాసంలో జూడా కళ్లలో అనుమానం పూర్తిగా సద్దుమణగలేదు. పింకీ కేసి అదోలా చూస్తూ నెమ్మదిగా తలూపేడు.

"వజ్రపాణి గురించి మీరు చెప్పిన మాటలు అక్షరాలా నిజం. అయితే మీరన్నట్టు అతను దేశంలోని మొదటి వందమంది కోటీశ్వరుల్లో ఒకడు కాడు...."

పింకీ యేదో అనబోయింది.

"....ప్రపంచంలోని మొదటి వందమంది కోటీశ్వరుల్లో ఒకడు." మాట పూర్తిచేశాడు జూడా. "ఆ మాటకొస్తే వజ్రపాణి ప్రపంచంలోని మొదటి పదిమంది కోటీశ్వరుల్లో ఒకడన్నా అతిశయోక్తి కాదు."

పింకీ నవ్వేసింది.

"నిజంగా?"

జూడా సీరియస్‌గా తూలూపేడు.

"అవును వజ్రపాణి గురించి యెవరికీ తెలీని బ్రహ్మరహస్యం ఒకటి మీకిప్పుడు నేను చెప్పబోతున్నాను."

అతను జేబులోంచి మడతపెట్టిన కాయితం బయటికి లాగేడు.

"ఇది చూడండి."

జాగ్రత్తగా ఆ కాగితం మడతలు విప్పి తన కెదురుగా వున్న టీపాయ్ మీద పరిచాడు. పింకీతో పాటు ప్రభు కూడా ఆసక్తిగా ఆ కాయితం వైపు కళ్లప్పగించి చూశాడు.

"ఇది రఫ్‌గా మణిపురం ప్లాన్," వివరించాడు జూడా. "ఇది మణిపురగ్రామం, వజ్రపాణి హవేలీ ఇక్కడుంది." వేలుపెట్టి చూపించాడు.

పింకీ తలూపింది.

"మణిపురానికి చూట్టూ దట్టమైన అడవీ, ఆ అడవిదాటితే యెత్తైన కొండలూ వున్నాయి. ఈ స్పాట్ చూడండి. ఇది మణిపురం అడవులకు వెలుపల వున్న కొండ ప్రాంతం. కొండల మధ్య కనిపిస్తున్న ఈ స్పాట్ కొన్ని వందల యెకరాలు విస్తరించిన పల్లపు ప్రదేశం," జూడా తలపైకెత్తి పింకీ వైపు చూశాడు. అదే సమయంలో ఆమె కూడా తలపైకెత్తి అతని కళ్లలోకి సూటిగా చూసింది.

వజ్రపాణి బ్రహ్మరహస్యం సరిగ్గా ఈ పల్లపు ప్రాంతంలోనే దాగివుంది మిస్‌పింకీ!"

**ఇంతవరకూ సాగిన కథ-24 :** విశ్వధర వర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడుభూమిలో బావి త్రవ్వుతుండగా దొరికిన అపురూప వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. వజ్రపాణిని దెబ్బ తీసేందుకు విశ్వధరవర్మ ఎదురుచూస్తుంటాడు. మోసాలకు అలవాటుపడిన జైలర్ సత్యం కూతురు పింకీ, ఆమె అనుచరుడు ప్రభు వ్యవహారాలను కనిపెడుతున్న జూడా, డేవిడ్‌లు తమతో చేతులు కలపమని కోరతారు. ప్రపంచంలోని ఎన్నోరకాల వజ్రాల గురించి తెలిసిన పింకీకి వజ్రపాణి దగ్గరున్న వజ్రం గురించి జూడా తెలియజేస్తాడు.

నెమ్మదిగా ఒక్కో అక్షరమూ ఒత్తిపలుకుతూ అన్నాడు జూడా.

పింకీ తలూపింది.

"మిస్ పింకీ! మీరిందాక చెప్పారు. స్వగ్రామంలోనే వుండిపోయి కంపెనీ వ్యవహారాలు చూసుకోవడం వజ్రపాణి ప్రత్యేకత అని. కొన్ని కోట్ల రూపాయల వ్యాపారం చేసే కంపెనీ వ్యవహారాలు వదిలిపెట్టి ఎక్కడో మారుమూల పల్లెటూళ్లో వుండిపోయి వజ్రపాణి ఎందుకు చూసుకుంటున్నాడు? ఈ ప్రశ్న మీకు తట్టిందా?"

పింకీ ఒక్కక్షణం ఆలోచించింది.

"అంతకంటే లాభదాయకమైన వ్యవహారాలు అతనికా పల్లెటూళ్లోనే వుండివుండాలి. యామై కరెక్ట్?" అంది.

జూడా మొహం కాగడాలా వెలిగిపోయింది.

"హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్!" నవ్వుతూ చెప్పాడతను. "మీపట్ల నా నమ్మకం మరింత గట్టిపడింది మిస్ పింకీ! ఆ మాత్రం వూహించలేక పోయివుంటే మీ దగ్గరికి నేను వచ్చి వుండేవాడినే కాను."

"పొగడ్తలు చాలు. వజ్రపాణి బ్రహ్మరహస్యం గురించి చెప్పండి." సీరియస్‌గా అంది పింకీ. ఆమె కళ్లలో తీవ్రమైన ఆసక్తి గోచరిస్తోంది.



"ఓకే, ఓకే!" ఆమెతో పాటు తనూ సీరియస్ అయిపోతూ అన్నాడతను. అతని కళ్లు మరోసారి మణిపురం ప్లాన్ వైపు తిరిగాయి.

"ఈ పల్లపు ప్రదేశం....." మరోసారి వేలుపెట్టి ప్లాన్లో ఆస్పాట్ చూపిస్తూ చెప్ప సాగాడు. "ఈ పల్లపు ప్రదేశం వాస్తవానికి ఓ బ్రహ్మాండమైన డైమండ్ ఫీల్డ్. ప్రపంచంలోని అతి పెద్ద డైమండ్ ఫీల్డ్స్‌లో ఇది కూడా ఒకటి."

"ముప్పైయేళ్ల క్రితం సరిగ్గా ఈ ప్రదేశంలోనే సూర్యనేత్రం దొరికింది. అప్పుడే ఆప్రదేశంలో వజ్రాలగని వుండవచ్చుననే అనుమానం వజ్రపాణికి కలిగింది. దాంతో అతనీ ప్రాంతాన్ని, దుర్మార్గంగా ఆక్రమించుకుని సైంటిఫికల్‌గా పరీక్షలు చేయించాడు. వజ్రపాణి అనుమానం నిజమైంది. ఆ ప్రదేశంలో నిజంగానే వజ్రాలగని పడ్డది."

"అక్కడ వజ్రాలగని వుందని ప్రభుత్వానికి తెలియనీయకుండా వజ్రపాణి మణిపురం అడవుల్లో నివసించే ఆటవికుల్ని తన చెప్పుచేతల్లో వుంచుకుని అతి రహస్యంగా తవ్వకాలు సాగిస్తున్నాడు. ముప్పై యేళ్లుగా ఈ తవ్వకాలు మణిపురం కొండ ప్రాంతంలో నిర్విరామంగా జరుగుతూనే ఉన్నాయి. ఆ విధంగా కోట్ల విలువచేసే వజ్రాలు తనెన్ని కూడబెట్టాడో లెక్క చెప్పడం వజ్రపాణికే అసాధ్యం! ఇదే వజ్రపాణి బ్రహ్మరహస్యం! వజ్రపాణి ఆయువుపట్టు నాగరికతకు చాలా దూరంగా వున్న మణిపురం కొండ ప్రాంతంలోనే వుంది. అందుకే అతనక్కడ్నుంచి కదలడు."

"ఐ...సీ!" నెమ్మదిగా అంది పింకీ.

జూడా తలూపి యింకా చెప్పుకుంటూ పోయాడు.

# వజ్రసంకల్పం

"వజ్రపాణి స్థాపించిన వజ్రాలకంపెనీ నిజానికోడమ్మీ! తన రహస్య కార్యకలాపాలు బయటి ప్రపంచానికి తెలియకుండా వుండేందుకు వజ్రపాణి కప్పిన నల్లని ముసుగు! కోట్ల విలువచేసే కంపెనీని కేవలం డమ్మీగా వాడుకుంటున్నాడంటే మణిపురంలో వుంటూ వజ్రపాణి రహస్యంగా యెంత సంపద కూడబెడుతున్నాడో వూహించుకోవచ్చు. మణిపురంలో అతని కార్యకలాపాలు యెంత లాభదాయకంగా వున్నాయో అర్థం చేసుకోవచ్చు."

"ఐ సీ!" మరోసారి అంది పింకీ. "అయితే వజ్రపాణి కేవలం లాభం కోసం మణిపురంలో వుండిపోయాడంటారా?"

జూడా ఆశ్చర్యంగా చూశాడు.

"అంటే?"

"సమ్మోహన శక్తి!" నెమ్మదిగా అంది పింకీ. "శలభాన్ని దీపం తన చుట్టూ తిరిగేలా చేసుకునే సమ్మోహనశక్తి. చకోరాన్ని చందమామ తన వెంటపడేలా చేసుకునే సమ్మోహన శక్తి. మనిషి హృదయాన్ని వజ్రం అయస్కాంతంలా తనవైపు ఆకర్షించుకునే సమ్మోహన శక్తి!"

జూడా తలూపేడు.

"మీరు చెప్పేది నాకర్థమైంది. అవును, వజ్రపాణి కేవలం లాభాన్ని ఆశించి మణిపురంలో దిగబడిపోలేదు. వజ్రాలంటే అతనికున్న వెర్రి ప్రేమే అతని చేత ఇన్ని పనులు చేయిస్తోంది. మీరు చెప్పినట్టు అతను దీపం చుట్టూ తిరిగే శలభం. నిజానికి తన డైమండ్ ఫీల్డ్స్‌లో దొరికే వజ్రాలన్నీ అతను తనకే వుంచేసుకుంటాడు. వాటిలో - కొన్నింటిని మాత్రమే తన కంపెనీ స్టాక్‌లో చేరుస్తాడు." అన్నాడు.

"సమ్మోహనశక్తి!" మళ్ళీ అంది పింకీ. "ఈ సమ్మోహనశక్తితోనే వజ్రాలు యుగయుగాలుగా మనిషిని కట్టిపడేస్తున్నాయి. వజ్రాల మీద ఆశతో యుగయుగాలుగా మనిషి యెన్నో దుర్మార్గాలు చేశాడు. ఎంతో రక్తపాతం సృష్టించాడు. ఇదంతా కేవలం లాభాన్ని ఆశించి చేశాడని చెప్పడం యెలా? సమ్మోహనశక్తి! అవును, కేవలం సమ్మోహనశక్తితోనే వజ్రాలు మనిషిని అనాదిగా తోలుబొమ్మలా ఆడిస్తున్నాయి."

ఒక విధమైన ట్రాన్స్‌లో వున్నట్టుగా పింకీ ఆ మాటలు చెబుతుంటే జూడా కొంచెం ఆశ్చర్యంతో చూశాడామెని.

"నిజమే!" కొద్ది క్షణాలు ఆమెని పరిశీలనగా చూస్తూ వుండిపోయి నెమ్మదిగా అన్నాడతను. "వజ్రాల్లో యేదో సమ్మోహనశక్తి లేకపోతే అన్ని వజ్రాలకు- అంతటి తరగని సంపదకు అధిపతి అయిన వజ్రపాణి ఇతరుల వజ్రాలకోసం యెందుకు అర్రులు చాస్తాడు? యెందుకు మాయలు పన్నుతాడు?"

ఆ మాట వినగానే పింకీ చివుక్కున తలపైకెత్తి చూసింది.

"అంటే?" కనుబొమలు ముడివేస్తూ అడిగింది.

ఆమె కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి.

"తన డైమండ్ ఫీల్డ్స్‌లో దొరికే వజ్రాలతో వజ్రపాణి దాహం తీరలేదు", చెప్పాడు జూడా. "ఇతరుల దగ్గరుండే గొప్ప వజ్రాల్ని కూడా యెంత దుర్మార్గానికైనా వొడిగట్టి సాధించడం అతని హాబీ!"

ఆ మాట వింటూనే పింకీ హృదయం పురకలు వేయసాగింది. అయితే తనలోని ఉద్వేగం బయటికి తెలియనీయకుండా ఆమె జాగ్రత్త పడింది.

"అంటే.... వజ్రపాణి యెవరెవర్ని మోసం చేశాడు?" చాలా కేజువల్‌గా అడుగుతున్నట్టుగా చూసింది.

జూడా భుజాలెగరేశాడు.

"చాలా మందినే మోసం చేసి వుంటాడు. ఎంత మందినో లెక్కలేదు. వాళ్ళలో కొందర్ని హత్య చేయించాడు కూడా!" అని మాత్రం అని వూరుకున్నాడు.

ఆ విషయం మీద అతన్నింకా ప్రశ్నించాలన్న తహతహను బలవంతంగా అణుచుకుంది పింకీ.

"వెల్! ఎందరినో మోసం చేసిన వజ్రపాణిని నేను మోసగించి ఆ సూర్యనేత్రాన్ని మీకు తెచ్చివ్వగలిగితే కొన్ని కోట్ల రూపాయల పారితోషికం మీరు నాకిస్తారు. సూర్యనేత్రం కోసమే మీరు నా దగ్గరికొచ్చారు! అంతేనా?"



జాడా చిరునవ్వుతో ఆమెకు అభివాదం చేశాడు

"మీరు చాలా తెలివైనవారు మిస్ పింకీ!"

పింకీ నవ్వలేదు

అతని కళ్ళలోకి సూటిగా చూసింది

"వజ్రపాణికి మీకూ యెప్పుడు బెడిసికొట్టింది మిస్టర్ జాడా?"

అంతే!

ఆ ప్రశ్నతో వీపు మీద కొరడాదెబ్బ తిన్నవాడిలా అదిరిపడ్డాడు జాడా!

"ఓకిటీజీ!" ఓదారుస్తున్నట్టుగా అంది పింకీ "మీరు చెప్పకపోయినా నాకెలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నారా? సో సింపుల్!" అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ కొద్ది క్షణాలు మౌనం వహించి తిరిగి చెప్పడం మొదలెట్టిందామె

"సో సింపుల్ మిస్టర్ జాడా! వజ్రపాణి గురించి యెవరికీ తెలియని- యెవరూ వూహించలేని విషయాలు చెప్పగలుగుతున్నారంటే మీరు వజ్రపాణికి చాలా సన్నిహితులై వుండాలి. అతని దగ్గర పనిచేసి వుండాలి బహుశా ఇతరుల్ని మోసగించి వజ్రాలు సంపాయించడంలో వజ్రపాణికి మీరు సాయంచేసి వున్నా ఆశ్చర్యం లేదు మీ వంటి మాస్టర్ క్రూక్ స్వయంగా సూర్యనేత్రాన్ని సంపాయించడానికి ప్రయత్నించకుండా నా సహాయం కోరుతున్నారంటే ఎందువల్లనో మీకూ వజ్రపాణికీ బెడిసికొట్టి వుండాలి కనీసం వజ్రపాణికి మీ మీద అనుమానం కలిగి వుండాలి కాకపోతే వజ్రపాణికి మీ మీద అనుమానం పూర్తిగా ధృవపడివుండదు అదే జరిగి వుంటే మీరీ క్షణంలో నాతో మాట్లాడుతూ వుండగలిగేవారు కారు. భూమిలో ఆరడుగుల లోతున శవరూపంలో శాశ్వత నిద్రపోతూ, వుండేవారు యామై కరెక్ట్?"

జాడా మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

"మై గా. డ్ !"

వణుకుతున్న చేతుల్తో జేబులోంచి రుమాలు తీసి నుదురు తుడుచుకున్నాడు

"తక్కువగా అంచనా వేసి వుండవలసింది కాదు మిమ్మల్ని!" గొణుగుతున్నట్టుగా అన్నాడు.

"ఆ మాత్రం నేనూహించలేకపోతే మీరు నా దగ్గరికొచ్చి ప్రయోజనమేమిటి మిస్టర్ జాడా?" సాఫీగా అంది పింకీ

జాడా గుటకలు మింగుతూ నవ్వడానికి ప్రయత్నించాడు.

సాధ్యం కాలేదు.

"ఆల్ రైట్!" ఆముదం తాగినవాడిలా మొహం పెట్టి అన్నాడు

"ఇక నిజం చెప్పకపోవడంలో అర్థం లేదు యువార్ రైట్! వజ్రపాణికి ముఖ్యమైన అనుచరుణ్ణి నేనొకప్పుడు మీరూహించినట్టు ఇతరుల్ని మోసం చేసి వజ్రాలు సంపాయించడంలో నేను వజ్రపాణికి సాయం చేసే వాణ్ణి ప్రాణాలకు తెగించి రిస్కు నేను తీసుకునేవాణ్ణి. వజ్రపాణి వజ్రాలు తీసుకునేవాడు నాకు కూలీ డబ్బు మాత్రం మిగిలేది అలా వీల్లేదు, వజ్రాల విలువలో సగం నాకు రావాలన్నాను. శ్రమకు తగ్గ ఫలితం అడిగినందుకు నాకు అవమానమే మిగిలింది," కసిగా చెప్పాడు జాడా.

"వజ్రపాణి మిమ్మల్ని చంపకుండా వదిలి

# అంధకార చరిత్ర నుంచి బయటపడ్డ మహావజ్రం 'గోల్డెన్ ట్రయొలెట్'





## వజ్ర సంకల్పం నేపథ్యంలో

**1984** దాకా గోల్డెన్ ట్రయొలెట్ ఉనికి ఎవరికీ తెలీదు. 1984 కు పూర్వం దాని చరిత్రేమిటో ఇప్పటికీ తెలీదు. ప్రపంచానికి తెలిసిందల్లా ఆ సంవత్సరంలో కొందరు ప్రైవేట్ వ్యక్తులు దాన్ని కొన్నారనే.

407.48 కేరెట్ల ఈ మహావజ్రం బంగారు రంగులో మెరిసిపోతూ ఉంటుంది. అందుకే దానికి గోల్డెన్ ట్రయొలెట్ అనే పేరొచ్చింది ముడివజ్రంగా వున్నప్పుడది 890 కేరెట్లుండేదట

1988 అక్టోబర్లో ఇది వేలానికొచ్చింది బహిరంగంగా మార్కెట్లో అమ్మకానికొచ్చిన అతి పెద్ద వజ్రం ప్రపంచ చరిత్రలో ఇదే దీనికంటే పెద్దది ప్రస్తుతం కల్లినాన్-1 మాత్రమే దీనిముందు కల్లినాన్-2 గూడా వెనకబడిపోయింది.

1984కు పూర్వం దీని చరిత్రేమిటో దీని వెనక ఎన్ని విషాదగాథలు దాగివున్నాయో ఎవరికి తెలుసు? మీరు చదువుతున్న నవలలో సూర్యనేత్రానికి స్ఫూర్తి ఈ మహావజ్రమే ఇది మీ టేబుల్ మీదున్న పేపర్ వెయిట్ కంటే కొంచెం పెద్దదిగానే వుంటుంది-చూడండి!




పెట్టడం మీ అదృష్టం! అంతేనా?" అడిగింది పింకీ.

జూడా తల అడ్డంగా వూపాడు.

"వజ్రపాణి కోరుకున్నా నన్ను చంపి వుండేవాడు కాదు. అక్కడ మాత్రం మీరు పొరబడ్డారు."

"అదేం?"

జూడా చూపుడువేలితో కుడివైపు కణత తట్టి చూపించాడు.

"ఇదీ కారణం- నా మెదడు! వజ్రపాణికి నా మెదడుతోచాలా అవసరం. ఈ లోకంలో మెదడున్న వాళ్ళు చాలా తక్కువమందున్నారని వజ్రపాణికి తెలుసు," అన్నాడు.

"ఐ సీ!" సాలోచనగా చూసింది పింకీ. "కానీ వజ్రపాణి పూర్వంలా మీ మీద పూర్తినమ్మకం వుంచడం లేదు. మిమ్మల్ని యే కోశానో అనుమానిస్తున్నాడు. అందుకే సూర్యనేత్రం జోలికి మీరు పోలేకపోయారు. అవునా?"

జూడా తలూపేడు.

"అందుకే నా సహాయం మీకు కావల్సొచ్చింది. వెల్ వెల్! నా సహాయంతో ఏనుగు కుంభస్థలం కొట్టి సూర్యనేత్రం సాధించాలనుకున్నారు. సూర్యనేత్రం సాధించగలిగితే వజ్రపాణిని దెబ్బకొట్టినట్టూ వుంటుంది. దాని మీద వచ్చే డబ్బుతో జీవితాంతం చీకూ చింతా లేకుండా యే స్విట్జర్లాండ్ లోనో అజ్ఞాతంగా జీవితం గడిపేసినట్టూ వుంటుంది! యేమంటారు?"

జూడా మళ్ళీ తలూపేడు.

"కానీ, ఒక్క విషయం మాత్రం నాకర్థం కావడం లేదు," నెమ్మదిగా అంది పింకీ. "సూర్యనేత్రం సాధించామే అనుకుందాం. దాన్ని కరెన్సీ నోట్లకట్టగా మార్చేదెలా?"

జూడా నవ్వేడు.

"ఆ విషయం నాకొదిలిపెట్టండి పింకీ!

## వజ్రసంకల్పం

ఆ మాత్రం దారి తెలియకపోతే ఇంత పథకం వేసి వుండేవాడినే కాను."

పింకీ ఒక్క క్షణం ఆలోచించి అతని వైపు హుషారుగా చూసింది.

"ఆల్ రైట్! పథకం చెప్పండి!"

జూడా చెప్పడం ప్రారంభించాడు.

## 14

కారు డ్రైవ్ చేస్తూ జూడా చెప్పిన మాటలే పదేపదే నెమరు వేసుకుంటోంది పింకీ. పరధ్యానంగా కారు డ్రైవ్ చేస్తున్నప్పటికీ చేతులు వాటంతటవే యాంత్రికంగా స్టీరింగ్ కంట్రోల్ చేస్తూ తమ పని తాము చేసుకుపోతున్నాయ్. డ్రైవింగ్ మీద ప్రత్యేక శ్రద్ధ కనబర్చడానికి రోడ్డు మీద ట్రాఫిక్ కూడా అట్టే లేదు. దాంతో తాపీగా కారు డ్రైవ్ చేస్తూ ఆలోచిస్తోంది.

కార్లో తను ఒంటరిగానే వెళ్తోంది. ప్రభూని వెంట తీసుకురాలేదు. ప్రభు గుర్తుకు రాగానే పింకీ పెదవుల మీద సన్నని చిరునవ్వు తళుక్కున మెరిసింది.

పాపం ప్రభు.

తనెక్కడికి వెళ్తానంటే అక్కడికి చిన్న పిల్లాడిలా వెంటబడతానంటాడు. రోజుకి ఇరవై నాలుగ్గంటలూ తననే రాసుకు పూసుకు తిరుగుతానంటాడు. తనంటే అతనికి చాలా ఇంట్రెస్టు. ఇంట్రెస్టు ఒక్కటేకాదు- ఒక విధమైన వెర్రి. తనని చాలా సిన్సియర్ గా ప్రేమిస్తున్నాడు. ఎప్పటికైనా తననించి గ్రీన్ సిగ్నల్ వస్తుందని ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.

తనకి ప్రభూ మీద ఇష్టం లేదని కాదు. కానీ, ఆ ఇష్టమే ప్రేమ అనుకోవడం ఎలా?

అలాగని తనకు ప్రభుమీద ప్రేమలేదని కాదు. కానీ...., ఆ ప్రేమ ప్రభు వూహించే లాంటిదికాదు. స్వీట్ సిక్స్టీన్ లో వుండే అమ్మాయి నైన్ నైన్టీన్లో వున్న అబ్బాయిని చూసి అమాంతం ప్రేమించేసేలాంటి ప్రేమ కాదు. సినిమాల్లో హీరోయిన్ హీరోని చూస్తూనే హో అంటూ పడిపోయి డ్యూయెట్లు పాడేసే ప్రేమలాంటిది కాదు.

ఈ ప్రేమ వేరు.

ఇంట్లో జూలీ అనే బొచ్చుకుక్కని పెంచుకుంటే ఆ జూలీని ప్రేమిస్తాం. డాలీ అనే పిల్లిపిల్లని పెంచుకుంటే ఆ డాలీని ప్రేమిస్తాం. పోలీ అనే రామచిలకని పెంచుకుంటే ఆ పోలీని ప్రేమిస్తాం. ఆ ప్రేమలాంటిదే ఈ ప్రేమకూడా. ఆ జూలీనో డాలీనో పోలీనో ప్రేమిస్తున్నామని వాటి మెళ్ళో తాళికడతామా- లేక, తాళి కట్టించుకుంటామా!

సిల్లీ!

ప్రభూకి ఆ విషయమే చాలా సార్లు చెప్పింది తను.

కానీ అతను వినిపించుకోడు. తన మానాన తాను తనని సిన్సియర్ గా ప్రేమించేస్తూనే వున్నాడు- పూర్ ఫెలో!

"చూడబ్బాయ్, నువ్విలాగే అస్తమానం నా వెంట పడుతుంటే తెలుగు సినిమాల్లో హీరోయిన్ లా, సారీ బ్రదర్! నువ్వింతలా నన్ను ప్రేమిస్తున్నావని నాకేం తెలుసు? నిన్ను నేను చచ్చిపోయిన మా అన్నలా చూస్తున్నాను. నా ప్రవర్తనని నువ్వు అపార్థం చేసుకుంటున్నావని ఓ సుత్తి డైలాగు వదిలేస్తాను. ఆ తర్వాత నీ యిష్టం," అంటూ బెదిరించింది తనోసారి.

ఆ మాట వింటూనే ప్రభూ అమాంతం ఎదురుగుండా సోఫాలోంచి లేచి దాదాపు తన రెండుకాళ్ళ మీద పడపోయేంత పనిచేశాడు.

"దయచేసి అంత పని మాత్రం చెయ్యకు బాబోయ్! నేనాత్మహత్య చేసుకుంటాను," అంటూ వాపోయాడు.

ఆ సంఘటన గుర్తుకురాగానే పింకీ నవ్వుకుంది.

ప్రభూని తను నిజంగానే ప్రేమించడం లేదు.

తన దృష్టిలో ప్రేమంటే వేరు.

ప్రియుడి ఫోటోని పుస్తకాల్లో పెట్టుకుని ప్రియురాలు 'హో ప్రియతమా రావేలా?' అంటూ ఏ మబ్బునో ఏ హంసనో బతిమాలుకుని సందేశం పంపడం కాదు.

ప్రేమంటే థ్రిల్.

తలమునకలయ్యేంత థ్రిల్.

తనకి అలాంటి థ్రిల్ కలిగితే అప్పుడు తను నిజంగా ప్రేమిస్తున్నట్టు లెక్క. ప్రభూని చూస్తే తనకలాంటి థ్రిల్ కలగదు. జూలీని-

అనగా ఇంట్లో పెంచుకునే బొచ్చుకుక్కని చూసినప్పుడు కలిగే ప్రేమలాంటిదే కలుగుతుంది. అది ప్రభూ దురదృష్టం. దానికి తనేం చేయగలదు?

ఎవర్నైనా చూస్తే నిజంగా అలాంటి థ్రిల్ కలుగుతుందా? ఎవర్నైనా ప్రేమించగల మనసు తనకుందా? ఆమెకు హఠాత్తుగా అనుమానం వేసింది. అనుమానం వేస్తూనే మనసు వున్నట్టుండి వుదాసీనంగా మారిపోయింది. అంతలోకే తన ఆలోచనలకు తనకే నవ్వొచ్చింది. ఒంటరిగా వున్నప్పుడు మనిషికి విచిత్రమైన ఆలోచనలొస్తాయి.

ఇంతకీ...., తనకలాంటి థ్రిల్ కలిగించే వ్యక్తి ఎప్పటికైనా ఎదురౌతాడా?

అరెరె! తన ఆలోచనలు మళ్ళీ తనని పక్కదార్లు పట్టిస్తున్నాయి. ఆలోచనల్లో పడి తనువెళ్తున్న పనిగురించే మర్చిపోయింది.

ఎక్కడికి వెళ్తోంది తను?

అవును, గుర్తుకొచ్చింది.

ఆ విషయం గుర్తుకురాగానే ఆమె ఆలోచనలన్నీ ఎగిరిపోయాయి. మళ్ళీ ఈ భూమ్మీది కొచ్చిపడింది. స్టీరింగ్ మీద రెండు చేతులూ బిగుసుకున్నాయి. అప్రయత్నంగా యాక్సిలేటర్ బలంగా నొక్కింది. కారు హఠాత్తుగా వేగం పుంజుకొని శరవేగంతో ముందుకు దూసుకుపోనారంభించింది.

తను బయటికి వెళ్తుంటే ప్రభూ మామూలుగానే మళ్ళీ తన వెంటపడ్డాడు. తనే అతన్ని వారించింది. తానెక్కడికెళ్తోందో అతనికి తెలియడం తనకిష్టం లేదు. ఆ మాటకొస్తే ఎందుకు తనివన్నీ చేస్తోందో ప్రభూకి తెలియడం తనకిష్టం లేదు. ప్రభూ ఒక్కడికే కాదు ప్రపంచంలో మరెవ్వరికీ ఆ విషయం తెలియడం తనకిష్టం లేదు.

తనెందుకు ఇల్లు విడిచిపెట్టి వచ్చేసిందో మూడోకంటి వాడిక్కూడా తెలియకూడదు.

అవును, ఎవరికీ తెలీకూడదు.

జూడా ఒక్క పొరపాటు చేశాడు.

తన గతాన్నంతా క్షుణ్ణంగా తెలుసుకోగలిగాడు. కానీ...., తనెందుకు ఇల్లు విడిచిపెట్టి వచ్చేసిందో మాత్రం గ్రహించలేకపోయాడు.

ఆమె ఆలోచనలు మళ్ళీ జూడా చెప్పిన మాస్టర్ ప్లాన్‌వైపు మళ్ళాయి. ఆ మాస్టర్ ప్లాన్ గురించి ఆలోచిస్తున్న కొద్దీ పింకీకి చాలా ఎగ్జైటింగ్‌గా వుంది.

మణిపురం కొండలు, ఆ కొండల నడుమ దట్టమైన అడివి. అడివిలో కనీవినీ ఎరగని వజ్రాల గనులు. ఆ ఆలోచనే చాలా రొమాంటిక్‌గా అనిపిస్తోంది.

అయితే పింకీకి ఎగ్జైట్‌మెంటు కలుగుతున్నది ఆ వజ్రాలు గనుల గురించిన ఆలోచనకాదు.

వజ్రపాణి గురించిన ఆలోచన.

వ......జ్ర........పా.....ణి......!

ఆమె పెదవులు బిగించి యాక్సిలేటర్ మరింత బలంగా నొక్కింది.

అప్రయత్నంగా చేసిన ఆ పనితో కారు ఎంత వేగంగా వెళ్తున్నదో పింకీ గుర్తించలేదు. స్పీడో మీటర్ ముల్లు అరవై మీది నుంచి ఎనభై మీదికి వెళ్ళి ఆడుతోంది. కారు గాలితో పందెం వేస్తూ ముందుకు పరుగులు తీస్తోంది.

అంత వేగంగా వెళ్ళడానికి అది నేషనల్ హైవేకాదు. హైదరాబాదు మహానగరంలో ఓ రోడ్డు. ఆ రోడ్డు మీద ఎక్కువగా ట్రాఫిక్ లేకపోయినప్పటికీ ఎనభై మైళ్ళ వేగంతో కారు తోలడం చాలా ప్రమాదకరమైన పని.

వజ్రపాణి గురించిన ఆలోచనతో తను అప్రయత్నంగా చేసిన పొరపాటు గుర్తించేసరికే ఆలస్యం జరిగిపోయింది. ఎదురుగా ఓ పొడవాటి టొయోటా మినిమమ్‌స్పీడులో హుందాగా వెళ్తూ వుండడం కంటబడేసరికి పింకీ అదిరిపడింది. ఎదురుగా వెళ్తున్న ఆ కారుని చూసుకునే లోపలే తన కారు దాన్ని చాలా ప్రమాదకరంగా సమీపించేసింది. ఎదురుగా టొయొటాని చూసిన మరుక్షణం పింకీ సడన్ బ్రేకుతో తన కారు ఆపడానికి ప్రయత్నించింది కారు చక్రాలు కీచుమంటూ శబ్దం చేశాయి. అయినా లాభం లేకపోయింది. కారు ఆగే లోపలే వెనకనుంచి టొయొటాని వేగంగా వెళ్ళి గుద్దుకుంది. ఆ మరుక్షణం పెద్ద శబ్దం వినిపించింది. లోహాన్ని లోహం గుద్దుకున్న శబ్దం!



## వినోద్ అడుగు జాడల్లో అమీర్‌ఖాన్

వినోద్‌ఖన్నా అడుగు జాడల్లో నడుస్తున్నాడట అమీర్‌ఖాన్ అడుగుజాడలంటే నటనలో కాదు నిర్మాతల్ని ఏడిపించటంలో

'దౌలత్‌కి జంగ్', 'అఫ్సనా ప్యార్‌కా' చిత్ర నిర్మాతలు అమీర్ వల్ల నానా యిబ్బందులు పడుతున్నారట జుహీ చావ్లా, నీలం ఈ చిత్రాల్లో హీరోయిన్లు కాని యిటీవల బాగా రాణిస్తూ వస్తున్న మాధురి దీక్షిత్ హీరోయిన్‌గా లేకపోవటమే అమీర్ వైఖరికి కారణమట. జుహీ, నీలంలలో చూడని అందాలేవో మాధురిలో కనిపించాయేమో ఈ కుర్ర హీరోకి.

ఎప్పుడైతే యాక్సిడెంట్ అనివార్యమని గుర్తించిందో ఆ మరుక్షణం పింకీ అప్రయత్నంగా స్టీరింగ్ వదిలేసి రెండు చేతుల్తోనూ తల కవర్ చేసుకుంటూ గట్టిగా కళ్ళు మూసుకుంది. ఆ క్షణంలోనే ఆమెకు ప్రాణాల మీద ఆశలు పోయాయి. ధైర్యస్తురాలు కాబట్టి సరిపోయింది. కొంచెం పిరికి గుండె కలదై వుంటే ఆ రెండు కార్లూ గుద్దుకోకముందే షాక్‌తో ప్రాణాలు పోయి వుండేవి. నిజానికి రెండు కార్లూ గుద్దుకున్న శబ్దం వినిపిస్తూనే ఆమె తన ప్రాణాలు పోయాయనే అనుకుంది.

చిత్రం!

అలా జరగలేదు.

తన ప్రాణాలు పోలేదు. తను సురక్షితంగానే వుంది.

కనీసం తన వంటిమీద చిన్న దెబ్బ కూడా తగల్లేదు.

ఇది నిజమా భ్రాంతా?

ఇది నిజంకాదు భ్రాంతేనేమో. నిజంగా తన ప్రాణాలు పోయాయేమో, తన ప్రాణాలు పోయాక గాల్లో కలిసిపోయిన తన ఆత్మ ఇలా ఆలోచిస్తుందేమో!

ఆమె నెమ్మదిగా కళ్ళు తెరిచి చూసింది.

ఆశ్చర్యం!

తన ప్రాణాలు పోలేదు. తను భ్రాంతికి లోనుకావడంలేదు. తన ప్రాణాలు పోయి తన ఆత్మ ఆలోచించడం లేదు. తను బాగానే వుంది. బాగానే యేం ఖర్మ- సురక్షితంగా వుంది.

ఆమె తల తిప్పి అయోమయంగా అటూయిటూ చూసింది.

అవును, అదే రోడ్డు. అదే కారు. తను తన కార్లోనే కూర్చుని వుంది. మైగాడ్, ఎంత పెద్ద ప్రమాదం నుంచి తప్పించుకుంది తను వెంట్రుకవాసిలో ప్రాణాలు పోకుండా తప్పించుకోగలిగింది.

హఠాత్తుగా ఆమెకు మరో ఆలోచన కలిగింది. ఎదురుగా తను గుద్దేసిన కార్లో ఎవరున్నారో! ఎవరి ప్రాణాలైనా పోయివుంటాయా?

ఆ ఆలోచన కలుగుతూనే ఆమెకు తల దిమ్మంతా ఒక్కసారిగా వదిలిపోయినట్టనిపించింది. గిరుక్కున పక్కకు తిరిగి డోరు తెరవబోతూ ఆగిపోయింది.

(ఇంకా వుంది)

# స్పందన

## వియోగి

అతను అలా అప్పుడు రైల్లో కలవక పోతే ఈ కథ రాయాల్సిన అవసరం ఉండేది కాదు.

ఉద్యోగరిత్యా రాయలసీమలోని కర్నూలుకు బదిలీ అయ్యాను. అప్పటి దాకా నేను సర్కారు జిల్లాల్లో హైద్రాబాద్‌లో పని చేసి ఉండటం వలన ఆ జిల్లాలకు ఈ జిల్లాకు ఉన్న తేడా ఏమిటో యిట్టే పట్టేశాను.

సాయంత్రం అయితే ఎక్కడికి పోవాలో అర్థం అయ్యేదికాదు. పగలల్లా ఆఫీసు హడావిడితో కాలం చెల్లిపోయేది. కాని ఎటొచ్చి సాయంత్రాలు గడవడం చాలా కష్టంగా ఉండేది ఎన్నిసార్లు అని సినిమాలు చూడను నేను చూస్తున్నానని వాళ్ళు తొందర తొందరగా కొత్త పిక్చర్లు తెప్పించరుగా. పైగా సినిమా చూసినప్పుడల్లా చాలా వెలితిగా ఫీలయ్యే వాడిని.

స్వర్గంల్లాంటి నెల్లూరు సినిమాహాళ్ళల్లో విజయవాడ- హైద్రాబాద్ సిటీల్లోని రెండు టాకీసుల్లో సినిమాలు చూసి కర్నూలులోని థియేటరులో సినిమా చూస్తే రాజును చూసిన కళ్ళతో మొగుడ్ని చూస్తే అన్నంత చికాకు కలిగేది.

సీట్లు బావుండవు. అప్పర్ క్లాసులకు కూడ నెంబర్లు యివ్వరు. టికెట్టు దొరికినా సీటు దొరకదు అన్నీ బావున్నాయనుకుంటే బొమ్మ సరిగా కనపడదు. కార్బన్ ... మార్చకపోయినా ఎవరూ పట్టించుకోరు. బొమ్మ ... సౌండులో క్లారిటీ లేకపోయినా పట్టించుకోకుండా పరమానందంతో చూసే ప్రేక్షకుల్ని చూస్తే నాకు పిచ్చెక్కేది

ఆ విధంగా నాకు సినిమాల పైన ఉన్న గౌరవభావం పోగొట్టుకోవడం యిష్టం లేక సినిమాలు చూడడం బాగా తగ్గించేశాను.

మధ్య తరగతి మనిషికున్న ఏకైక వినోద సాధనం మానేసరికి నిజంగానే సాయంత్రాలు ఎలా గడపాలని పొద్దున్నుండే దిగులు ముంచుకొచ్చేది

రాయలసీమను రాళ్ళసీమని ఎందుకంటారో నాకు అవగతం అవసాగింది. కర్నూలు 'త్రిడీ' లకు ప్రసిద్ధి! విజ్ఞానం పెరగని కాలంలో నే 'త్రిడీ' కర్నూలుకు ఎలా వచ్చిందని ఏమాత్రం ఆశ్చర్యపోనక్కరలేదు ఎందుకంటే డాక్టర్, డాంకీ, డస్టులకు కందనవోలు ఖ్యాతి నార్జించింది కనుక

అలా అనంత విశ్వంలో రాకెట్‌లో ఒంటరిగా ప్రయాణం చేస్తున్నట్టు ఆరు నెలలు గడిపేశాను

చివరికి ఓ సాహితీ సంస్థను స్థాపించి- చుట్టూ వున్న చీకటిని తిట్టుకోకుండా ఓ చిరుదీపం వెలిగించి- నాకు తోచినసేవ చేద్దామనిపించింది

ఉత్సాహవంతులైన మిత్రులను కలిశాను వాళ్ళు చేతి చమురును భాగోతం లేని ఏ ప్రక్రియ చేయడానికైనా తమ సంసిద్ధత తెలియచేశారు.

మొదటిసారిగా ఓ పార్కులోని చెట్టు కింద సమావేశమయ్యాం. కొన్ని చర్చలు అయిన తరువాత పార్థసారథి తన అమూల్యమైన అభిప్రాయం సెలవిచ్చారు

"సాహిత్యం దిగజారిపోతున్న ఈ రోజుల్లో ఈ వారం ఫలానా పత్రికలో 'రసశ్రీ' గారి అరుణోదయం అద్భుతంగా ఉంది"

"సాహిత్యం దిగజారిపోతున్నదని ఎందుకను కుంటున్నావు?" నేను అడుగుతున్నాను అతను అలా విమర్శించడం నచ్చక.

"ఎందుకంటే నేను కొన్ని పత్రికల్లో వస్తున్న సాహిత్యాన్ని సెన్సార్ వారికి పంపిస్తే సంస్కారం చేస్తారు కనుక" చెప్పాడు.

"అవును. ఈ మధ్య ఓ పత్రిక యింటికి తీసుకుపోయాను మా శ్రీమతి ఒకటే సణిగింది. బూతు పత్రికలు యింటికెందుకు తెస్తారండీ అని" చెప్పాడు శేషగిరి- అతనికి కొత్తగాపెళ్ళయింది

"అసలు మీ క్లబ్ యిలాంటి పత్రికలు కూడ తెప్పిస్తారని కొందరు ఆశ్చర్యపోతున్నారు" ఆనందరావు కూడ తన స్వీయ అనుభవాన్ని వివరించేరు.

"చూడండి. పెద్దలకు మాత్రమే అని పత్రిక మీద ఎక్కడా రాసి వుండదు పైగా సంసార పక్ష పత్రికలు అని కవరు పేజీ మీద పెద్ద అక్షరాలతో రాస్తారు అందుకని అవి మన క్లబ్‌కొస్తున్నాయి" సెక్రటరీగా నేను చెప్పాను

"మరి పిల్లలకి చదవడానికి పనికిరాని సాహిత్యాన్ని ఏమనాలి?" పార్థసారథి పాయింటాఫ్ ఆర్డర్ లేవదీశారు

"చూడు సారథి! నువ్వు ఎంతో గొప్పగా అభిమానించే ప్రాచీన సాహిత్యంలో కూడ ఎంతో బూతు వుంది. అది అయితే పద్య రూపంలో చెప్పబడింది కాబట్టి చట్టబద్ధమైంది పాఠకుల దృష్టిలో నేడు ఆధునిక రచయితలు గద్య రూపంలో చెపుతున్నారు కాబట్టి మీరు తప్పు పడుతున్నారు అదే వీరే ఆ భావాల్ని పద్యంగా మల్చి ఉంటే బహుశ మీరే వీర్ని భుజానికి ఎత్తుకుని తిరిగేవాళ్ళేమో' నా కామెంట్‌తో మా సమావేశం గందరగోళంలో పడిపోయింది ఎవరికి తోచినట్టు వారు అరవడం- కేకలు పెట్టడం- చేతికందినవి విసరడంతో అసెంబ్లీ వాతావరణాన్ని సృష్టించారు గత్యంతరం లేక ఆ రోజు అర్థాంతరంగా సమావేశం- సభావేశం ముగించాం

అప్పటికే పార్కులో ఆడుకుంటున్న పిల్లలు మాట్లాడుకుంటున్న పెద్దలు- మమ్మల్ని సంఘ విద్రోహులుగా భావించినట్టున్నారు. మా చుట్టూ వలయంగా చేరారు.

అప్పటి నుండి మా సమావేశాలు పదిమంది ఉండే చోటు కాక- కొంచెం నిర్జనమైన ప్రదేశాన్ని ఎన్నుకొని జరిపేవాళ్ళం.

కాని- అప్పుడప్పుడు 'రసశ్రీ కథల గురించి పొగడ్త వినిపిస్తూనే ఉండేది.

"కొత్త రచయితలాగున్నాడు- అయినా బాగానే రాస్తున్నాడు"

"కుర్రాడులాగున్నాడు- మాంచి అభ్యుదయ భావాల్తో రాస్తున్నాడు".

"చక్కటి యితివృత్తాల్ని ఎన్నుకుని- చిక్కటి శైలితో రాస్తున్నాడు"

"బాగా పైకి వచ్చే లక్షణాలున్నాయి".

మందుదింతలు మలయమారుతం-"

వాళ్ళభిప్రాయాల్తో క్రమంగా నేను ఏకీభ వించేవాడ్ని.

"ఓ రోజు నాకు ఆశ్చర్యం కలిగేలా పార్థసారథి 'రసశ్రీ' మీద విరుచుకుపడ్డారు.

"ఛ ఛ! ఎంత దిగజారిపోయాడు- నాలుగు మంచి కథలు రాశాననుకుంటే- కళ్ళు నెత్తికొచ్చాయి"

"ఏం జరిగింది?" శాంతంగా అడిగాను.

"ఆ పత్రిక చూడలేదా?" ఏ పత్రికో చెబుతూ అడిగాడు

నేను చూడలేదన్నట్టు తలూపాను,

"ఏకాకి" అనే కథ చదువు తెలుస్తుంది- చాలా చెత్తగా రాశాడు అంతా యింతా కాదు-'

"ఏం? థీమ్ బాగో లేదా"'

"థీమా? అసలుందాని?"

"పోనీ- శైలి దెబ్బతిందా"'

"శైలి గంగాప్రవాహం"

"అయితే తప్పకుండా శిల్పం తల్పంలా పడుకుని ఉండాలి- అంతేకదూ"

"ఛ! ఛ! శిల్పమా- కవా? నోటికొచ్చిన కూతలు రాసుకుపోయాడు

నాకు అర్థం కాక శేషగిరి వంక చూశాను

"కొంచెం గురూగారు శృంగారం పాలు ఎక్కువ చేశారు" మెలికలు తిరుగుతూ చెప్పాడు

'ఆ రకంపాలు ఉన్నాయని నాకు తెలియ' ఆనందరావు అమర్యాదగా తన అజ్ఞానం ఒప్పుకున్నాడు

"మూర్ఖుడా' పాలుకాదు- పెరుగుకాదు- అది బూతు" పార్థసారథి చెప్పాడు.

'చూడు సారథి! కథకు అవసరమైతే సమయోచితంగా శృంగారం రాస్తే తప్పులేదు." నేను చెప్పాను

"శృంగారం కోసమే కథ రాస్తే' అతడు ప్రశ్నించాడు

"అది అంగారం అవుతుంది ' శేషగిరి చెప్పాడు.

"బంగారం కాదా"' కోపంగా అన్నాను. కథలు రాసే శృంగారం కంటే నిజ జీవితంలో ఎన్నో రెట్లు

ఎక్కువుంటుంది మరి మీరు మరీ యిలా మడి కట్టుకుని-"

"శీనూ! సాహిత్యానికొక ప్రయోజనం అంటూ ఉంటే అది సమాజాన్ని బాగు చెయడం అని నమ్ముతాను "సారది నన్ను ఉద్దేశించి చెప్ప సాగాడు" అంతేగాని ధనార్జన కోసం పచ్చి బూతులు రాసి సమాజం మీద వదిలేవాడు క్షమార్హుడు కాదని నా అభిప్రాయం"

"శృంగారం కూడ సమాజ శ్రేయస్సులో ఓ భాగం కాదా?" నేనన్న దానికి ఈసారి వాళ్ళు తెల్ల బోయారు

"అదెలా?!"

"కొన్ని దేశాల్లో పిల్లల్ని కంటే యింక్రిమెంట్లు ప్రమోషన్లు యిస్తున్నారు- మన దేశంలోలా జనాభా నియంత్రణ చేస్తే యింక్రిమెంట్లు యివ్వడంలేదు- పనిష్మెంటు యిస్తున్నారు"

ఇంకా వాళ్ళు షాక్‌లో నే ఉన్నారు.

"ఎందుకు? వాళ్ళ జాతిని అభివృద్ధి చేసు కోవడానికి. వాళ్ళ దేశంలో విదేశీయుల జనభా శాతం తగ్గించడానికి శ్రమశక్తిని పెంచడానికి" చెప్పాను గర్వంగా ..

"నిజమే కాని- రచయిత తనున్న సంఘం దృష్టిలో పెట్టుకుని రాయాలి. "రసశ్రీ" బహుశా ఆంధ్రలో నే ఎక్కడో ఉండి ఉంటాడు మన పరిస్థితులు నువ్వు చెప్పిందానికి భిన్నంగా ఉన్నాయి". చటుక్కున పార్థసారథి మెరుపులాంటి పాయింట్ లేవదీయ డంతో నా నోరు మూతపడింది.

అప్పటి నుండి వాళ్ళు 'రసశ్రీ' పట్ల చులకనతో 'వ్యవహరించసాగారు. దురదృష్టంకొద్దీ 'రసశ్రీ' తరువాతి రచనలు కూడ, నాకు మటుకు నాకు, దిగజారినట్లు అనిపించింది అందుకని క్రమంగా 'రసశ్రీ'ని ఖండించే వాళ్ళల్లో నేను కూడ కల్సిపోయాను. మా సాహితీ మిత్ర సంస్థ బలపడింది. దానికి మెంబర్‌షిప్ కూడ వసూలు చేయడం మొదలెట్టాం మా కార్యక్రమాలు విస్తరింప చేశాం-

చివరికి ఆదివారం ఆదివారం ఓ కాలేజీలో నో- స్కూల్లోనో-దాతలను బట్టి- ఓ ప్రముఖ రచయి తను కాని- కవిని కాని- ఉపన్యాసకుడ్ని కాని పిల్చి సాహిత్యం మీద ఉపన్యాసాలు యిప్పించ తలపెట్టాం

ఆ సందర్భంలో హైదరాబాద్ నుండి ఓ ప్రముఖ కవిని పిలవమని నాకు ఆర్డర్లు జారీ చేశారు మిత్రులు. ఆయన చాలా బిజీ మనిషి! ఉత్తరాలకు జవాబులిచ్చేంత తీరిక ఉండదు. కాని చక్కని వక్త కూడ కావడం వలన- నేనే పోయి పిలిస్తే తప్పకుండా మా ఊరుకు వస్తాడనే ఆశ నాలో చిగురించింది.

తుంగభద్ర ఘళగానే పోతుంది హైదరాబాద్‌కు. అందుకని నేకూడ లీజరుగా వచ్చి రైలు పోయే టప్పుడు ఎక్కి ఓ సీట్లో కూర్చున్నాను. కర్నూలు నుండి హైదరాబాద్‌కు ఈ తుంగభద్ర చాలా సౌకర్యంగా ఉంటుంది. నాలాంటి జోగారావులు హాయిగా నిద్రపోవచ్చు.

ఖాళీగా ఉన్న సీట్లో పడుకున్నాను- నిద్ర నాకున్న వరం- ఒక్క నిమిషంలో కన్నులు మూతపడి పోయాయి.

ఎవరో లేపుతే లేచి కూర్చున్నాను.

"పగలు పూటేంటి నిద్ర- మిగతా వాళ్ళు 'కూర్చోవద్దా?" ఓ మధ్యపాటి వయసున్న పెద్దమనిషి



ప్రశ్నిస్తున్నాడు.

"అక్కడంతా ఖాళీగా ఉందిగా- నా నిద్రే చెడగొట్టాలా?"

"సరేలే- ఆడోళ్ళ పక్కన పోయి కూర్చో మంటావా?"

"తప్పేంటి?" విసుగ్గాఅన్నాను మత్తుతో

"య్యోవ్! మీ ఆడాళ్ళ పక్కన యింకోడు కూచుంటే ఊరుకుంటావుటయ్యా?" అతను అడిగాడు

నాకు ఒళ్ళు మండింది "గూబ పగులగొడతా" చెప్పాను

"అందుకనే- అలా గూబ పగులగొట్టించు కోవడం- నాకిష్టంలేదు- ఇక్కడ కూర్చుంటాను- నీకిష్టమైతే అక్కడే కూర్చోడానికి ప్రయత్నించు" అన్నాడు ఆడవాళ్ళ వైపు చెయ్యి చూపిస్తూ-

వీడెవడో సెమీ క్రాక్‌లాగున్నాడు- నాకెందుకులే అనుకుని నోర్మూసుకుని చోటిచ్చాను- కిటికీకి అనుకుని. కాసేపటికి అతను పత్రిక, సంచీలోంచి తీసుకుని, చదవడంలో నిమగ్నమైపోయాడు.

కూర్చోవడానికి కొంచెం అసౌకర్యంగా ఉండటం వలన నిద్రకు ఫుల్‌స్టాప్ పెట్టి ఓ ప్రత్యేక సంచిక తీసుకున్నాను. అలా బొమ్మలు తిరగేశాను ఏదీ చదవ బుద్ధికాలేదు. భద్రంగా నా కాలి కింద పెట్టేసుకున్నాను

"కొంచెం ఆ పుస్తకం యిస్తారా?" ఆ పెద్దమనిషి అడిగాడు.

"ఇవ్వను" ఖచ్చితంగా చెప్పాను- నా నిద్ర చెడగొట్టాడు మరి.

"ఇప్పుడే యిచ్చేస్తాను- ఓ కథ చదివి" బతిమాలాడు

"ఊళ్ళో వాళ్ళందరికి యివ్వడానికి కాదండి నేకొంది. నే చదువుకోడానికి" కరుగ్గాచెప్పాను

అతను చిన్నబుచ్చుకున్నాడు. నాకు జాలేసింది.

"అంత యింట్రస్టు ఉన్న వాళ్ళు కొనలేకపోయారా?"

"కొందామని ప్రయత్నించాను- ఈసారి చాలా తక్కువ కాపీలు వచ్చినట్టున్నాయి- దొరకలేదు" అతను చెప్పాడు. అతని మాటల్లో నాకు సిన్సియారిటీ కనిపించింది.

మౌనంగా అతని పత్రికందుకుని- నా ప్రత్యేక సంచిక అతనికిచ్చాను అలవోకగా అతడిచ్చిన పత్రిక చూస్తూనే అతనేం చదువుతున్నాడని ఓరకంట గమనిస్తున్నాను.

అతను 'రసశ్రీ' కథ చదివాడు. చదివి వెంటనే నాకు పుస్తకం వాపసు యిచ్చాడు.

'వెరీ చీప్ టేస్టు' అని మనసులో అనుకున్నాను. పైకి పెద్దమనుషుల్లా కనిపించే వాళ్ళు కూడ 'రసశ్రీ' కథ చదవాల్సిందేనా- వయసు కూడ కాదు.

"అప్పుడే యిచ్చేశారేం?" యథాలాపంగా అడిగాను.

"నాక్కావలసిన కథ చదివి యిచ్చేశాను-" చెప్పాడు.

"ఏదీ 'రసశ్రీ' కథ 'సబ్బు బిళ్ళ'? వ్యంగ్యంగా అడిగాను.

"అరె మీకెలా తెల్సు?"

"ఆ మాత్రం తెలీదా? మీలాంటి వాళ్ళు ఏది చదువుతారో?" చాలా వ్యంగ్యంగా అతన్ని హీనంగా చేస్తూ చెప్పాను

కాని- అతను ఎంతో పొంగిపోయాడు. దాన్ని మెచ్చుకోలుగా తీసుకుని తనలో తానే నవ్వుకున్నాడు.

అతనికి కొంచెం పిచ్చి ఉందేమో అనిపించింది

"మీరు ఆ కథ చదివారా?" కుతూహలంగా అడిగాడు

"చదవలేదు- చదవను కూడ" తపీమని చెప్పాను

"మీకు కథలంటే యిష్టం లేదా?" మొహం మాడ్చుకుని అడిగాడు అతను.

"సాహిత్యమంటే నాకు ప్రాణం" గర్వంగా చెప్పాను.

"చిత్రంగా మాట్లాడుతారు మీరు?"

"నేను సాహితీ మిత్ర సంఘానికి సెక్రటరీని" అంటూ కవిగార్ని పిల్చుకురావడానికి పోతున్న వైనం చెప్పాను.

"చాలా సంతోషం- నా పేరు రవిచంద్ర మారుమూల పల్లెలో బ్యాంకులో పని చేస్తాను" అతను పరిచయం చేసుకున్నాడు.

"మరి- ఆ కథ ఎందుకు చదివారు?" నేనడిగాను.

"అంటే- బ్యాంకులో పని చేస్తే కథలు చదవకూడదా!"

"అలాగని కాదు- ఆ చెత్తకథ- చదవ కూడదని?"

"నా ఉద్యోగానికి- కథకు సంబంధం ఏమిటి?" అతను మొహం గంటు పెట్టుకుని నిలదీశాడు. చెప్పక తప్పిందికాదు.

"బ్యాంకులో పని చేస్తున్నారంటే బాగా చదువుకున్న వారై ఉండాలి- బాగా చదువుకున్న వాళ్ళు సాధారణంగా ఉత్తమ సాహిత్యాన్ని ఆదరిస్తారు. మీరు కూడ ఆ కోవలో చేరి ఉంటారని నేననుకున్నాను."

"ఏం? ఇప్పుడలా అనుకోవడం లేదా?" హీనస్వరంతో అడిగాడు

"అహ! 'రసశ్రీ' కథ చదివారంటేనే నాకు మీ చీప్ టేస్టు అర్థమయింది ఆ పుస్తకంలో అంతమంది గొప్ప రచయితల కథలుంటే ముందస్తుగా మీరు ఆ 'సబ్బుబిళ్ళ' చదివారంటే కారణం-"

"కారణం- నేనే రాశాను కాబట్టి" బులెట్‌లా పేల్చాడు

ఈ సారి నాకు మతిపోయింది. ఆ షాక్ నుండి తేరుకోవడానికి కొన్ని నిమిషాలు పట్టింది. కొంచెం గుండెల్లో దడ వచ్చింది. ఇందాక నేనేమన్నా తప్పుగా మాట్లాడానా అని ఆలోచించసాగాను.

"చదవకుండానే మీరు నా కథని చెత్తని తేల్చేశావే?" అతని ప్రశ్నలో బాధ- అసంతృప్తి కనిపించాయి.

"ఆ పేరు పట్టి- ఊహించాను" నాన్నాను

"అంటే మీ ఉద్దేశ్యం నే రాసేవన్నీ చెత్తకథలనా?" కోపంగా అడిగాడు

అంత దూరం వచ్చిం తర్వాత యిరకా అగదల్చుకోలేదు.

"అన్నీ అని నేను చెప్పను కొన్ని మాత్రం చెత్త అని ఘంటాపథంగా చెప్పగలను" ఆయన మొహంలో రంగులు మారుతుంటే చెప్పుకుపోయాను మీ కథల్లో శృంగారం



## బొంబాయి అంటే "జూహీ"కి యిష్టం!

అందం, నటన కలబోసుకున్న 'జూహీచావ్లా'కు "ఖయామత్ సే ఖయామత్ తక్" చిత్రం ఎంత మంచి పేరు తెచ్చిపెట్టిందో 'సల్తానత్' చిత్రం అంత గుర్తింపు లేకుండా చేసింది. 'ఖయామత్....' చిత్రం ఆమెను అందలం ఎక్కించి 'ఎ' గ్రేడ్ నటిగా నిలిపింది. అమీర్-జూహీల జంట వుంటే చిత్రం విజయవంతమవుతుందనుకునే వాళ్లు. కాని అదే జంటతో వచ్చిన లవ్-లవ్-లవ్ చిత్రం విజయవంతం కాకపోవటంతో పరిశ్రమలో వెలుగులోకి రాలేకపోయింది జూహీ.

ప్రాంతీయ చిత్రాలలో అవకాశం వచ్చి 'ప్రేమలోక' అనే కన్నడ చిత్రంలో రవిచంద్రన్‌తో నటించింది. ఆ చిత్రం ద్వారా జూహీ ఎంతో మంది యువతీ యువకులకు 'ప్రేమ' దేవత అయింది. ప్రాంతీయ చిత్రాలు విజయవంతమవుతున్నప్పటికీ హిందీలో అవకాశం కోసం పాట్లు పడుతూ బొంబాయిని వదలనంటోంది జూహీచావ్లా. ఇందుకోసం ఎన్ని ఒడిదుడుకులనైనా తట్టుకుంటా



నంటోంది. ప్రాంతీయ చిత్రాల్లో డైలాగులు చెప్పేందుకు ఎలాగూ డబ్బింగ్ ఆర్టిస్టులు వున్నారు కాబట్టి ఆ చిత్రాల్లో నటించేందుకు యిబ్బందేం లేదంటోంది కూడా.

'శాంతి-క్రాంతి' పేరిట రవిచంద్రన్ తెలుగు, హిందీ, తమిళ, కన్నడ భాషల్లో జూహీ హీరోయిన్‌గా చిత్రాన్ని నిర్మిస్తున్నాడట. తెలుగులో నాగార్జున సరసన, హిందీ, తమిళంలో రజనీకాంత్ సరసన, కన్నడంలో రవిచంద్రన్ సరసన జూహీ నటిస్తోందట.

"ఖయామత్" తర్వాత జహ్రీలే, షాందార్ చిత్రాలు జూహీకి మంచి పేరు తీసుకురాలేకపోయాయి. బి.ఆర్. చోప్రా నిర్మించిన టి.వి. మహాభారత్‌లో ద్రౌపదిగా ఒప్పుకొని వుంటే టి.వి.ని ఈ పాటికి జూహీ ఏలుతూ వుండేది. అవకాశమనేది ఒక్కసారే తలుపు తడుతుంది. అది జారవిడుచుకుని బాధపడి ప్రయోజనమేముంది. అవకాశాలు వచ్చినప్పుడే వాటిని వినియోగించుకోవాలంటున్నారు అనుభవజ్ఞులు. కాని జూహీ మాత్రం సెల్యులాయిడ్ ప్రపంచాన్ని ఏలే అవకాశం మళ్లీ ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తోందట!

మితిమీరి ఉంటుంది. మీరే ఉద్దేశ్యంతో అది రాస్తారో నాకు తెలీదు బహుశ డబ్బుకని నేననుకుంటాను- కాని ఆ వెధవ డబ్బు కోసం మీరు ఈ తుచ్ఛమైన రచనలు చేసి సంఘాన్ని ఎంత పాడు చేస్తున్నారో తెల్సా? ముఖ్యంగా ఎదిగీ ఎదగని వయసులో ఉన్న కుర్రకారు పైన విపరీతంగా ఉంటుంది. ఆ వయసులో వారికి ఆకర్షణ తప్ప విచక్షణ ఉండదు మనసు ఊరికే పెడదార్లు పడుతుంది. అటువంటి వారిని మీ కథలు రెచ్చగొడతాయి" నాకు ఆవేశం వస్తే ఒళ్ళు తెలీదు చెప్పి ఆయన వంక చూసేసరికి ఉబుకుతున్న కన్నీళ్ళను ఆపుకోవడానికి రుమాలు మొహానికి అడ్డం పెట్టుకున్నాడు.

"మరి నా కథలు చాలా గొప్పగా ఉన్నాయని- ఎంతో ఆనందించామని ఎన్నో ఉత్తరాలు పత్రికల్లో వస్తూంటాయి- బహుశ మీరు చదివి ఉండరు" తన్ను సమర్థించుకుంటూ ఆయన చెప్పాడు.

"నిజమే! వచ్చే ఉంటాయి- ఎందుకంటే అలా రాస్తే కాని పత్రికల్లో పాఠకులు వారి పేర్లు చూసుకోలేరు. అచ్చులో తమ పేరు చూసుకుందామనే మోజులో అలా ఆకాశానికి ఎత్తేస్తూ ఉత్తరాలు రాస్తారు" వివరించాను పాఠకుల సైకాలజీ.

"అలానా! అయితే నే మోసపోయాను" ఈసారి ఆయన కన్నీళ్ళు ఆపుకునే ప్రయత్నం చేయకుండా రుమాలుతో తుడ్చుకున్నాడు.

నాకు నిజంగా జాలేసింది. బాగా గాయపర్చినట్లున్నాను.

"మీరు మొదట్లో రాసిన కథలు చాలా బాగుండేవి" చెప్పాను

ఆయన కళ్ళు మెరిశాయి "నిజంగానా?!"

"ఆఁ! మేమంతా చదివి ఓ గొప్ప రచయిత పుట్టుకొచ్చాడని గర్వించేవాళ్ళం మా సమావేశాల్లో తరచు మీ కథల్లోని గొప్పతనం గురించి చర్చించుకునేవాళ్ళం- కాని మా ఆశలు నీరు కారుస్తూ- కొన్నాళ్ళకు మీరు మామూలు ధోరణిలో పడ్డారు"

"మరి నా కథలు అంత బాగా ఉన్నాయని మెచ్చుకున్నప్పుడు మీరో ఉత్తరం కూడ రాయలేదు. నాకు కాకపోయినా పత్రిక్కి రాయచ్చుగా"

"అబ్బే! అంత తీరికెక్కడిదండి. పైగా ఉత్తరాలు రాసి పేరు చూసుకోవాలనుకునే మోజు లేదు మమంతా బాగా వివేకవంతులం. చదువుకున్న వాళ్ళం- మెచ్యూర్డు బ్రెయిన్సు ఉన్న వాళ్ళం-ఓ వయస్సు వచ్చేసింతర్వాత యిటువంటివి చేయాలనిపించదు" చెప్పాను.

"ఆఁ! అదే నన్నిలా దిగజార్చింది మీలాంటి మంచి పాఠకుల నుండి స్పందన లేకపోయేసరికి నేను నా ధోరణి మార్చుకున్నాను- కనీసం ఒక్క ఉత్తరం వచ్చినా యింతటి పొరపాటు జరిగేది కాదు-"

ఆయన మాటలకు నేను స్పందించిపోయాను బిక్కమొహంతో.

"అంటే మేం మీకు ఉత్తరాలు రాస్తే కాని తెలీదు- మీరు రాసింది మంచి కథో? కాదో?"

"తెలుస్తుంది కాని పాఠకులు ఆదరించనప్పుడు ఏమవుతుంది? రచయిత ఆత్మవిశ్వాసం దెబ్బ తింటుంది నేనుండేది ఓ మారుమూల పల్లెటూళ్ళో! అక్కడ సాహిత్యం అంటే ఎవరికీ పట్టదు. నా కథ పడింది అని చెబితే- అయితే నాకేం అన్నట్లు చూస్తారు కొలీగ్స్‌లో కూడా రసహృదయులు లేరు ప్రొఫెషనల్ జెలసీ ఉన్న వాళ్ళు తప్ప. అటువంటి పరిస్థితుల్లో నేను పాఠకుల ఉత్తరాలు పట్టి నా కథకు ఎంత గుర్తింపు వచ్చిందో అర్థం చేసుకుంటాను" అతను చెప్పాడు అతని బాధ.

"కాని మేం విమర్శిస్తూ ఉత్తరం రాశామనుకోండి- పత్రిక సర్క్యులేషన్ దెబ్బతింటుందని ప్రచురించరు కదా?" ధర్మసందేహం వెలిబుచ్చాను

"నిజమే! కాని అటువంటి ఉత్తరాన్ని వాళ్ళు నాకు రీడైరెక్టు చేసే అవకాశం ఉంది. కనీసం నా నెక్స్ట్ కథల్లో అటువంటి తప్పును సరిదిద్దుకునేవాణ్ని. అతను సిన్సియర్‌గా చెప్పాడు. రైలు ఆగితే టాటా చెప్పి దిగిపోయాడు.

ఆ సంఘటన నేను అంత తొందరగా మర్చిపోలేకపోయాను అందుకే నాకు నచ్చిన కథను గూర్చి పొగుడ్తూ నచ్చని కథ గూర్చి తెగుడ్తూ ఉత్తరాలు రాయడం మొదలెట్టాను అప్పటి నుండి- నా స్థాయిని మర్చిపోయి. 'ఫీడ్ బ్యాక్' ముఖ్యమని ఆలస్యంగా తెలుసుకుని స్పందిస్తున్నాను- ఉత్తమ సాహిత్యాభివృద్ధి కోసం. ●

సీరియల్

# శత్రు సంహారం

## లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ-25 :** వైమానిక దళ పైలట్ రాహుల్ తన తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణించటానికి సంబంధించిన వివరాలు సేకరించే సందర్భంగా దుండగులను ఎదుర్కోవలసి వస్తుంది. కారవెల్లీ విమాన ప్రమాదానికి సంబంధించిన క్రూబాక్స్‌లోని ఇండికేటర్ కోసం అలయన్స్ సంస్థ అధిపతి దేవీప్రసాద్ మనుషులు గాలిస్తుంటారు. ఇండికేటర్ విషయం తెలిసిన రాహుల్ కూతురు సుషుమ్నను ఇబ్రహీం ఉంపుడుకత్తె దుర్గ ఎత్తుకుపోవాలని ప్రయత్నిస్తుంది. పాప తప్పించుకొని వెళ్తూ రోడ్డు ప్రమాదానికి గురవుతుంది. మనసు మార్చుకున్న దుర్గ రాహుల్‌కు పాపను అప్పగించి వెళ్లిపోయి ఇబ్రహీం చేతిలో మరణిస్తుంది.

మిస్టర్ చద్దా! జూబిలీహిల్స్‌లో నువ్వు నిర్మించుకున్న స్వర్గం కూలిపోయింది. ఆరోజు సైతాన్ దళం ప్రాధాన్యతని తగ్గించేందుకు శకునిలా ఒక పథకం రూపొందించావు.

నీ ఆలోచనలు ఫలించి వుంటే మేమంతా బజార్న పడవలసి వచ్చేది కదా! ఆ స్వర్గాన్ని కూల్చేశాడు వీర సైనికుడు రాహుల్!

అప్పుడు దురాశతో ఆలోచించిన వాడివి ఇప్పుడు నిరాశతో నిండిపోయావు. ఏది ఏమయినా నా అవసరాన్ని గుర్తించి నువ్వు మళ్లీ నా దగ్గరకు వచ్చినందుకు ఎంతో సంతోషంగా వుంది.

ఒక దేవీప్రసాద్ కోటీశ్వరుడు అయేందుకు సైతాను దళం ఎన్నెన్ని త్యాగాలు చేసిందో నీకు తెలుసు. నగరంలో ఎంత అల్లకల్లోలాన్ని సృష్టించిందో కూడా నీకు తెలుసు!

ఇన్ని త్యాగాలని ఇంత చరిత్రని నీ అతి తెలివితో చెరిపెయ్యాలనుకున్నావు. కాని అదంతా కల అని తేలిపోయింది. ఇప్పుడు మళ్లీ నా అవసరం వచ్చింది కాబట్టి నా దగ్గరకు వచ్చావు.

లేకపోతే నిశ్చింతగా నన్ను ఉరికంబం ఎక్కించాలనేకదా నీ పథకాలన్నిటికీ అర్థం?" అంటూ ఎగతాళి చేశాడు ఇబ్రహీం!

చద్దా తల దించుకున్నాడు. జూబిలీహిల్స్‌లో కెమికల్ వెపన్స్‌ని తయారు చేసే భవనం కూలిపోయాక అతని ఆత్మవిశ్వాసం నీరుగారి పోయింది. దేవీప్రసాద్ దృష్టిలో పలుచన అయాడు.

సైతాన్ దళాన్ని నడిపించే యిబ్రహీంని ఆశ్రయించటం మళ్లా అనివార్యం అయింది. అందుకే అతనికోసం వచ్చాడు.

"ఇబ్రహీం! ఇప్పుడు నువ్వు నమ్మకపోవచ్చు. కాని మనమంతా సుఖంగా ఉండాలనే నేను ఆ పథకం వేశాను. ఏది ఏమయినా ఆ ప్రయత్నంలో పరాజయం ఎదురు అయింది.

రాహుల్ వీర సైనికుడే అనుకోవాలి! అతను మన ఆయువుపట్టుని దాడిచేసి కూల్చేశాడు ఒంటరిగా! అటు పాపని దక్కించుకున్నాడు. ఇటు ఇండికేటర్‌ని దక్కించుకున్నాడు.

ఈ సారి పొరపాట్లు జరిగే అవకాశం లేకుండా ఎయిర్‌ఫోర్స్ వారికి రెసెర్చి సెంటర్‌లో దాన్ని అప్పగిస్తాడు. వారు ఇండికేటర్‌లోని సమాచారాన్ని ఎన్‌లైజ్ చేస్తారు.

శాస్త్రవేత్తలని చంపేందుకు మనం కారవెల్లి కాక్‌పిట్‌లో టైంబాంబు దాచిన సంగతి వెల్లడి అవుతుంది. ప్రభుత్వం కూడా మనని రక్షించలేదు. శ్రీ మహాదేవి అలయన్స్ సంస్థ మూత పడుతుంది.

దేవీ ప్రసాద్‌తో సహా మనమంతా ఉరి తాడుకు మెడ అప్పగించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

కాబట్టి నువ్వు వెంటనే నీ బలగంతో బయలుదేరాలి. ఎయిర్‌ఫోర్స్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో అప్పగించే ముందుగానే దాన్ని తీసుకు రావాలి! నీకు కావలసిన మనుషులు ఆయుధాలు తీసుకుని వెంటనే బయల్దేరు" అన్నాడు చద్దా అర్థింపుగా!

"అందితే జుట్టు పట్టుకోవాలనుకుంటావు. అందకపోతే కాళ్ల బేరానికొస్తావు. శకునివే అయినా చాలా తెలివిగలవాడివి. అయినా అవకాశం దొరికితే నన్నేం చేస్తావో అర్థమయింది కాబట్టి ఇప్పుడు నిర్మొగమాటంగా అడుగుతున్నాను.

ఆ ఇండికేటర్ తెచ్చి యివ్వాలంటే కోటి రూపాయలు యివ్వాలి."

"ఇబ్రహీం నువ్వు చాలా ఎక్కువ అడుగుతున్నావు."

"ఇలా మాటాడేందుకు నువ్వే కారణం. ఇంక ఈ పని సాధించిన తరువాత సైతాన్‌దళం నీ స్వాధీనంలో ఉండదు. మేమంతా దూరంగా వెళ్ళిపోతాం నగరాన్ని విడిచి.

అందుకే నువ్వా మొత్తాన్ని మాకు ఇవ్వాలి. అది కూడా ముందుగానే డబ్బు తెచ్చి ఇవ్వాలి! ఇది నా షరతు. ఇంకెప్పుడూ నిన్ను నమ్మను" అంటూ ఖండితంగా చెప్పేశాడు యిబ్రహీం!

అతని షరతులు ఒప్పుకోవడం తప్ప మరో దారి లేదని భావించాడు చద్దా!

"నేనే వెళ్లి డబ్బు తెచ్చి ఇస్తాను. పన్నెండు గంటల్లో ఇండికేటర్ నాచేతికి రావాలి" అన్నాడు తిరిగి వెళ్లేందుకు సిద్ధపడుతూ.

"డబ్బు ఇవ్వటమే నీ పని! ఆ తరవాత నేను చూచుకుంటాను".

"ఎక్కడికి తీసుకురావాలి?"

"శివాలయంలో గార్డుగా నేను పెట్టిన మనిషి ఉన్నాడు కదా! అక్కడకు రావాలి. ఆలస్యం జరిగితే ఆ తరువాత నాబాధ్యత ఉండదు."

"ఆ చోటు ఎక్కువగా జనసంచారం ఉండే చోటు కదా!"

"ఇలాంటి పనులు అలాంటి చోటే జరగాలి. ఎవరూ పట్టించుకోరు."

"సరే ఒప్పుకుంటున్నాను."

"అయితే వెళ్లిరా! నా ప్రయత్నాల్లో నేనుంటాను" అన్నాడు యిబ్రహీం!

అతని కంఠస్వరంలో వినూత్నమయిన ఉత్సాహం పలుకుతోంది. ఛద్దా పథకాలన్నీ తలక్రిందులు అయి అతను తనకు సరెండర్ అవటం తనకు ఎంతో ఆనందాన్ని ఇచ్చింది.

ఛద్దా తల దించుకొని వెళ్లిపోయాడు. నేరుగా మల్టీ నేషనల్ సంస్థ అయిన అల'యన్స్ కంపెనీలోకి వెళ్లాడు. ప్రధాన భవనంలో విశాలమయిన హాలులో జపమాల త్రిప్పుకుంటున్నాడు దేవీప్రసాద్.

ఛద్దా నేరస్తుడిలా లోపలకు వచ్చాడు. అతనిని చూడగానే యజమాని కన్నులు ఎరుపెక్కాయి. ఎన్నో సంవత్సరాలుగా స్వార్థం ఆలోచించకుండా సంస్థ కోసం అతను చేసిన త్యాగాలు గురుతుకు రాలేదు.

జూబిలీహిల్స్‌లో తయారవుతున్న కెమికల్ వెపన్స్ పథకం తలక్రిందులయింది. అక్కడ వున్న ప్రేలుడు పదార్థాల మొత్తం శక్తిని అధికారులు అంచనా వేయగలుగుతున్నారు.

బీరువాలు, ఐరన్ సేఫ్‌లు పగిలిపోయి చెల్లా చెదురుగా పడిపోయిన ఫైల్స్ కొన్ని పోలీసులకు దొరికాయి. తనమీద సాక్ష్యాధారాలతో కేసులు బనాయించే అవకాశాలు వారికి పెరుగుతున్నాయి.

అంత పెట్టుబడి యిచ్చి, అందరు నేర్పరులయిన సైతాన్‌దళం సభ్యులను యిచ్చి, అంత అమినేషన్ అందించినందుకు చివరకు ఛద్దా సాధించింది పరాజయం. కొంపల మీదికి తెచ్చాడు.

అసలా కెమికల్ వెపన్స్ అన్న ఆలోచన ఒకటి చేయకుండా ఉంటే తన వ్యాపారాలు బాగా సాగేవి. ఇప్పుడా ప్రేలిపోయిన శిధిలాల్లోంచి తన చరిత్రని త్రవ్వి తీస్తున్నారు పోలీసులు.

ఈ సంఘటన గుండెలమీద కుంపటిలా తయారయింది. ఒక వంక కారవెల్లీ బాక్స్‌లోని ఇండికేటర్ గురించి అంతా అయోమయంగా ఉంది పరిస్థితి! ఈ సంఘటన పులిమీద పుట్ర!

దీనికంతా కారణం ఛద్దా అనే ఆలోచన



నించి బయట పడలేక సతమతమవుతున్నాడు.

అలాంటి సమయంలో తల దించుకొని పిల్లిలా నడుస్తూ వచ్చాడు ఛద్దా! మళ్లీ కొంప లంటుకుపోయే ఆలోచన ఏదో చేసి ఉంటాడు. అతని వాలకం చూస్తేనే తెలుస్తోంది. కాని అతనేం చెప్పినా వినకూడదనే నిశ్చితాభిప్రాయానికి వచ్చాడు దేవీప్రసాద్.

"జూబిలీ హిల్స్‌లో మటాష్‌అయిపోయిన మన పథకాలన్నింటిని చూచి వచ్చావా?" అని అడిగాడు కర్కశమయిన కంఠస్వరముతో.

"అదెలా సాధ్యమయిందో మరి! చాలా పకడ్బందీ అయిన ఏర్పాట్లు చేసి వచ్చాను. కాని క్షణాలమీద అంతా జరిగిపోయింది."

"అవును. నీకు అర్థంకాదు. ఎందుకంటే ఈ ప్రపంచంలో అందరికన్నా నువ్వే తెలివయినవాడివి అనుకుంటావు. ఆ రోజునే ఏదైనా ఒక బహుమానం కోరుకుని ఉంటే ఎంతో బాగుండేది!

ఈ పథకాన్ని అమలుచేయటమే నీ జీవితాశయము అయినట్లు మాట్లాడావు. అది నిజమే అని నమ్మి నేను దెబ్బతిన్నాను. ఇప్పుడు మన సంస్థ తాలూకు రహస్యాల్ని టి.వి. సీరియల్‌లా ప్రజలకు చూపుతున్నారు పోలీసులు! నన్నేం చెయ్యమంటావిప్పుడు?"

"మరొక మంచి పథకం ఆలోచించాను



బాస్."

"ఈసారేం చేయదల్చుకున్నావో చెప్పు?" మాటలతో కోస్తున్నాడు. అయినా ఛద్దా నూటికి నూరు శాతం తన పరాజయాన్ని ఒప్పుకోలేదు.

"ఇండికేటర్ పాపాయి మిక్కీ మౌస్‌లో దాచింది. అందువల్ల ఎవ్వరికి అనుమానం రాలేదు. ఇప్పుడది యాక్సిడెంట్‌లో బయట పడింది."

"సెహబాష్! ఒక వార్త నగరానికంతా తెలిసిన తరువాత నీకు తెలిసిందన్నమాట! ఈ మాత్రందానికి మీరంతా ఎందుకు? ఒక స్థానిక పత్రిక చదివితే తెలియదా? దీనికోసం ఇంతమంది సైతాన్‌లు, ఇన్ని ఆయుధాలు, లక్షల లక్షల ఖర్చు.

మిష్టర్ ఛద్దా! నన్నెంత వెర్రివాడి క్రింద జమకట్టావు?" చాల అక్కసుగా అన్నాడు దేవిప్రసాద్. ఛద్దా గుండెలు అవిసిపోతున్నాయి.

"బాస్! వెంటనే దాన్ని తెప్పించే ఏర్పాటు చేసాను."

"ఇంకా తెప్పించా వనుకుంటున్నాను. ఏర్పాటు చేసే స్థాయిలోనే ఉన్నానన్నమాట! నీలాంటి అసమర్థుడికి వ్యాపారం అప్పగించాను కదా! అందుకు తగ్గ ఫలితం అనుభవిస్తాను."

ఈ మాటలు కొరడా అంచుల్లా ఛద్దాకి తగిలాయి. తన అసమర్థతని యజమాని ఎత్తి చూపుతున్నాడు. ఇంతకాలంగా వేసిన పథకాలు, చేసిన త్యాగాలు, యాగాలు కేవలం అన్ని మట్టిలో కలిశాయన్నమాట.

మంచి పనులు చేసే వారికి జీవితం అర్థంకాదు.

తప్పు పనుల్లో పుట్టి పెరిగినా జీవితం అర్థంకానేలేదు.

సమాధిలో ప్రపంచ విలయంకోసం ఎదురుచూస్తూ ఉండే ఒక ప్రేతాత్మకి, చావుకోసం ఎదురుచూసే ఒక మనిషికీ తేడా ఏమిటి?

అది విలయంకోసం ఎదురుచూస్తూ సమాధిలో జీవిస్తోంది.

ఇది చావుకోసం ఎదురుచూస్తూ సమాధి బయట జీవిస్తోంది. అంతే కదా తేడా? దైవాన్ని నమ్ముకున్నవారెవ్వరు బాగుపడరు అనిపించేది ఇదివరలో! మనిషిని నమ్ముకున్న వారెవరూ తృప్తి పడలేరనిపిస్తోంది ఇప్పుడు. అతని మనసు మీది పొరలు తెగిపోతున్నాయి.

అయినా తక్షణ కర్తవ్యాలు ఆచరించాలి కదా! పారిపోకూడదు.

"బాస్! దాన్ని తీసుకురావటం ఒక్క



సైతాన్ దళంవల్లనే సాధ్యమవుతుంది ఆ ఏర్పాటు చేసివచ్చాను ”

“ఎన్ని గంటలు పడుతుందంటావు?”

“పన్నెండు గంటల సమయం చాల న్నాడు. కాని డబ్బు కావాలట.”

“ఒప్పుకునే వచ్చి ఉంటావు ”

“అవును బాస్! మన అవుసరం కదా! ఒప్పుకున్నాను.”

“ఎంత యిస్తానన్నావేమిటి?” వ్యంగ్యంగా అడిగాడు

“కోటి రూపాయలు.”

“ఇదంతా నీ బాబు సొమ్ము అనుకున్నావా? కెమికల్ వెపన్స్ చేయిస్తానని కదా పాతిక లక్షలు ఖర్చు పెట్టించావు అదంతా బూడిద పాలయింది. పోయింది పోగా నా భవిష్యత్తుని, నా సంస్థ భవిష్యత్తుని అనుమానంలో పడేసావు. ఇప్పుడు మళ్లీ కోటి రూపాయలా?”

“ఇది చివరి ప్రయత్నం. ఫెయిల్ కాను. ష్యూర్ బాస్ ”

అయిదువందల రూపాయల నోట్లు బంచెస్ రెండువందల కట్టలకు ఒక సూట్ కేస్‌లో సర్దించి యిచ్చాడు దేవిప్రసాద్

“ఇది నీకు యిచ్చే చివరి అవకాశం గుర్తుంచుకో!” అన్నాడు నిర్దయగా!

సరే! అని తల ఊగించి డబ్బుతో బయల్దేరాడు ఛద్దా!

నగరంలో ఇదివరకటిలా స్వేచ్ఛగా తిరిగే అవకాశాలు లేవు పోలీసులు వేటకుక్కలతో గాలింపులు జరుపుతున్నారు

ఏ క్షణంలో అయినా తను అరెస్టు అయే అవకాశాలున్నాయి ఈలోగా ఇండికేటర్ సంపాదించగలిగితే దేవిప్రసాద్ ఆదుకుంటారు. లేకపోతే ఇంక ఈ ప్రపంచంలో తను ఏమయినా పట్టించుకునేవారు లేరు డ్రయివర్ సాయం తీసుకుని శివాలయం దగ్గరకు చేరుకున్నారు

ఇబ్రహీం సందులో జరిగే కార్యకలాపాలమీద నిఘా ఎక్కువ చేసేందుకు పోలీసులు చాలామంది శివాలయం దగ్గర బీటు వేశారు

తను కారు దిగేందుకు భయపడ్డాడు ఛద్దా!

“డ్రయివర్! ఇప్పుడు నీకొక పని అప్పగిస్తాను కారు నిలువు” శివాలయం ఇంకా అల్లంత దూరంలో ఉండగానే కారు నిలిచిపోయింది

డ్రయివర్ బ్రీఫ్ కేస్ తీసుకుని బయల్దేరాడు పోలీసులు అది చూడలేదు కాని శివాలయం మెట్లు చివర నిలచిఉన్న ఇద్దరు చూచారు

“ఈ బ్రీఫ్‌కేస్ ఎవరికివ్వాలో తెలుసు కదా?”



## చిన్నతెరపై మళ్లీ

### సుజాతా మెహతా

టీ.వి సీరియల్‌లో సుజాతా మెహతా మళ్లీ కనిపించబోతున్నది శ్రీకాంత్ సీరియల్ రెండవ భాగంలో ఆమెకు పాత్ర లభించింది

ఉడాన్ రెండవ భాగం, వాగ్లే రెండవ భాగం ప్రసారం కావలసి వున్నాయి కాగా గత నాలుగు వారాలుగా ప్రతి సోమవారం వాగ్లే సీరియల్‌ను దూరదర్శన్ ప్రసారం చేస్తోంది నవ్వు తెప్పించే ఆర్ కె లక్ష్మణ్ కార్టూన్ల ప్రభావం ఈ సీరియల్‌లో లోపించిందట

భూతనాథ్ ద్వారా మంజు అస్రానీ కూడా మళ్లీ టి వి లో కనిపించాలని ప్రయత్నిస్తున్నాడట.

“తెలుసుసాబ్! యిబ్రహీంకి యిచ్చిరావాలి.”

“అతనెక్కడుంటాడో తెలుసుకదా?”

“ఈ సందులో ఉంటాడు, నగరంలో అందరికీ తెలుసు ”

“కాదు శివాలయంలో గార్డు ఉండే గదిలో ఉంటాడు ”

“ఒంటరిగానే ఉంటాడా?”

“కాదు ప్రక్కన ఎవరయినా ఉండొచ్చు ”

“సరే సాబ్ యిచ్చి వస్తాను క్షణంలో ” అంటూ ముందుకి సాగాడు డ్రయివర్

మెట్లు చివర నిలబడి వారిని పరిశీలిస్తున్న యిద్దరూ ఒకరి నొకరు హెచ్చరించుకున్నారు పరిస్థితి వారికి బాగా అర్థమయింది

“రాహుల్ ఎవరో వస్తున్నారు ”

“బహుశా ఇబ్రహీంకోసమే అయివుండాలి.”

“ఒక బ్రీఫ్ తీసుకువస్తున్నాడు ” అన్నాడు చెన్ను

“దానిలో డబ్బు ఉందనుకుంటాను ”

“అవును చాల బరువుగా ఉన్నట్లు కన్పిస్తోంది ”

“చివరి ప్రయత్నాలు కదా! పెద్ద మొత్తాలే చేతులు మారతాయి ”

“ఎలాగైనా ఆ బాక్స్‌ని కొట్టెయ్యాలి ”

“ అదంత సులభం కాదు కాని నమ్మించాలి జాగ్రత్తగా!” రాహుల్ ఓ ఇన్‌స్పెక్టర్‌కి సిగ్నల్ అందించాడు అతను వెళ్లి యిబ్రహీం కూర్చున్న గది ఎదురుగా నిలబడ్డాడు

ఎంతో ఆదుర్దాతో ఛద్దా కోసం ఎదురు చూస్తున్న యిబ్రహీంకి ఆ పోలీసాఫీసరు అలా నిలబడటం తల నొప్పిలా అయింది ఇదివరకటిలా బుకాయించి, బెదిరించేందుకు ఇది సమయం కాదు

అతను రాంగ్ రూట్‌లో ఆలోచించకుండా బుద్ధిమంతుడిలా తలుపులు బిగించుకున్నాడు వెంటనే పోలీసాఫీసర్ దూరంగా పోయాడు

రాహుల్ వచ్చి తలుపులు ఎదురుగ్గా మరో వైపుకి తిరిగి నిలబడ్డాడు చేతులు తలుపుల మీద ఆనించాడు

చెన్నుడు శివాలయం ముందు మంటపంలో నిలబడ్డాడు బితుకు బితుకు మంటూ అతని ముందునించి పోతున్నాడు కారు డ్రయివర్

“ఎవరు కావాలి నీకు?” అని అడిగాడు చెన్నుడు అతనెవరో తెలియకుండా సమాధానం యిచ్చేందుకు కొంచెం తడబాటు పడిపోయాడు డ్రయివర్

“శ్రీ దేవి అలయన్స్ నించి వచ్చావు అంతే కదా!”

“అవును” అన్నట్లుగా తల ఊగించాడు ‘కాదు’ అని చెప్పాడు నోటితో!

“ఎందుకు అంత కంగారు? ఇబ్రహీంకి యిచ్చేందుకు వచ్చావా?”

“అవును” అతనికి నమ్మకం కుదిరింది

“యిబ్రహీం అదుగో అక్కడ డోరుదగర నిలబడి ఉన్నాడు చూచావా?” డ్రయివర్ తలత్రిప్పి చూచాడు అతని వీపు కన్పిస్తోంది

“ఈ ఆలయం చుట్టూ పోలీసులు ఉన్నారు చూచావు కదా!?”

“ఇక్కడేదో గొడవ జరగబోతోందనుకుంటాను” చాలా పెద్ద గొడవ! అందుకే నువ్వు

తెచ్చిన సూటు కేసు యిబ్రహీం కాళ్ళ దగ్గర వుంచి తిరిగి చూడకుండా వెళ్ళిపో! ఈ ఆలయంలో మరో రెండు నిమిషాల కన్నా ఎక్కువ సేపు ఉండ కూడదు" అన్నాడు చెన్నుడు.

ఆ మాటలు విని డ్రయివర్ కంగారు పడిపోయాడు. ఇలాంటి ప్రమాదం వుంది కాబట్టి ఛద్దా సాబ్ దిగిరాలేదు. తనను పంపించాడు. అనవసరంగా గొడవల్లో ఇరుక్కోవటం ఎందుకు అనుకున్నాడు.

"నీ కోసమే ఎదురు చూస్తున్నాడు ఇబ్రహీం! ఈ వార్త నీకు అందించేందుకు ఇక్కడ నన్నుంచాడు. అతనితో మాట్లాడాలని ప్రయత్నించకు. త్వరగా పని పూర్తి చేసుకుని వెళ్ళిపో" మరింత తొందరించాడు చెన్నుడు.

డ్రయివర్ త్వర త్వరగా ఆవైపు నడిచాడు. వాకిలి దగ్గరకి వెళ్లాడు. అడుగుల చప్పుడు దగ్గర కావడం విన్నాడు రాహుల్. కాని తల తిప్పి చూడలేదు. బిగుసుకుపోయి నిలబడ్డాడు.

డ్రయివర్ నేరుగా వెళ్లి అతని కాళ్ళ దగ్గర సూట్‌కేసు పెట్టాడు. అతను మాట్లాడకపోవడంతో కొద్దిగా అనుమానం వచ్చింది.

"సాబ్! ఛద్దా సాబ్ సూట్ కేసు ఇచ్చి రమ్మన్నారు" అన్నాడు.

"నాకు తెలుసు. ష్ త్వరగా వెళ్లిపో!"

డ్రయివర్‌కి నమ్మిక పెరిగింది. వెనుతిరిగాడు. తక్షణమే బ్రీఫ్‌కేసు తీసుకొని ఆలయం వెనుకకు పోయాడు రాహుల్! చెన్నుడు పరుగు తీసాడు. అక్కడ దాన్ని పోలీసులకు అందించాడు.

తిరిగి వద్దామనుకుంటే యిబ్రహీం మళ్లీ తలుపులు సగం తెరిచి చూచాడు. ఖ్రూమ్ ఎదురుగా ఉన్న పోలీస్ ఆఫీసరు లేడు. అదేదో యాధృచ్ఛికంగా జరిగిన సంఘటన అనుకొని తలుపులు బారలా తెరిచాడు.

ఎంతకూ ఛద్దా డబ్బు తీసుకుని రాకపోవటం అతనిలో చికాకుని కల్గిస్తోంది. అసహనంగా దిక్కులు చూస్తున్నాడు.

మరో వైపు నుంచి శివాలయానికి ప్రదక్షిణం చేసి మెట్లు మీదుగా క్రిందికి దిగి వచ్చారు ఇద్దరు.

డ్రయివర్ అప్పటికే హడావుడిగా వచ్చి తన సీటులో కూర్చున్నాడు.

"యిబ్రహీం కనిపించాడా?" అని అడిగాడు ఛద్దా.

"అవును సాబ్ కనిపించాడు! ఇక్కడేదో గొడవ జరిగేలా వుంది"

"ఎప్పుడు అంతే ఇక్కడ! డబ్బు ఇచ్చావు కదా?"

"ఇచ్చి వచ్చాను సాబ్!"

"ఏమైన చెప్పాడా?"

"త్వరగా వెళ్లిపొమ్మన్నాడు"

"అయితే త్వరగా పదా" అన్నాడు ఛద్దా!

ఎవరో తరుముతూ ఉన్నట్లుగా వారు శ్రీమహాదేవి అలయన్స్ భవనాలను చేరుకున్నారు. ఛద్దా చాలా సంతోషంగా లోపలకు పోయాడు.

దేవీ ప్రసాద్ అతని రాకకోసమే ఆదుర్దాగా ఎదురు చూస్తున్నాడు.

"వెళ్ళిన పని ఏమయింది?" అని అడిగాడు లోపలకు రాగానే.

"పండయింది" అన్నాడు ఛద్దా హుషారుగా.

"దట్స్ గుడ్! 12 గంటల్లో ఇండికేటర్ మన చేతికి వస్తుందంటావ్? అంతేనా?" అన్నాడు దేవీప్రసాద్.

"ఇంకా అనుమానంగా ఉందా సాబ్?"

"అనుమానం ఏమిలేది కాని ఆ ఇండికేటర్ నా చేతికి వచ్చేవరకు నీవు ఆ కుర్చీలోంచి లేవకూడదు. ఈ పన్నెండు గంటలు బొమ్మలా అలాగే కూర్చోవాలి? నీకు బాధగానే ఉండవచ్చు. కాని ఇది నా ఆజ్ఞ. పన్నెండు గంటలు కూర్చోవటమే నీకు నేను విధించిన శిక్ష!" అన్నాడు దేవీ ప్రసాద్. ఛద్దా కొయ్యబారిపోయాడు.

ఆ సంస్థ కోసం పన్నెండు గంటలే కాదు పన్నెండు రోజులైన కూర్చోగలడు కాని అదొక శిక్షలా అనుభవించాల్సి రావటమే అతనికి బాధగా, అవమానంగా ఉంది. అయినా తప్పదు.

దేవీప్రసాద్ ఆ గది వదిలి వెళ్లిపోయాడు.

యజమాని నుంచి ఏలాంటి ఫలితం ఆశించకుండా ఇంత కాలం సేవలు అందించినందుకు ఫలితం ఇదా? అనుకుంటూ కూర్చుండిపోయాడు ఛద్దా.

గడియారం టిక్కు టిక్కుమంటోంది బద్ధకంగా!

అదే సమయంలో గడియారం ముల్లు వంక చూచి చూచి అలసిపోయాడు యిబ్రహీం! గంటలో వస్తానని వాగ్దానం చేసిన ఛద్దా రెండు గంటలు గడచిపోయినా తిరిగిరాలేదు. సమయం జరిగిపోతే రాహుల్ ఏం చేస్తాడో తెలీదు. ఇండికేటర్ చేరవలసిన చోటికి చేరాక డబ్బు అందినా తాను చేయ గలిగింది ఏమీ ఉండదు.

అనుచరులు తొందర పడిపోతున్నట్లుగా సంకేతాలు అందుతున్నాయి. పోలీసులు ఆలయంలో వున్న తన చుట్టూ ఉచ్చులు బిగిస్తున్నారు. త్వరగా ఆ చోటి నుంచి బయటపడాలనిపిస్తోంది.

నేరుగా అలయన్స్ కంపెనీకి వెళ్లి దేవీప్రసాద్‌తో మాట్లాడి విషయం తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. తక్షణం తన గది తలుపులు మూసి వెలుపలకు వచ్చాడు.

పోలీసులు చుట్టు ముట్టి ఉన్న వాతా

వరణం అర్థమవుతూనే వుంది కాని వారికి సాక్ష్యాలు కావాలి ప్రస్తుతం తన దగ్గర ఏలాంటి సాక్ష్యాలు దొరకవు నిశ్చింతగా శివాలయం మెట్లు దిగివచ్చాడు

ముందుగా గోరీల దొడ్డికి వెళ్లి చూచు కున్నాడు ఒక్కప్పుడు తన ప్రభ పూర్తిగా వెలుగుతున్న సమయంలో అనుచరులతో కలిసి తాను సాధించిన ఘనకార్యాలు గుర్తుకు తెచ్చు కున్నాడు

ఎన్నో అల్లకల్లోలాలు ఆ కేంద్రం నుంచే నిర్వహించాడు

కాసేపు జ్ఞాపకాలతో సావాసం కట్టి గడి పాడు మంచి వారైనా చెడ్డవారైనా గత కాలపు జ్ఞాపకాలు మహత్తరమైనవి అవి మన సుని ఆర్ద్రం చేస్తాయి

ఆ విధంగా కొద్ది క్షణాలు మనిషిగా మారాడు ఇబ్రహీం

అయితే ఆ చోటుకి ఆ మంచి కోసం రాలేదు తాను ఏ చోటికి వెళ్లేది అను చరులకు చెప్పేందుకు వచ్చాడు పోలీసులను ప్రక్క దారి పట్టించేందుకు వచ్చాడు

అనుచరులు తారనాకలో నాలుగు మూలల నుంచి వచ్చారు. తాను డబ్బుతో తిరిగి వస్తే చాల పని ఉంటుందని వారిని సిద్ధంగా ఉండవలసిందని ఆదేశించాడు.

దారులు మార్చుతూ తన వెనుక గూఢ చారులు ఎవరు లేరని నమ్మకం కుదిరాక శ్రీ మహాదేవి అలయన్స్ సంస్థను చేరుకున్నాడు. అతని కోసం తలుపులు అన్నీ తెరిచి ఉన్నాయి.

ఇబ్రహీం వచ్చాడనే వార్త అందగానే తన సమస్యలు అన్ని తీరిపోతున్నాయనే ఆశతో పరు గున వచ్చాడు దేవీప్రసాద్! ఛద్దా కన్నుల్లో తళుకులు కన్పించినాయి

కాని యిబ్రహీం కళ్లు ఎర్రగా మండుతు న్నాయి

"తరచు నీవు నాకు కనిపించకపోయినా ఈ వ్యాపారాలన్నింటికి నీవే సూత్రధారు డివి ఇబ్రహీం! మన సంస్థలు మల్టీ నేషనల్ స్థాయికి ఎదిగాయంటే ఈ ఘనకార్యంలో నీ పాత్ర చాలా వుంది వెళ్లిన పని పూర్తి అయిందా? ఇండికేటర్ తీసుకు వచ్చావా?" ఎంతో ఆశ నిండిన కంఠ స్వరంతో అడిగాడు దేవీప్రసాద్

అతని మనసులో ఎంత దురాశ ఉన్నా క్రింది వారి దగ్గర తనెప్పుడు అది బయట పెట్టుకోలేదు

ఇప్పుడు ఎదురయింది జీవన్మరణ సమస్య! కాబట్టే బయట పడిపోయాడు ఇబ్రహీం కళ్లు మర్రింత ఎరుపెక్కాయి

"బాస్! మా భవిష్యత్తు మీకు తమా షాగా ఉందా? ఇండికేటర్‌ను సంపాదించేం దుకు సైతాన్ దళం కోటి రూపాయలు డిమాండ్ చేసింది ఈ ఛద్దా చేతులు

## శత్రుసంహారం

ముడుచుకుని ఇక్కడ కూర్చున్నాడు"

"నేను అక్కడ పోలీసులతో చిక్కుపడి ఎదురు చూచి విసుగు పుట్టి మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు కోపంగా

కూర్చున్న కుర్చీలో ఎగిరిపడ్డాడు ఛద్దా

"ఇది మోసం! దగా! వంచన! ఇంత నేరుగా ఛీట్ చేయాలనుకుంటున్నావా? ఇబ్రహీం! నీ ప్రాణాలు తీస్తాను" అన్నాడు

దేవీప్రసాద్ కనుబొమలు ముడిపడ్డాయి కళ్లు రెప్పలతో సహా ఎరుపెక్కి ఉగ్రమూర్తిలా అయ్యాడు

"ఏం జరిగిందసలు?" అన్నాడు క్రోధ వివశుడైపోయి

"డ్రయివర్ చేత నేను డబ్బు పంపిం చాను" అన్నాడు ఛద్దా హతాశుడై

"డ్రయివర్ చేత పంపించావా? నువ్వె క్కడున్నావు?"

"కార్లో కూర్చున్నాను"

"డబ్బు నేను తీసుకున్నానా?" ఇబ్రహీం ఇరుకునపడిపోయాడు

"వాకిలి దగ్గర నిలబడి వున్నావు తలు పులు మూసి వున్నావు నీ కాళ్ల దగ్గర బ్రీఫ్ ఉంచాడు డ్రయివర్ పోలీసు నిఘా వుంది కాబట్టి త్వరగా వెళ్లిపొమ్మని నీవు సైగ చేశావు" జరిగింది చెప్పాడు ఛద్దా

అంత సీరియస్ మూడ్‌లోంచి విరగబడి నవ్వాడు ఇబ్రహీం

"యూ ఫూల్! తలుపులు మూసిన ప్పుడు నేను లోపల ఉన్నాను బహుశా డ్రయి వర్ పోలీసుల ట్రాప్‌లో పడిపోయి ఉంటాడు ఆ రాహుల్ మిలటరీ ఆఫీసర్. చాలా తెలివైనవాడు అతనైనా నిన్ను మోసగించి ఉండాలి!

నీవన్నీ శకుని ఆలోచనలు! ఎవరు నిన్ను నమ్ముతారు వారినే నువ్వు ముంచేస్తావు" అన్నాడు ఇబ్రహీం

ఆఖరు నిమిషాల్లో ఇలా దగాపడినందుకు ఎన్నడూ రానంత కోపం వచ్చింది దేవీప్రసాద్‌కి!

"ఛద్దా! నిన్ను సోదరుడిలా గౌరవిం చాను నీ అతి తెలివికి నా వ్యాపారాలు అన్ని అప్పగించి మోసపోయాను

ఇబ్రహీం ఈ పీనుగని ఒక్క క్షణం కూడా బ్రతకనివ్వకు ఎంత క్రూరంగా చంప గలవో ఇతనిని అంత క్రూరంగా చంపు అది నా కళ్ళ ఎదుటే!" అంటూ ఆదేశించాడు దేవీప్రసాద్

ఆ సంస్థ అభ్యున్నతికోసం, దేవీప్రసాద్ అంతర్జాతీయ వ్యాపారవేత్తగా మారడంకోసం తాను చేసిన కృషి, త్యాగాలు అన్నీ వృధా అయినాయి.

చివరకు ఇలా చరిత్ర హీనంగా విషాదంగా క్రూరంగా చనిపోవడం ఛద్దాని పాతాళానికి తీసుకుపోయింది

మనస్సంతా శూన్యమై కుప్పకూలిపో యాడు

ఇబ్రహీం అడుగులు ముందుకు పడుతు న్నాయి.

** ** **

ముందుగా నిర్ణయించుకున్న పథకం ప్రకారం వేరువేరు దారుల్లో కొన్నివంద లమంది పోలీసులు ఆ భవనాలను చుట్టుము ట్టారు ముందు గార్డులను లొంగదీసుకొని ఇంటర్‌కం టెలిఫోన్ వ్యవస్థను నాశనంచే శారు.

## డింపుల్ 'ఇయర్'

గత ఏడాది డింపుల్ కపాడి యాకు చిత్రావకాశాలు మృగ్యమైపో యాయట. అదీగాక 'ఏ ఆగ్ కబ్ భుజేగి' చిత్రం కొన్ని రీళ్లు పూర్తయ్యాక డింపుల్ కపాడియాకు బదులుగా రేఖను తీసుకొని సునీల్ దత్ అవమానపరచటంతో అసలే సినిమాలు లేక బాధపడుతున్న డింపు ల్‌కు పుండు మీద కారం చల్లిన ట్లయిందట. అందుకే ఈ ఏడాది తొందరపడి చిత్రాలు ఒప్పుకోవడం లేదు తనకు నచ్చిన పాత్రలయితేనే ఒప్పుకుంటోందట.

శశికపూర్ నిర్మించే 'అజూబా' లోను, ముజఫర్ ఆలీ 'జానీ' చిత్రం లోను డింపుల్ నటిస్తోందట



అందుకే ఈ ఏడాది డింపుల్ కపాడి యాకు విజయవంతమైన సంవత్సరం కాగలదని అనుకుంటున్నారు

ముందు రాహుల్ ప్రక్కనే కమీషనర్! ఆ వెనుకచెన్నుడు పోలిసాఫీసర్స్ వచ్చారు. పీయూష బలగాన్ని వెంటబెట్టుకుపోయి కార్యాలయంలోని ఆయువుపట్టులన్నీ చూపుతోంది.

ఎవరూ ఊహించని మెరుపుదాడి ! రాహుల్ నేరుగా దేవీప్రసాద్ ఛాంబర్ వరకు చొచ్చుకుపోయాడు. వారు నడుస్తుండగానే లోపల జరుగుతున్న దృశ్యం వారికంట పడింది.

ఇబ్రహీం యజమాని ఆదేశాన్ని అందుకొని ముందుకొచ్చాడు. ఛద్ద మానసికంగా కృంగిపోయాడు. ప్రతిఘటించేశక్తి లేదు. ఇబ్రహీం బలమైన బాహువుల్లో అతని శరీరం వ్రేలబడింది.

అతని కంఠాన్ని బలంగా పట్టుకున్నాడు ఇబ్రహీం ! భయంకరంగా నాలుక వెళ్లుకొచ్చింది. బెల్టు నుంచి ఛురికలాగి నాలుకను కోసివేసాడు ఇబ్రహీం.

"అంతకన్నా భయంకరంగా చంపాలి" అన్నాడు దేవీప్రసాద్ ! ఇబ్రహీం ఛురికను ఛద్దా చెవిలోకి దింపేసాడు. అది మరోవైపు నుంచి బయటకు వచ్చేసింది. చావుకేకపెట్టాడు.

"మరింత భయంకరంగా చంపాలి" పిశాచం పట్టినవాడిలా గొంతు చించుకుని అరిచాడు దేవీప్రసాద్!

కార్టూన్లలో కాస్త క్వాలిటీ చూసి ప్రచురించమని మీకు లెటర్ రాసాను అందిందా సార్

అందింది వచ్చే సంచిక నుంచి మీ కార్టూన్లు నిలిపి వేస్తున్నాం

ఎడిటర్

భగవాన్..

## శత్రుసంహారం

మరేదో చేయబోయాడు యిబ్రహీం!

కాని అప్పటికే కమీషనర్ అతని మీద రివాల్వర్ గురిపెట్టాడు.

"మూవ్ బ్యాక్" అని అరిచాడు. ఛద్దాని వొదిలేశాడు యిబ్రహీం !

అతను నేలమీదకి వొరిగి రక్తపు మడుగులో పడిపోయాడు.

"మూవ్ బ్యాక్" కమీషనర్ మరో అడుగు ముందుకేశాడు.

దేవీప్రసాద్, యిబ్రహీం చేతులుపైకెత్తి వెనక్కినడుస్తూ వెళ్లి గోడకు అతుక్కుపోయారు.

ఆ తరువాత వారికి కదిలేదారిలేదు ! పోలీసుబలగం వారిని చుట్టుముట్టింది.

** ** **

"నీ ధైర్యసాహసాలకు తగినవిధంగా హోంగార్డువయ్యావు. నీ శక్తిని సమాజశ్రేయస్సుకి వుపయోగించాలి" అంటూ పీయూషకి సలహాయిచ్చాడు పోలీసుకమీషనర్ !

"పాపా ! పీయూష అంటీకి సెల్యూట్ యివ్వమ్మా" అంది తన్వి.

"అలాగేమమ్మీ ! " అంటూ నాలుక వెళ్లబెట్టింది పాప !

తన్విముఖం సిగ్గుతో మందారమొగ్గలా అయింది.

"బాలవాక్కు బ్రహ్మవాక్కు కావాలి" అక్కడున్న చెన్నుడు అన్నాడు. అందరూ ఆ శుభ ముహూర్తంకోసం ఎదురుచూస్తున్నారు.

(అయిపోయింది)

# సాహితీ పజిల్ గెల్చుకోండి రు. 200



# గళ్లనుడికట్టు-25

## ఆధారాలు

**నిలువు**

1. నిలవటానికి ఇది కూడ లేక పోతే మరీ అనాథ.
2. శివప్రీతి సంపద ఫలము.
3. కర్ణుని వంటివాడు గాంధారి కొడుకు.
4. కొలిచేదే దిక్కుల్ని మోసేది.
7. యజ్ఞ సూత్రము.
9. క్రింద నుండి భద్రాచల రాముని సేవించిన అక్క.
11. సముద్రములోది అం‌‌‍ ‍రికి కావాలి.
12. ప్రియమైన భార్య.
14. ఇప్పటి మేడల స్థానంలో పూర్వం ఉండేవి.
15. విఫలం చెందకపోడి

**అడ్డం**

2. లక్ష్మీదేవి గొప్ప నటి.
5. గేదె ఉంటే ఇది తప్పదు.
6. కుక్క మొరిగితే వీడి పరపతి చెడదు.
7. వీరమునకు జమచేయండి విమ్మ
8. బుడ బుడలాడే డక్క.
10. ముని చేతిలో కర్ర ఎద్దుని తోలుతుంది.
12. ప్రియంగా మాట్లాడే కుం తల చెలికత్తె.
13. చిన చేపను పెద చేప పెద చేపను తిను పెను చేప.
15. తలనుండు విషము ఫణికిని.
16. ఇప్పుడు పత్రిక భలే ముద్దొస్తున్నది.

ఆధారాలున్నాయి. నుడికట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి. ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు.200/-లు బహుమతి లభిస్తుంది-ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే. -ఎడిటర్

## ముగింపు తేదీ: 5-3-'90

—కూర్పు : పింగళి వి. కృష్ణారావు

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపినవారి పేరు.......................................

పూర్తి చిరునామా.......................................

.......................................పిన్ కోడ్.......................

# గళ్లనుడికట్టు-23
## ఫలితాలు: బహుమతులు

వం...లాదిమంది పాఠకులు అత్యంత ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొన్నారు. వారందరికీ మా అభినందనలు. ఐతే సరైన సమాధానాలు ఏ ఒక్కరూ వ్రాయలేక పోయారు. ఆశ్చర్యంగా వుంది. ఒక తప్పుతో వ్రాసిన పదిమందికి బహుమతి మొత్తం రు. 200 లను పంచగా ఒక్కొక్కరికి రు 20ల వంతున వచ్చింది. త్వరలో వీటిని నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. పజిల్ ఒకరు ఎన్నికూపన్లైనా పంపవచ్చు. కాని ఒక్క బహుమతికే అర్హులు. తెల్లకాగితంమీద వ్రాసిన కూపన్లు చెల్లవు. పత్రికలో కూపన్ నే నింపి పంపాలి. మీరు పంపిన జవాబులు మావద్దగల సీలు చేసిన జవాబుకు సరిపోవాలి.

-ఎడిటర్

### ఒక తప్పుతో వ్రాసిన వారి పేర్లు

వింజమూరి సుబ్బలక్ష్మి (వరంగల్), పి. వాణికృష్ణ



(హైదరాబాదు), వి. వి. పార్వతీశం (వరంగల్), డి. ఉమాదేవి (కొంగలవీడు), టి. శ్రీను (కాజీపేట), డి. రాజరాజేశ్వరి (విశాఖపట్నం), ఎ. హైమవతి (నందివెలుగు), సి. వి. కె. వై. శర్మ (గుంటూరు), ఎస్. సిహెచ్. శాస్త్రి (ఖమ్మం), వి. శిరిషం ( వరంగల్).



## సీరియల్స్

16-2-90 "అమల" ముఖచిత్రంతో ఆంధ్రసచిత్రవారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది. "సూపర్ హీరో" సూపర్‌గా వుంది. చల్లా సుబ్రహ్మణ్యంగారి "లవ్ గేమ్" సీరియల్ ఆసక్తికరంగా వుంది. ప్రయాగ రామకృష్ణగారి "ద్రౌపది" సీరియల్ అనూహ్యమైన మలుపులతో "పత్రిక" ఎప్పుడొస్తుందా..

ఎంత వేగంగా చదివేద్దామా అన్నంత అతృతగా వుంది. "టిట్ ఫర్ టాట్" "యువతా కవితా" "ప్రశ్నావళి" శీర్షికలు బావుంటున్నాయి. ప్రతివారం "సంపాదకీయం" చాలా విజ్ఞానదాయకంగా వుంటోంది. "సినిమా-సినిమా" శీర్షిక దయుంచి ఎత్తేయండీ. ఎందుకంటే ఎన్నో సినీవారపత్రికలు వున్నాయి కాబట్టి. ఆ శీర్షికకు బదులు వారానికో "దేశనాయకుని జీవిత గాథ"ను మధ్య పేజీలో ఫొటోలతో సహా ప్రచురిస్తే చాలా బావుంటుందని నా సలహా. సలహా ఇవ్వటం సులువు. పాటించడం చాలా కష్టమనుకోండిగానీ పాఠకుల సలహాలను పాటించటం కూడా మీ బాధ్యత కదండీ. అందుకే తప్పుగా ఏమైనా వ్రాస్తే క్షమించగలరు.

మహ్మద్ రఫీ, (శ్రీకాకుళం)

* * *

మన్నెం శారదగారి "సూపర్ హీరో" సీరియల్ సింప్లీ సూపర్బ్ మంచి సీరియల్స్, కథలు అందించడంలో అందె వేసిన ఆంధ్రపత్రిక కీర్తి కిరీటంలో వెలుగుల జిలుగులు రువ్వుతున్న సూపర్ హీరో సీరియల్ గురించి ప్రశంసిస్తూ ఎంత రాసినా కొంత కొదవే.

## వీక్లీపోస్ట్

ఉత్తమ రచనకు, వాస్తవ రచనకు, ఉన్నత శైలికి మీరు అందించే ప్రోత్సాహం పాఠక లోకానికి ఉత్సాహం–

– కామేశ్వరమ్మ
పురాణం హనుమాయమ్మ
డోగిపర్రు.

* * *

మూడు నెలలు తరువాత వెలుగులోకి అడుగిడిన మీ (మా) పత్రిక "సూపర్ హీరో" సీరియల్‌తో మరింత గొప్పగా వెలిగి పోతున్నది ఏ వారానికి ఆ వారం పత్రిక కోసం ముఖ్యంగా సూపర్ హీరో కోసం ఎదురు చూడడం ఎంతో థ్రిల్లింగ్‌గా ఉంది ఈ ఘనత మీకు, మీతో పాటు ఓ మంచి సీరియల్‌ని పాఠకులకి అందిస్తున్న రచయిత్రి గారికి దక్కుతుంది అనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు

– ఎం. కుసుమాంబ, వరంగల్

## మనసు

'మనిషిలోని మనసు' బాగుంది. తలచెడి పుట్టింటి కొచ్చిన స్త్రీల ప్రవర్తన వెనకనుండే అంతరంగం చిత్రించబడింది. భార్యాభర్తలు ఏకశయ్యా శయనం చెయ్యడం వారికి ఈర్ష్య, అసూయ కలిగిస్తుందని అంతా అనుకుంటారు. కాని దాని వెనక 'తనకేమీ లేదే' అన్న బాధ దాగుంది. దానిని మరదలు గుర్తించి తన పిల్లల్ని అప్పగించడంతో తీరిపోయింది. రచయిత్రి అభినందనీయురాలు.

ఈ సమస్య తెచ్చే చికాకు ఎంత బలీయమైనదో సమస్య అంత సున్నితమైనది. దాన్ని అర్థం చేసుకుని పరిష్కరించడంలో వివేకం వుంది. చక్కని సమస్య మంచి పరిష్కారం.

బాధ్యత పెరిగిన పాఠకులు దీన్ని అభినందించగలరు. సమస్యలనుంచి పారిపోయి, కాలక్షేపానికి కథలు చదివే ఈ కాలంలో పత్రిక ఈ కథ ప్రచురించడం గమనార్హం.

అవసరు శంకరనారాయణరావు,
విశాఖపట్నం.

> **గమనిక**
>
> సకాలంలో అందని కారణంగా ఈ సంచికలో "ఈవారంలో మీయోగం" వేయలేకపోయాము.
>
> -సం.

## కథలు

16-2-90 అమల ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా చక్కగా రూపొందించారు. ఈ సారి మనిషిలోని మనస్సు బి. జ్యోతి గారి కథ మమ్మల్ని కదిలించినది. ఉషా పాత్ర మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నది. కామాక్షిలాంటి వాళ్లు ఉండే ఈ కాలంలో తరమడానికే చూస్తున్నారు. అలాకాక ఉషా త్యాగబుద్ధి ఓర్పుతో దేనినైనా జయించవచ్చును అని చక్కగా వ్రాసినారు. ఈ కథ చదివితే మనస్సు ఉన్న వాళ్లు, మారక తప్పదు. ఈ కథ అందించినందుకు

శుభ అభినందనలు. చల్లాగారి లవ్ గేమ్ నిజంగా సూపర్. నవ్య స్వాగత్ పేర్లు చక్కగా కుదిరినాయి. ఈ సీరియల్ చాలా సరదాగా ఉన్నది. బజారులో పత్రిక వస్తే పరుగున వెళ్లి తెచ్చుకుంటున్నాము అంటే నమ్ముతారు కదూ!

పప్పాల భాను

## లంగ్స్

మొన్నటిదాకా మన పత్రికను చు ఓల్డెస్ట్ ఆఫ్ ఆల్ వీక్లీస్"గా తలపోసే వాణ్ని ఒక్ వేటి నైజాన్ని బట్టి చూస్తే "ది ఓల్డెస్ట్ అండాలో, – గ్రేటెస్ట్ ఆఫ్ ఆల్ వీక్లీస్" అని ఇ స్పష్టమవుతుంది'

2-2-'90 సంచికలో– ఊపిరి ఉంటేనే కదా బ్రతుకు 'లంగ్స్'కి వచ్చే వ్యాధులు వాటి వైనం' సచిత్ర, సమగ్ర వ్యాసం– ధూమపాన ప్రియులను హెచ్చరించేదిగా వుంటూ– 'లంగ్స్'పై విలువైన పరిజ్ఞానాన్ని అందించింది. డా ఆషిష్ బి. ఘోషాని హాస్పిటల్ అడ్రస్ ఇవ్వాల్సిందిగా చివర్లో (నా) రిక్వెస్ట్" – జ్యోషి శ్రీధరాచార్యప, అయిజ

Editorial Adviser: *S. RADHAKRISHNA*, Editor: *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones Editorial: 75667, Business· 61247, 61248